# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

సెప్టెంబరు 1955

సంపుటము 32 : : సంచిక 9

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## సెప్టెంబరు 1955



త్రివర్ణ చిత్రము : సిద్ధనాగార్జునుడు—చిత్రకారుడు: శ్రీ కస్తూరి భాస్కరరావు.



సిద్ధనాగార్జునుడు

చిత్రకారుడు : శ్రీ కస్తూరి భాస్కరరావు

# నిరుక్తము

శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

నా యెద మూలమట్టమున నైజపు తీయని పాలమూట లే
వో యువమూరి నన్నొక మహోదధిగా పొనరించెడిన్ శరీ
రాయితమైన రూపము రసాకృతిగా చెలువొంది నాకు నౌ
రా! యొడలంతయున్ హృదయమై హృదయంబు రసానుభూతియై

నా కేదో యొక పూర్వజన్మమునయం దై కర్మబంధమ్ములే
వో కల్పించెన? దేహబంధితగుణాంభోవాహ రూపమ్ము లె
ల్లే కాకుండిన దేహ మేమిటి? మరిల్లే సర్వవాళ్ళిల శో
భాకల్పాకృతిగా హృదంతర మహాంప్రాణమ్ముగా నుండెడిన్.

నా యెదలోని తియనిదనమ్ములు నన్నును ముగ్ధజేయుచు
న్నాయి రసప్రపంచ పరిణాహ మహాః పరిమాణముల్ మనః
స్థాయికి నిత్యనూత్న పరిధామములై రసరాజధాని రే
ఖాయతి రమ్యరమ్యపరిఖా పరిణామ విశిష్టమార్గముల్.

అధిగత మీ మనోగమనమందలి యందపు తెల్లచారికల్
ప్రథిత గిరాంప్రమాణ పరివర్తనముల్ కవితా ప్రసన్నతా
పృథుకము లాత్మవైభవ నవీనసనాథ రహస్య ధర్మముల్
మధుర మహానుభూతి గత మార్గసహోదరముల్ జయించెడిన్.

మెత్తని పాలవెన్నెలల మీగడకట్టిన వీ రసధ్వనుల్
గుత్తులు పూచి సౌరభము క్రొన్ననలైనవి భావకల్పనల్
చిత్తమునన్ ప్రచార దశ చెందిన యట్టి నిరుక్తకారణం
బాత్త జయప్రసిద్ధ మధురాధికసాధనహేతు వయ్యెడిన్.

# ఉత్తమా యిల్లాలు

లారెన్స్ ఆస్‌గుడ్

క్రిస్టియన్ అంటే క్రిస్టియన్ రూత్ సంగతి చెప్పి తరవాత మరొకర్ని చెప్పాలి; రూత్‌తో పరిచయంగల ప్రతి ఒక్కరూ అనేమాటే ఇది. ఆమెతో అనేక కుటుంబాలకు పరిచయంవుంది. భార్యాభర్తలు ఇలా కాస్త వెన్ను తిరిగి వాళ్ళల్లో నుంచి బయటికి వచ్చేయగానే మిగతా వాళ్లు ఇదే సంగతి చెప్పుకుంటారు. ఇంకా రూత్‌కు సన్నిహితులూ ఆత్మీయులు అయినవాళ్లు "క్రిస్టియన్ అంటే క్రిస్టియనే కాదు ఆత్మబలిదానం చేస్తున్న మహావ్యక్తి" అంటారు, అత్యంతగౌరవ పురస్సరంగా. కాని ఆ అభినందనవాక్యంలో ఎక్కడో రేఖగా కించిత్తు చిరాకు కూడా ధ్వనించుతూ వుంటుంది. భర్త చార్లెస్ అధికారంలో రూత్ అనుభవించుతున్నలాంటి హింస, ఆత్మబలిదానం చేసిన యే క్రిస్టియన్ మహావీరుడూ, దైవద్రోహియైన యే కిరాతచక్రవర్తి అధికారంలోనూ ఎన్నడూ అనుభవించలేదు. అతను పెట్టనిహింస అంటూ లేదు. ఏ క్షణాని కా క్షణం బ్రతుకు బజారులో పెట్టేస్తూ వుంటాడు. ఇంటికి ఏ పెద్దమనిషినైనా భోజనానికి పిలవటం భయం; తప్పతాగి అడ్డమైన పిచ్చివాగుడూ వాగి ఆ పెద్దమనిషి ముందే అల్లరిబాజా చేసేస్తాడు. ఏ చిన్న పార్టీకి స్నేహితులను ఆహ్వానించుదామన్నా వాళ్ళముందు ఆ యీ పరాయివాళ్ళ భార్యల్ని గురించీ కూతుళ్లనుగురించీ యిష్టమొచ్చిన అసభ్య ప్రస్తావనంతా చేసి సిగ్గొచ్చి బుగ్గ గరుచుకునేలా చేసేస్తాడు. ఇలా సినిమాకి వెంటవెడితే బిగ్గరగా మాట్లాడటమో, హాలు ఎగిరిపోయేట్టు గుర్రుకొట్టేయటమో ఏదో ఒకటి చేసేస్తాడు. ఈ అవమానాల హింసనంతా ఆ మహాతల్లి 'ఊ' 'ఆ' అనకుండా కిమినాస్తిగా భరించుతూ వుంటుంది. భరించటమే కాదు—భర్త చేసే అవమానానికి ఆవిడ ప్రతిక్రియ అనురాగాన్ని అందచేయటం, క్రూరత్వానికి ప్రతిక్రియ దయ, బూతు కూతలకు ప్రతిక్రియ క్షమ—ఈవిధంగా అతని కిరాతకరమైన దాడుల నన్నిటినీ ఎదుర్కొంటోంది. ఒక చెంపమీద కొడితే తిరిగి రెండో చెంప అందించుతూ—క్రిస్టియన్ సౌశీల్యాన్ని సర్వాత్మనా నిర్వహించుకొంటోంది—ఆ మహా యిల్లాలు.

పెళ్ళి చేసుకుని కాపురాలు చేస్తున్న రూత్ స్నేహితురాండ్రంతా వధూగృహాల్లో ఏకాంతంగా కూర్చుని ఆవిడ సౌజన్య సౌశీల్యాన్నే మననం చేస్తూ వుంటారు. రూత్ ప్రవర్తన నిజానికి మహోన్నతమైనదే అయినా దాని అట్టడుగున భయంకరమైన వివేకశూన్యత కూడా వున్నట్టు వారి వారి అంతరాత్మలకు తోస్తూ వుండేది. కాని చిరకాలంవరకూ ఈ విషయం ఏ ఒక్కరూ మరొకరితో పన్ను కదిపి బహిరంగంగా అన్నది లేదు. నిలువుటద్దాలముందు నిల్చుని అనుకునేవాళ్లు: ఈ చెంపమీద కొడితే ఆ చెంపచూపటం యోగ్యమైనమాటే అయినా ఒకొక్కప్పుడు దెబ్బకుదెబ్బ తీయవలసిన అవసరం వుంటుంది; అగ్నిని అగ్నితోనే ఎదుర్కోవాలి; ఇలా అనుకుంటూ, చేతులోవున్న దువ్వెనతో కేశపాశాన్ని 'సర్'న ఆవేశంగా దిగదువ్వేసేవారు. ఏది ఏమైనా, ఆవిడ అంటే వాళ్ళంతా చాలా ఇదిగా వుండేవాళ్లు. ఒకనాడు ఇలాగే ఎల్లిస్ మార్ష్, 'మాకారూ! రూత్ ఎల్లాంటి ఉత్తమా యిల్లాలో ఎన్ని దెబ్బలు తిన్నా సరే యీ చెంపకొడితే ఆ చెంపచూపటం తప్ప మరొకటి లేదు' అని భర్తతో అనేసరికి అతగాడు 'నిజానికి దెబ్బదెబ్బకీ ఒక చెంప అందించుతున్నదంటే, రూత్‌కు 'హైడ్రా'కున్నట్టు సహస్రాధికంగా తలలు వుండి వుండాలి' అన్నాడు. ఆ అవినయవాక్యానికి ఆసతి కోపించినదై వామపాదంతో తాపు తన్న లేదుగాని చేతిలో వున్న దువ్వెనతో అతగాడి మునికట్టుమీద గట్టిగా ఒకటి వడ్డించింది. అలా తాడితుడుకావటమే గాక తస్యాః క్రోధాత్ నాటి రాత్రి కేళి గల్లంతై అటుమటించి ఆకులు మేశాడటకూడా.

నిరంతరం ఇటూ అటూ ఊగిపోతున్నట్టు రూత్ స్నేహితులచేత ఊహింపబడుతున్న ఆబుగ్గలు

జానికి చాలా అందమైనవి. వాటి లాలిత్యాన్ని స్ఫురణకు తెచ్చుకున్నప్పుడు వారికి మరింత బాధ కలిగేది. అలాంటి బుగ్గలున్న రూత్, ఒక్క చార్లెస్‌ను పట్టుకునే వేగాలిసిన పనేముంది? తను కోరుకున్న యే మొగాణ్ణిబడితే ఆ మొగాణ్ణి ఇట్టే ఆకర్షించి పెళ్ళిచేసేసుకోవచ్చు. [మొగాళ్ళంటే, పెళ్లయిన మొగాళ్లజోలికి పోదనుకోండి; రూత్ అల్లాంటి దుర్మార్గం మనిషి కాదుగా! — అంతగా వస్తే భగ్నహృదయంలో భస్మమైపోతుందిగాని పరాయివాళ్ళ భర్తల్ని కాజేసే రకం కాదు.] ఈవిధంగా, వసివాడని ఆమె సౌందర్య వన్నెచెడని భర్తృపరతంత్రబుద్ధీ, అటునుంచి చార్లెస్ కిరాత కృత్యాలూ యివ్వన్నీ తలుచుకుంటే ఆవిడ అనుయాయులంపరి చిరాకెత్తిపోతోంది. చిరాకు రూత్ మీదకాదు రూత్‌కోసం.

ఇలావుండగా సెప్టెంబర్ మాసంలో ఒకనాటి మధ్యాహ్న సమయాన, విశ్వకీర్తితులైన ఆ బుగ్గలు ఆమె పాణిపంకజాల్లో నిక్షిప్తములై వుండగా, వంట గదిలో బల్లమీద సువాసనలు వెదజల్లుతున్న కప్పుకు ఇరుప్రైపులా తన మోచేతులానించి రూత్ విశ్రాంతితీసుకుంటోంది. మధ్యాహ్నం వరకూ నిర్వర్తించవలసిన గృహకృత్యాల నన్నిటినీ నెర వేర్చుకుని తిరిగి వంటకు ఉపక్రమించేలోగా కాసేపు అలా ఒంటరిగా కూర్చుని విశ్రాంతి తీసుకోవటం, ఆవిడకు రోజూ అలవాటు. మరో గంటకు చార్లెస్ ఆఫీసు నుంచి యింటికి తిరిగి వస్తాడు. అతను తిరిగి వచ్చే లోగా ఈ కాసేపూ అలా టీ కప్పు ముందుకూర్చుని, గత 24 గంటలలోనూ అనుభవించిన కష్టాలవల్ల కల్గిన వ్యధాభారాన్నంతా ఉపశమింప చేసుకోవటానికి ప్రయత్నించుతూ వుంటుంది. అలా కొంచెంసేపు కూర్చుని టీ కప్పు కడగటానికి లేచే సమయానికి ఆవిడకు ఆత్మాభినివేశం కలిగిపోతుంది, ఏనాటి కానాడు, ఇంతవరకూ సమర్థించుకొచ్చిన సమస్యలన్నీ, ముందు రాబోయే పరిణామాలనన్నిటినీ కూడా సమర్థించగల దనటానికి ఒక రకమైన యోగ్యతాపత్రాలు!

ఈనాడు రూత్ యోజించుతున్న సమస్య పూర్వపు సమస్యలన్నిటికంటే అత్యంత క్లిష్టతరమైనది. అందుచేత రూత్ హృదయం, నిటునిలువుగావున్న పర్వతాన్ని అధిరోహించటానికి ప్రయత్నించుతున్న మోటారు కారులాగు టాప్ గేరులో ఆందోళన చెందుతోంది. రూత్ వివాహమై మూడు సంవత్సరాలైంది. ఇంకో వారం రోజులకు వివాహవార్షికోత్సవం జరుపుకోవాలి. క్రితం రాత్రి ఆ విషయం చార్లెస్‌కు జ్ఞాపకం చేసి ఆ నాడు జరగవలసిన వేడుకల విషయం యేమిటని అడిగింది. అంతా విని చార్లెస్ చాలా అసభ్యకరమైన సమాధానం చెప్పాడు. దాంతో రూత్ ఆ విషయం వదిలేసింది. కాని ఆ నాడు లాంఛనంగానైనా యేదో వొకటి జరగాలి. తన పుట్టింటివాళ్ల గౌరవ మర్యాదలు నిలవటానికై అలాంటి నటన యేదైనా కొంత జరక్కపోతే వాళ్లకు తల కొట్టేసినట్టుగా వుంటుంది. ఆదిలో రూత్ చార్లెస్‌ల వివాహంపట్ల వాళ్లంతా ఎంతటి ఉజ్వలమైన ఆమోదాన్ని ప్రకటించారో, యిప్పుడీ దాంపత్యాన్ని అంత కంటగించుకొంటున్నారు. అందుచేత కుటుంబ గౌరవ దృష్ట్యా లాంఛనంగానైనా ఏదో తంతు జరపకపోతే వాళ్లు మరీ యిదౌతారు. వాళ్లినల్లా కించపరచకూడదు. చార్లెస్‌ను వాళ్లు గర్హించుతూ వుండటం అదేమంత ప్రధాన విషయం గాదు. వాళ్ల గౌరవ మర్యాదలు పోతున్నాయనేగా వాళ్ల విచారం. ఈస్థితిలో అసలు తన వివాహబంధమే విచ్ఛిన్నమయిపోయిందని బహిరంగంగా ప్రకటించి వాళ్లకి మరింత తలవంపులు తేగూడదు. నిజానికి వివాహ వార్షికోత్సవం జరక్కపోతే దాన్ని అలాంటి బహిరంగ ప్రకటనగానే తీసుకుని వాళ్లంతా వేదన పడవచ్చు. వీళ్ల సంగతే గాదు. రూత్ స్నేహితురాండ్రమాటో? ఆ నాటికి మొదలు కుండా పూరుకుని, మర్నాడు ఉదయమే టెలిఫోన్లో పిలిచి, ఆ ప్రమేయ మేదీ సూటిగా ఎత్తకుండానే, ఏదో సానుభూతి చూపుతున్నట్టూ, ఓదారుస్తున్నట్టూ మాట్లాడుతారు. రెండు కారణాలుగా ఇలాంటి సానుభూతి అవాంఛనీయమైనది. వాళ్లు అలా సానుభూతి చూపటమంటే, అది ఒక విధంగా చార్లెస్‌ను గర్హించటమే. నిజానికి అతని వెన్ను చాటున అలాంటిది ప్రచారం జరగడం చాలా అన్యాయమైన విషయం. రెండవది తనేమీ బాధపడని దానికి పరులు సానుభూతి చూపటం రూత్‌కు చాలా అసహ్యం.

ఇవన్నీ ఇలావుండగా చార్లెస్ సంగతి కూడా ఆలోచించవలసి వుంది. పైకి ఎంతకోపంగా కనిపించుతున్నా చార్లెస్‌కు కూడా హృదయముంది. తన చర్యలకు తాను లోలోపల పశ్చాత్తాపపడ్డా బాధపడు

తూనే ఉంటాడు. వివాహవార్షికోత్సవ ప్రసక్తే రాకుండా అంతా విస్మరించి వేయబడినట్టు ఆ దినం గడిచిపోతే అతనికి లోలోపల మరింత సుర్రు బయలుదేరవచ్చు; మరింత రేచిక్కు పుట్టవచ్చు. రూత్‌కు చార్లెస్ మనస్సు అర్థం కానిది కాదు.

ఘుమఘుమలాడుతున్న టీవాసన నాసాపుటాల నుంచి పైకి ప్రాకి మెదడుకు కొంచెం హాయిని కలిగించింది. రెండు గుక్కలు చవిచూచే సరికి నరనరాలకి కొంత చైతన్యం కలిగింది. టీ త్రాగి సిగరెట్టుముట్టించే సరికి రూత్‌కి ఈ సమస్యను పరిష్కరించటానికి ఒక దోవ కనుపించింది. వార్షికోత్సవ ప్రసక్తి తేకుండా, మామూలుగా అప్పుడప్పుడు జరుపుకునే పద్ధతిని చిన్న పార్టీ ఏర్పాటు చేస్తుంది. స్నేహితులందర్నీ పిలుస్తుంది; 'ప్రత్యేక విశేషమేమీ లేదు' అని చెప్తుంది; 'చార్లెస్‌కు ఆటోపమంటే చిరాకు'; వాళ్లంతా సహృదయంగలవారు గనుక విషయం గ్రహించి అలా సర్దుకుంటున్నారు. ఇది నిజానికి తెలివైన మార్గమే

వాళ్ళందరికీ సహృదయతను ఆపాదించటంలో కూడా రూత్ ఉదారత కనుపించుతూనే వుంది. రూత్ అతిబాల్యదశలోనే ఒక విషయం గమనించింది. ఇతరులలో సద్గుణాలున్నట్టు మనం ముందు ఊహించటం, మనం అలా అనుకుంటున్నట్టు నెమ్మదిగా వాళ్లకి అర్థమయ్యేలాగు చేయటం — అలా చేస్తే చచ్చినట్టు వాళ్లు ఆస్థాయిలో నడుచుకుంటారు. పార్టీకి జరుగవలసినయేర్పాట్లన్నీ గబగబా ప్రణాళిక తయారు చేసుకుంటూ రూత్ టీకప్పు ఖాళీ చేసివేసింది.

'నువ్వు ఉత్తమురాలి'వని యెవరైనా ఆవిడతో ముఖాముఖిని అంటే 'కాదు' అంటుంది, చిన్న చిరునవ్వు నవ్వి, ముఖమెదుట పొగడటంతో కొంచెం చికాకుపడ్డట్టుగా కనుపించుతూ కూడా. మరీ స్వాభిమానంగా కనుపించుతుందని వాళ్ళతో పైకి అనదుగాని, అలాంటి సమయాల్లో రూత్ హృదయంలో ఒకరకమైన భావపరంపర మెదులుతుంది. 'నేను ఉత్తమురాలినైతే — ఇందులో నన్ను అభినందించవలసిందేమీ లేదు. ఈ ఉత్తమస్వభావమనేది నాలో సహజంగానే వుండి వుండవచ్చు. దాని ప్రోద్బలమే నన్ను అలా నడుపుకుపోతోంది. జీవితంలో ఇలాంటి స్వభావం తనంతట దా సంక్రమించటం అది నిజంగా అదృష్టం.' ఇలాంటి దృక్పథం యేర్పడ్డం ఆవిడలో వున్న వినయసంపత్తికీ సత్యదృష్టికీ తార్కాణ మనటంలో ఎలాంటి సందేహమూ ఉండనక్కరలేదు. వివాహమైన మొదటిసంవత్సరంలోనే రూత్ ఈ దృక్పథాన్ని పెంపొందించుకుంది. ఆరోజుల్లో చార్లెస్ ఆగ్రహావృత్తి ఆనాటికానాడు మితిమీరి పెరుగుతూవుండటం, సూటీ పోటీ కుళ్లు మాటలతో తుపానుతరవాత తుపానుగా తనమీద దండయాత్రలు చేస్తూవుండటం జరుగుతున్నప్పుడు ఇదంతా తను ఎలా భరించుతున్నానా? అని తనకు తనకే ఆశ్చర్యంగా వుండేది. ఇంతశక్తి తనకెక్కడిదా అని అన్వేషణకు ఉపక్రమించింది. అప్పుడు మహోదధి వలే లోతు తెలియరాని ఈ సత్వసంపన్నత తనలో వున్నట్టు గ్రహించుకుంది. నిజంగా ఇది అదృష్టం. ఆవిడలో యీ దృక్పథమేర్పడేసరికి వెంటనే చార్లెస్ విషయంలో కూడా తానొకనిర్ణయానికి రాగలిగింది. తనలోవున్నలాంటి సత్వసంపన్నత చార్లెస్‌లో లేకపోవటం నిజానికి అది అతని దురదృష్టం. అదృష్టవంతురాలైన తను, ఎంతటిత్యాగమైనా చేసి, దురదృష్టవంతుడైన చార్లెస్‌ను ఉద్ధరించటం తన పరమధర్మం. ధర్మమునే కాదు, అలా ప్రవర్తించటంలో తనకు ఆత్మానందం వుంది. ఈ పద్ధతిని క్రిస్టియన్ మత సిద్ధాంతాలు ఉత్తమధర్మంగా అంగీకరించుతాయో లేదో ఆవిడకు తెలియదుగాని — మొత్తానికి ఈ నిర్ణయానికి వచ్చేసింది. ఈ సమస్యాపరిష్కారాన్ని గురించి తాను చేసుకున్న యీ నిర్ణయం అతి సామాన్యమైనదైతే కావచ్చు. 'నేను మాత్రం సామాన్య స్త్రీని కానా? నాలోవున్న గొప్పతనమేమిటి?' అని తనకు తాను నచ్చచెప్పుకుంది.

నిజానికి ఇది సామాన్యమైన నిర్ణయం కాదు. ఒకపద్ధతి విచిత్రమైన నిర్ణయం. తన వైవాహిక జీవితంలో తగిన ఏకాంతత లభించని పరిస్థితులు కారణంగా తొలుదొల్త చార్లెస్‌లో చిరాకు ఉద్భవించింది. ఆ విషయాన్ని రూత్ గ్రహించలేకపోయిందంటే, అలాంటి పరిస్థితులతో తాను అతి తేలికగా సర్దుకుపోగలగటమే కారణం. రెండవ అవివేకమేమిటంటే: అతని సూటీపోటీ మాటలకు తను మాటకు మాట సమాధానమైనా చెప్పకుండా మధుర హృదయాన్నే అందించటానికి ప్రయత్నించటంతో, ఎప్పటికప్పుడు అతనిలోవున్న లోపాలు ప్రేలెట్టి

చూపినట్టు అతనికి అర్థమవుతున్నయ్. తనలోని బలహీనతలను కప్పిపుచ్చుకోవటానికి, రూత్ లోనుంచికూడా అలాంటి లోపాలను బహిర్గతం చెయ్యటానికి అతను కచ్చగా దాడిమీద దాడిచెయ్యటం ప్రారంభించాడు. అతని మనస్థితిని రూత్ అర్థంచేసుకోలేకపోయింది కారణ మేమిటంటే: అతని ప్రేమానురాగాలకు అవధులున్నాయని గ్రహించలేకపోయింది—తన ప్రేమానురాగాలకు అవధులు లేవు గనుక. మూడవది అతను తిట్టుమోతుధోరణి సాగించినకొద్దీ తను నానాటికి మరింత నిర్లిప్తస్థితిని ప్రదర్శించటంతో అతను వెనక్కు తిరిగిచూసుకుని తనను తను దిద్దుకునే ఆస్కారం లేకపోయింది. దాంతో ఆనాటికానాడు మరీ పేట్రేగిపోయాడు.

తన మంచితనాన్ని తలచుకొని రూత్ ఆత్మాభినివేశం పొందుతోందంటే అది తనలోవున్న స్వభావజన్యమైన మంచితనాన్నిగురించి కాదు. సాధనచేసి తను సాధించుకున్న అదనపు మంచితనం సంగతి. అది ఒక మహత్కార్యాన్ని సాధించుకున్న ఆత్మతృప్తి లాంటిది. నిజానికి చార్లెస్‌పట్ల తను అవలంబించుతున్న అచంచల సాత్వికపంథా నిజానికి ఒక గొప్ప విషయాన్ని సాధించటమే. తను గుండెలమీద చెయ్యివేసుకుని చెప్పగలదు. చార్లెస్‌పట్ల తనలో ద్వేషభావం ఉదయించకుండా తన మనస్సును తాను అదుపులో వుంచుకోగలిగింది.

వివాహాత్పూర్వం పరిస్థితులన్నీ మధురంగా వున్నప్పుడు ఎంతగా అతనిని ప్రేమించేదో ఇప్పుడూ అదే అవధిని ప్రేమించగలుగుతోంది. తను ఇలాంటి దృక్పథాన్ని అవలంబించటంవల్ల చార్లెస్ సుఖశాంతులనుభవిస్తున్నట్టు చిహ్నాలేమీ కనుపించకపోయినా, అతను, లోలోపల, ఏకాంతంగా వున్నప్పుడైనా కొంత ఆత్మతృప్తిని పొందుతూ వుండవచ్చుననుకుంది. ఏదియేమైనా తను ఇంతకంటే యేమి చేయగలదు? తను చేయగలిగినంతా చేస్తూనేవుంది. ఇలా సదమదమాతూ, మరీ ఈ వ్యధాభారాన్ని భరించలేనప్పుడు విశ్రాంతికోసం అలా ఏ స్నేహితుల ఇళ్ళకో పోయి కాసేపు కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుకు వస్తూ వుంటుంది.

మరువారం జరుగవలసిన పార్టీకి ప్లానంతా సమగ్రంగా ఆలోచించుకున్నదై, వంట చేయటానికి ఉపక్రమించింది. ఒక గంట పోయాక వసారాల్లో తలుపు తోసుకుని చార్లెస్ లోపలికి వచ్చాడు. అప్పటికే 'ఓవెన్'లో వున్న మాంసం ఉడుకుబట్టి తుకతుక లాడుతోంది. పొయ్యిమీద వున్న కూరముక్కలు కూడా ఉడుకుబట్టేసినయ్. అదృష్టవశాత్తూ రొట్టె కూడా తయారైపోయింది. 'కాక్ టెయిల్' (పానీయ సమ్మిశ్రణం) తయారు చెయ్యటానికి రకరకాల పానీయాల సీసాలనూ తెచ్చి బల్లమీద వున్న ట్రేలో పెడుతోంది—కాక్ టెయిల్ కలిపే బాధ్యత ఆవిడ యెప్పుడూ చార్లెస్‌కే వదులుతూ వుంటుంది—ఇంతలో చార్లెస్ లోపలికి వచ్చాడు. కాలినున్న బూట్లు దబదబా లాగి మూలకు తన్నేశాడు. వచ్చి కుర్చీలో చేరబడి ఒక యెలుగ్గొడ్డు మూలుగు మూలిగాడు. కొద్ది సేపు ఆవలించి వళ్ళు విరుచుకుని రూత్ వంటయింటిలోనుంచి బయటికి వచ్చింది.

'ఉత్తమాయిల్లాలుగారూ! బూజుపట్టిన పరిశ్రమల చేతనూ, మంగళసూత్రాల చేతనూ పరివేష్టితులై సుఖంబుండిరో' అని తను వాలబడివున్న బూజుపట్టిన పాత తోలుకుర్చీలోనుంచి ఆశ్వాసించాడు భర్త భార్యను.

రూత్, చేతిలోవున్న ట్రేను బల్లమీద పెట్టేసి, అనునయంగా దగ్గిరికి వచ్చి 'సుఖంగా లేకేం డార్లింగ్' అంటూ అతనిమీదికి వంగి నుదురు ముద్దు బెట్టుకుంది; 'నాకు చిరాకు పడాల్సిందేముంది?—నీకో!'—

అతనికి ఎదురుగావున్న ఒక కుర్చీలో వచ్చి కూర్చుంది నవీననాగరికతకు చిహ్నమైన, అతిఅందమైన కుర్చీ. చార్లెస్ కూర్చున్న తోలుకుర్చీ మినహాయించి, ఆ హాల్లోవున్న మిగతా సామానులన్నీ అదే ఫ్యాషన్‌లో వున్నయ్.

సమాధానం చెప్పటానికి పూర్వమే జేబురుమాలు పైకితీసి రూత్ ముద్దెట్టుకున్న ప్రదేశాన్ని జాగ్రత్తగా తుడుచుకున్నాడు.

'ఊఁ—నాకుమాత్రం చిరాకుపడటానికి కారణం లేకపోలేదు—అక్కడ ఆఫీసులో, ఆ వెధవలున్నారే, వాళ్లలో ఏ వొక్కడికీ లా పాయింటు విషయం ఓ అంటే ఢం తెలీదు—మా క్లయింట్లదావాలన్నీ దగ్ధపటలమాతున్నాయంటే ఇందులో ఆశ్చర్యపడవలసినదేమీ లేదు. పోనీ చెబితే వినిపించుకుంటారా అంటే

అక్కలేదు——అలాంటి మర్యాదలు ఏ మురికి సంతల్లోనో పడి చావటం మంచిది' ——

'అవును చార్లెస్——మీ ఆఫీసులో వున్న వాళ్లందరిలోకీ నీవే తెలివిగలవాడివని నా అభిప్రాయం.'

'ఊహూ——నీ, అభిప్రాయం.——' చిన్నగా ఘుర్ఘురారావం చేశాడు.

'ఏమిటి అన్నావ్ డియర్?'——

'ఏమన్లేదు——'

ఒక క్షణం మౌనం——తరవాత:

'కాక్ టెయిల్ సంగతేమిటి డియర్——'మార్టినిస్' తయారుచేసుకుందామా 'మన్ హాటన్స్' తయారుచేసుకుందామా?'——

'ఆరిభగవానుడా! ఆ నిర్ణయమేదో నువ్వే చేసి యేడవకూడదూ?'——

అమ్మగారు ఇక్కడ సీతాకోకచిలకలాగా రంగు రంగుల దుస్తులు తగిలించుకుని నిలుచుంటూ వుండటానికి ప్రొద్దస్తమానం ఆఫీసులో చచ్చి అడ్డమైనవాళ్ళ అపభ్రంశలూ సర్దుకొని సదమదమై చచ్చి చెడి చాయంగల విన్నపాలై ఇంటికి జేరతాను——ఆ జేరినవాణ్ణి ఇక్కడ భార్యారత్నం తీరికగా కులాసాగా కుర్చీలో కూర్చుని 'మార్టినీసా, మన్ హాటన్సా? అంటూ యక్షప్రశ్న'

ఆమాటలలో వున్న అసభ్యధ్వనిని రూత్ పట్టించుకోలేదు.

'అదిగాదు చార్లెస్——నీకు ఏది ఇష్టమైతే అదే నాకు బాగుంటుంది'——

'నీకు ఏది ఇష్టమైతే...' చార్లెస్ గొణిగాడు.

ఇది తన ఇష్టమేమిటో చెప్పమని అడగడమో లేదో రూత్ కు అర్థం కాలేదు. కొంచెం ముఖం అటు తిప్పి మౌనంగా వూరుకుంది.

'ఈ మాత్రం స్వతంత్రించి ఏదో ఒక రకంగా కలిపి అక్కడ పారెయ్యక పోయినందుకు, నీ చెవులు పిండి నీచేత ఆ పని చేయించవలసింది. కాని వచ్చిన జెడ కేవిటంటే అది అధ్వాన్నం చేసి అక్కడ తగలెడితే దాన్ని ఇక మనం ఏ గొడ్లోనో పారబొయ్యాలి; ఏమిం కలవిస్తారు అవునా?'

సమాధానానికి ఆగకుండానే స్వయంగా కలుపుకోవడానికి సీసాలు ముందుకు లాక్కున్నాడు.

రూత్ వెనక్కు తిరిగి అతని వంక చూచింది. ఆ చూపులో కొంత కలవరమూ, జాలీకూడా జిలిబిలిగా కనుపించుతున్నయ్. ఈ మధ్య అతను ఆ మాత్రం సన్నిహితంగా వచ్చి తనను గూర్చి ఒక అభిప్రాయమంటూ వెలువరించింది కూడా లేదు. ఇదే ఇంచుమించు తొలిసారి.

మంచి ఘాటైన 'మార్టినీ' కలిపి కుర్చీలోనుంచి ముందుకు వంగి ఒక గ్లాసు రూత్ కు అందించాడు. ముందుకు వంగి గ్లాస్ అందుకుని మళ్లా వెనక్కు తిరిగి కూర్చోవటంలో గ్లాసులోనుంచి కొంచెంచింది గౌను మీద పడ్డది.

చిన్నగా చిరునవ్వునవ్వి 'మొరటు మొద్దుని ఎప్పుడూ ఇంతే' అని గ్లాసు అక్కడ బెట్టి జేబు రుమాలు తీసింది.

చార్లెస్ ముఖం కళకళలాడింది.

చార్లెస్ వంక చూస్తూ ఆ పానీయాన్ని కొస్త కొస్తే నెమ్మదిగా తాగుతోంది. చార్లెస్ గ్లాసుమీద గ్లాసు ఎక్కించుతున్నాడు. రెండో గ్లాస్ చేత్తో బట్టుకుని కుర్చీ చేతిమీద తాళమేస్తూ సన్నగా సంగీతానికి ఉపక్రమించాడు. అతని కొనగోళ్లు, ఎండిపోయిన ఆ పాత చర్మంమీద హార్మోనియం మెట్లులా పలుకుతున్నయ్. ఆ ధ్వని వినేసరికి రూత్ మనసు తొణికిసలాడిపోయింది. మనసులో వున్న మాటను ఆపుకోలేక, మాట్లాడేసింది.

'డార్లింగ్ చార్లెస్!...'అన్నది——వచ్చే వారం జరుగవలసిన కాక్ టెయిల్ పార్టీ ఆవిడ కళ్లముందు ఫిలింలా కనుపించుతోంది. 'వచ్చేవారం ..'

చార్లెస్ గ్లాస్ క్రింద బెట్టేశాడు. నూరు కళ్లు చేసుకుని భార్య ముఖంలోకి అలా చూచాడు. ఆవిడ మాటలు వినటానికి అంత సావధానుడైంది మూడు సంవత్సరాల ఈమధ్య ఎన్నడూ లేదు. 'మనమేదైనా ఒక చిన్న పార్టీ...పెద్దవిషయమేమీ లేకుండా...... ఏదో కొద్దిమంది స్నేహితుల్ని మన దగ్గిర బంధువుల్ని పిల్చుకుని...ఎలా వుంటుంది చార్లెస్.'

చార్లెస్ అతి నెమ్మదిగా గ్లాసు ట్రేలో వుంచేశాడు. మోకాటికి ముంజేతులు మెలికవేసి నెమ్మదిగా ఉపక్రమించాడు. అతని గొంతులో మామూలు కచ్చ మోతలేదు. రూత్ అతని కళ్ళల్లోకి చూసింది. మిలమిలా మెరుస్తున్నయ్. ఆ సంగతి

రూత్ గ్రహించేలోపలనే కోరడా దరువు మాట మీద మాట విసిరేశాడు

'అవును. విషయ మేమీ లేకుండా నువ్వు యేర్పాటు చెయ్యబోయే పార్టీలో ఒక గంభీరమైన విషయం వుంటుంది. ఆ విషయ మేలాటి దంటే: చార్లెస్ మృగంగా మారిపోతూవున్నాడనే సంగతి మన కందరకూ తెలుసు; కాని రూత్ ఉన్నది చూశారూ! ఉత్తమా యిల్లాలు; మనమంతా వెళ్ళి ఆవిడయెడల సహృదయంతో ప్రవర్తించి ఆహ్లాదభరితులమైనట్టు నటించాలి. చార్లెస్ తప్పదాగి అసభ్యంగా ప్రవర్తించినా మనం పట్టించుకోగూడదు. వివాహ వార్షికోత్సవ ప్రసక్తి అసలే తేగూడదు. ఈ మాట ఎత్తితే ఆ తల్లి రూత్ హృదయం గాయపడుతుంది. ఆ వెధవ చార్లెస్ గాడు ఆవిడ వివాహ జీవితాన్నంతా ధ్వంస పటలం చేశాడుగా—అలాటి ప్రసక్తి తేగూడదు ..'

'చార్లెస్ డార్లింగ్—'

'డార్లింగ్ గీర్లింగ్ ఈ వెధవభాష వాడొద్దు—నువ్వు ఉత్తమాయిల్లాలివి అవునా—దయామయి—మధురమయి—ఎట్టిదుర్మార్గాన్నయినా క్షమించగల ఉదారవంశురాలు. చార్లెస్ ఎలాంటిబూతులు తిట్టినా సరే—తిరిగి పన్నెత్తి అతన్ని దూషించదు—ఒక చిరునవ్వు నవ్వుతుంది, ఒక శిరఃకంపనంతో సరిపెట్టుకుంటుంది—ఈ చెంపమీద కొడితే అటు తిరిగి ఆ చెంప అందించుకుంది. క్రిస్టియన్ అంటే రూత్ సంగతే చెప్పాలి—తన అంతరాత్మను ఎప్పటికప్పుడత్యంతపవిత్రంగా అట్టిపెట్టుకుంటుంది — ఇక చార్లెస్ గాడున్నాడే, వాడు—వాడిఆత్మ మురికి మురికి గుంటగా మారిపోతోంది. ఇది మనందరికీ తెలుసుగా. ఆ వెధవనికూడా ఆ నరకాన్నుంచి స్వర్గానికి ఉద్ధరించటానికి ప్రయత్నించుతోంది — సరే ఇక ఇప్పుడు నే చెబుతున్నా విను— అలా ఉద్ధరించబడటం చార్లెస్‌కు ససేమీ యిష్టంలేదు. ఉత్తమాయిల్లాలుగారికి యీ విషయం బుర్ర కెక్కుతోందా? చార్లెస్ దైవోపహతుడైన భ్రష్టుడు. రూత్ గారి ఉద్ధరణ కార్యక్రమంతో విసుకెత్తిపోయిన పిశాచపు వెధవ తెలుస్తోందా? మ్యావ్ మ్యావ్ మని పిల్లిలా అరుచుకుంటూ వాడిచుట్టూ—పిశాచంలా...'

'డార్లింగ్...'

'నట్ ఆ పిచ్చికూతకూయొద్దన్నాను' చార్లెస్ చివాల్న కుర్చీలోనుంచి లేచి అమాంతం చెయ్యి పైకెత్తాడు.

'కుయ్యొద్దన్నానా లేదా'

'చార్లెస్...డార్లిం ...'

అతని చెయ్యి సర్‌న క్రిందికి వచ్చేసింది.

'పుచ్చుకో యిది—నీ ముండమోపి క్రిస్టియన్ బుగ్గమీద—రెండో బుగ్గ తిప్పదలిస్తే తిప్పు—మరోటి పుచ్చుకుందు గాని'

అతని ఎడమ చెయ్యి గాలిలోకి ఎత్తి సిద్ధంగానే వుంది. ఆ వేశంతో పెద్దపులిలా గొప్పుతూ రూత్ ముఖంమీదికి నిల్చునున్నాడు.

రూత్ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. చార్లెస్ అంత వరదాకా చెయ్యి చేసుకున్నదిలేదు. రూత్ కళ్ళలో విస్తృతమౌతున్నది దుఃఖం తప్ప క్రోధరేఖ ఏ కోశానా కనుపించటం లేదు.

నెమ్మదిగా తల పక్కకు తిప్పుకుని, కుర్చీలో జాలిగిలబడి కూర్చుని, కుమిలి కుమిలి యేడిచింది.

చార్లెస్ చెయ్యి క్రిందికి దించేసుకున్నాడు. రూత్ కళ్ళల్లోవున్న భావం అతనికి అర్థమైపోయింది. వెనక్కు తిరిగి వెళ్ళి తన కుర్చీలో కూర్చున్నాడు.

ఒకటి రెండు క్షణాల్లో ఏడవటం మానేసింది. కళ్ళు తుడుచుకుంది. వంటయింట్లో నుంచి మాంసం తగలడి పోతున్నట్టు మాడువాసన కొట్టింది.

'అయ్యొయ్యో' అంటూ చివాల్న కుర్చీలోంచి దూకి వంట యింట్లోకి పరుగెత్తింది. పరుగెత్తుతూ పరుగెత్తుతూ ఒక్కసారి వెనక్కు తిరిగి కుర్చీలో కూర్చున్న అతనివంక చూస్తూ లోపలికి పోయింది. వోవెన్‌లో వున్న మాంసం పై పక్క కొంచెం ఎక్కువ కాలింది గాని మరేమంత చెడలేదు. లోపల పక్క చక్కగా ఉడికింది కూడా. బంగాళా దుంపలు మాత్రం మాడి పోయాయి. పొయ్యిమీద మళ్ళీ యిన్ని నీళ్ళు పడేసి చిక్కుడు కాయలిన్ని దాన్లో పోసింది. బల్ల సర్దేసి భోజనానికి యేర్పాటు చేసింది. ఈలోగా చిక్కుడు కాయల కూరకూడా తయారయింది. వచ్చి బల్ల దగ్గర కూర్చుంది. చార్లెస్, తల రెండుఅరచేతుల్లోనూ పెట్టుకుని విచారగ్రస్తుడై కూర్చున్నాడో లేదో తెలుసుకోవటానికి తహతహలాడుతూ వంటయింట్లో బల్ల

దగ్గరనుంచే పరకాయించి చూసింది. కుర్చీక్రిందనుంచి చాచుకుని వున్న అతని కాళ్లు మాత్రమే కనుపించుతున్నయ్ గాని ఊర్ధ్వభాగం కనుపించటం లేదు. చార్లెస్ నిమిషంలో మళ్లీ దించుకుపోతాడని రూత్‌కు తెలుసు.

శబ్దంచెయ్యకుండా మునివ్రేళ్ళమీద నడుస్తూ వంటయింట్లోనుంచి హాల్లోకి వచ్చింది... నెమ్మదిగా వచ్చి అతనిముందు నిల్చుంది. చార్లెస్‌కు ఆవిడ పాదాలు కనుపించుతూనే వుండవచ్చు. కాని అతను తల పైకెత్తలేదు. తలవంచుకుని అరచేతివంక చూసుకుంటూ దిగులుగా కూర్చున్నాడు.

'చార్లెస్—భోజనానికి లేస్తావా?'

చార్లెస్ నెమ్మదిగా తల పైకెత్తాడు. భార్య ముఖంలోకి చూశాడు. అతనిముఖంలో నెత్తురుచుక్క లేదు; కంపిపోయిన ఆవిడ ఎడమబుగ్గమీద, అతని అయిదువ్రేళ్ళముద్రలూ కత్తికోతల్లా యింకా ఎర్రగా కనుపించుతూనే వున్నయ్. వాటివంకే చూస్తున్నాడు.

ఎంతో ప్రయత్నించి రూత్ ఒక చిరునవ్వు తెప్పించుకుంది.

'భోజనానికిలేస్తావా చార్లెస్...' మళ్లా అడిగింది.

ముఖం రెండు అరచేతుల్లోనూ కప్పేసుకుని చార్లెస్ కుమిలికుమిలి ఏడుస్తున్నాడు.

రూత్ వెంటనే అతనిముందుకుపోయి మోకాళ్లమీద కూర్చుంది. నెమ్మదిగా అతనిచేతులు రెండూ పట్టుకుని విడదీయటానికి ప్రయత్నించింది. విసురుగా ఆవిడ చేతులను విదిలించివేశాడు.

'వద్దువద్దు ... నన్ను ముట్టుకోవద్దు — నేను భరించలేను—వద్దు—' గుబులుగా ఏడిచాడు.

ఆవేదనను భరించలేక ఆసరాకోసం పట్టుకున్నట్టు రూత్ చేతిని గట్టిగా పట్టుకున్నాడు. ఆ చేతిమీద రూత్ తన మెత్తటి అరచెయ్యివేసి మృదువుగా దువ్వుతూ:

'మరేం ఫరవాలేదు చార్లెస్. అంతా సరీగానే వుంటుంది... డార్లింగ్ ఇక ఇలాంటిది మరెప్పుడూ జరగదు...అంతా సరీగానే వుంటుంది.'

'ఎందుకు చెబుతావ్...నా బ్రతుకంతా ఇలాగే జరిగింది...ఇలానే జరుగుతుంది'

'లేదు చార్లెస్ ఇకముందు అలా జరగదు... నేను నిన్ను చాలా వేదించుతున్నాను. నాకిప్పుడు తెలుస్తోంది. నిజంగా నీకు అపచారం చేశాను.'

'...ఇందులో నీతప్పేముంది...నువ్వెప్పుడూ జాగ్రత్తగానే వున్నావు— నేనే కిరాతుణ్ణి; ఇదంతా నేనే చేస్తున్నాను... నేనే వెధవని.'

'పోనీ యిద్దరిలోనూ తప్పులున్నా యనుకుందాం—సర్దుకుందాం'

'నువ్వు తప్పు చెయ్యడమూ — కాదుకాదు ఇదంతా నా రాక్షస స్వభావమే.'

'సరే చార్లెస్ అలా వేదనపడి మనసు పాడు చేసుకోకు!

'నేనే— నేనే—కిరాతుణ్ణి'—

'పోనీ డార్లింగ్'—

'రాక్షసుణ్ణి...'

'చార్లెస్...'

'నువ్వు దేవతవు రూత్...'

'పోనీ చార్లెస్ అలా అనుకుంటే నీకు మనశ్శాంతిగా వుంటుందంటే అలానే అనుకో...ముందు భోజనానికిలే చార్లెస్'

'అలాగే రూత్! ఒకక్షణం ఆగు'

నెమ్మది నెమ్మదిగా అతని దుఃఖం సమసిపోయింది. నెమ్మదిగా రూత్ చేతిని వదిలేశాడు.

* * * *

మరుసటి వారం జరిగిన పార్టీ ఏ అతిథులూ ఊహించనంత మహోజ్వలంగా జరిగింది. రూత్‌కు ఆత్మధైర్యం చిక్కింది. మొదట అనుకున్నదానికంటే ఇంకా అనేకమందిని పిలుచుకుంది. టెలిఫోన్‌లో పిలిచి ఆహ్వానిస్తున్నప్పుడు రూత్ గొంతులో ధ్వనించుతున్న సంతోషానికి వాళ్లు మామూలు పాత వ్యాఖ్యానాన్నే చెప్పుకున్నారు. 'సాహసంగల మనిషి—వైవాహికజీవితం అంతా ధ్వంసపటలమైనా ఎలా కప్పుకుని సంతోషాన్ని నటించుచున్నది!'—

రూత్, 'వివాహ వార్షికోత్సవ' మని కూడా తెలియజేసింది. అది విని వాళ్లు మరింత అభినందించారు. వాళ్లు అభినందించింది ఆ దాంపత్యాన్ని అంత

వరకూ లాక్కురావటంలో రూత్ ప్రదర్శించిన పట్టుదలను గాని, ఆ దంపతు లనుభవించిన సుఖజీవితం ఇంకా మహత్తరంగా కొనసాగబోతోందనే దృష్టితో కాదు. సుఖజీవిత మనేది అస లొకటి ప్రారంభమై ఏడిస్తేనా, ముందుకూడా కొనసాగటానికి. వాళ్ళ గొంతుల్లో ధ్వనిస్తున్న సానునయాన్ని రూత్ పసిగట్టింది—'మీరు ఆశ్చర్యచకితులు కాబోతున్నా' రని సంతోషంగా చెప్పెయ్యాలనే ఉత్కంఠ కూడా ఆవిడలో కలిగింది. కాని బలవంతాన తమాయించుకుంది. నిజంగా వాళ్లంతా ఆశ్చర్యచకితులైన మాట నిజమే. సంతోషించారు కూడా—కనీసం మొదట్లో.

పార్టీకి యేర్పాట్లు చేస్తున్న హడావిడిలో ఆ వారం పొడుగూ రూత్‌కు ఎవరింటికీ వెళ్లే తీరికే లేకపోయింది. ఆవిడ ఎక్కడా కనుపించకపోవటం చూసి, స్నేహితులూ బంధువులూ కూడా ఏవో గందరగోళం జరుగుతూవుంటుందని ఊహించారు. అందుకనే వాళ్ళు కూడా ఎవరూ వాళ్ళింటికి రాలేదు. నిజానికి ఒకటి రెండు చిన్ని చిన్ని సంఘర్షణలు రాకనూ పోలేదు. ఒకనాడు సాయంత్రం రూత్ అతని దుస్తులనుగురించి ఒక మాటన్నది: 'ఇంకా కొంచెం మంచి దుస్తులు వేసుకుంటే, ఆఫీసులో మిమ్మల్ని ఇంకా గౌరవంగా చూస్తారనుకుంటాను'—

ఆ మాటలు విని చార్లెస్ మామూలు పాత ధోరణిలో 'సర్'మన్నాడు. కాని వెంటనే తమాయించుకుని నాలిక కొరుక్కున్నాడు. రూత్‌ను క్షమాపణ కూడా కోరాడు.

'నాకు తెలియదూ—ఇదంతా నువ్వు నామంచికోసమేగా చెబుతున్నావు' అన్నాడు. ఆ సాయంత్రమే కూర్చుని బూట్లకు శ్రద్ధగా పాలిష్ వేసుకున్నాడు. ఒక మూడుజతల సూట్లు ఏరి చాకలిషాపుకు పంపించాడు. మధ్యాహ్నంపూట టీముందు కూర్చున్నప్పుడు రూత్‌కు మునుపటిలాంటి పరివేదన లేదుగాని మరొక రకం వ్యసనం పట్టుకుంది. భర్త కంటబడే మధురక్షణం ఇంకొక గంట పోతేగాని లభ్యం కాదు గదా అని తహతహలాడేది. వంటయింట్లో బల్లదగ్గిర కూర్చుని అతను ఇంటికి తిరిగి వచ్చే దృశ్యాన్ని ఊహించుకుంటూ వుంటే ఆవిడ హృదయం ఆనందంతో నిండిపోయేది. నెమ్మదిగా లోపలికి వస్తాడు వీధి తలుపు చప్పుడు కాకుండా అతను నెమ్మదిగా నాగరికంగా మూసివేస్తాడు—లోపలికి వచ్చి రావటమే హాల్లోనుంచే—'ఏమైనా సహాయం చెయ్యాలన్నావా' అని ఆప్యాయంగా పిలుస్తాడు. అతనిరాకకోసం ఎదురుచూస్తున్న ఆపేక్ష ఉదావత్తూ ఒక్కసారి కట్లు తెంచుకుంటుంది—హాల్లోకి వెళ్లి తనివితీరా అతన్ని కౌగలించుకుంటుంది—'కాక్‌టెయిల్ కలిపిపెట్టు డార్లింగ్—భోజనపదార్థాలు బల్లమీద సర్దుతాను కొంచెం సాయపడు' అని అడుగుతుంది. ఇంకా సమర్థించుకోవలసిన చిన్న చిన్న సమస్యలుండేవనుకోండి. వాటి నన్నిటినీ పూర్వంకంటె శ్రద్ధగా జాగ్రత్తగా ఆలోచించి ముచ్చటగా ఇల్లు దిద్దుకుంటోంది. ప్రతిపనీ తనే సమర్థించుకు పోతున్నా ఎప్పటికప్పుడు చార్లెస్ సలహా అడగడం మాత్రం మరిచిపోయేది కాదు. ఎట్టి సవరణలూ లేకుండా ఆవిడ ప్రణాళికల నన్నిటినీ ఆమోదించేస్తూ వుండేవాడు, భర్త.

చార్లెస్ పాత పడకకుర్చీ విషయంలో మాత్రం ఒకనాడు కొంచెం ఘర్షణ జరిగింది. రూత్ వికారంగా వున్న ఆ కుర్చీ వంక బాధగా ఒకచూపు చూచింది. వెంటనే 'వెధవపాతడొక్కు. ఇక ఆ కుర్చీతీసి అవతల పారేద్దాం' అని ప్రతిపాదన చేసేశాడు చార్లెస్. రూత్ అలాపనికిరాదంది: 'ఈ వున్నవాటిలో కాస్త హాయిగా విశ్రాంతి తీసుకోవటానికి వీలైన కుర్చీ అదొక్కటే—పైగా నీకు అందులో పడుకునే అలవాటు కూడా' అని వాదించింది. 'కాదు తీసెయ్యాల్సిందే' నని పట్టుబట్టాడు చార్లెస్. 'సరే' నని లొంగిపోయింది రూత్—చిరునవ్వు నవ్వుతూ.

పార్టీరోజున, రూత్ ఎప్పుడూ లేనంత సొగసుగా కనుపించింది—కనీసం చార్లెస్ మనసుకు అలా తోచింది. ఈమాట భార్యతో అన్నాడు. 'నా సంగతికేం మెచ్చె నువ్వు యివ్వాళ ఎంత గొప్పగా వున్నావూ!' అని ఆనందంగా సమాధానం చెప్పింది.

నిజానికి, ముడత నలగని ఆ సూటు వేసుకుని, ఆ క్రొత్త నెక్‌టై కట్టుకుని, నిగనిగలాడుతున్న ఆ బూట్ తొడుక్కుంటే, ఆదర్శ భర్తగా, రూత్ హృదయంలో వున్న చిత్రానికి ప్రతిమూర్తిగా వున్నాడు చార్లెస్. పార్టీకి వేళ సమీపించింది. చార్లెస్ తలుపు తీసి అతిథులను అతిమర్యాదగా లోపలికి ఆహ్వానించాడు. తమన్ని ఆహ్వానించటానికి చార్లెస్ స్వయంగా గుమ్మంలో నిల్చునుండటం చూచి వాళ్ళంతా 'షాక్'

తిన్నారు. రూత్ తమ్ముందగ్గిర వుండటం, చార్లెస్ అతి మొరటుగా తనకేమీ పట్టనట్టు తన గదిలో కాళ్ళూపుకుంటూ పడక కుర్చీలో కూర్చునుండటం ఇది మామూలు. అతను తనను ఆశ్వాసించటానికి వాడుతున్న ప్రియభాషలతో మరింత ఆశ్చర్యచకితు లౌతున్నారు. ఆశ్చర్యనుగ్నమానసులై భర్తల ముఖాల్లోకి భార్యలూ, భార్యల ముఖాల్లోకి భర్తలూ చకచకా చూసుకుంటున్నారు. ప్రశ్నార్థకాల పరంపరలుగా. వాళ్ల కళవళాన్నంతా గ్రహించుకున్న రూత్ చార్లెస్ల ముఖాల్లో క్రొత్త వెలుగులూ క్రొత్తరకం చిరునవ్వులూ పొటమరించినయ్. ఇది ఆ అతిథులు కూడా గమనించి మరింత విభ్రాంతులయ్యారు. ఎన్నడూ ఊహించలేని ఇట్టి మార్పులు ఒక్కసారి అభిముఖం కావటంతో వారంతా అయోమయమై నోరు మెదిపి మాటాడలేకపోయారు. ఒకొక్క జత దంపతులే లోపలికి అడుగుబెట్టడం, 'షాక్' తినటం, లోపలవున్న వాళ్ల ముఖాలవంక ఏవిటీ చిత్రమన్నట్టు సందేహాస్పదంగా చూడటం, అందరూ మౌనం వహించటం, ఒక్కక్షణం హాలు హాలంతా నిశ్శబ్దత వ్యాపించటం మళ్ళా అంతా తేరుకుని, ఏమీ జరగనట్టు పెద్దపెట్టున గజిబిజిగా లోకాభిరామాయణం మాట్లాడటం—ఇలా సాగిపోతోంది.

రూత్ చార్లెస్లు అంచనా వేసుకున్నదానికంటే ఆనాడు వాళ్ళంతా మరింత విపరీతంగా తాగేశారు. అదనంగా మరికొన్ని జిన్సీసాలూ, విస్కీసీసాలూ తీసుకురావటానికి పార్టీ జరుగుతుండగా చార్లెస్ రెండుసార్లు బయటికి వెళ్ళవలసి వచ్చింది. అతను బయటికివెళ్లినప్పుడల్లా రూత్కు పీకెమీదికి వచ్చినట్టనిపించింది. అక్కడున్న ఆడవాళ్ళంతా సిగ్గుశిరాలువిడిచేసి తనవంక అదోలా చూసి భావగర్భితంగా తలలు పంకించటం, ప్రశ్నార్థకాల్లా చూపులు విసరటం మొదలుబెట్టారు—వీటి నన్నిటినీ లెక్కచేయకుండా ఉపేక్షించి మౌనంవహించి ఊరుకోవటానికి తన సహనశక్తినంతా ఉపయోగించవలసి వచ్చి సతమతమౌతోంది. నిజానికి ఉపేక్షించి ఊరుకునేసత్తా రూత్కు లేదు. ఏ అభిప్రాయం కారణంగా వాళ్లు అలా ప్రవర్తించుకున్నారో ఆ అభిప్రాయం నుంచి, వాళ్ళమనస్సుల్ని మరొక లోకాభిరామాయణంలోకి మళ్ళించాలితప్ప మరోగత్యంతరం లేదు.

రూత్ అలా సమర్థించగలదు—అతి చాకచక్యంగా సమర్థించుకొస్తోందకూడా. మొదటిదఫా ఈసు ఫానును ఎలాగో తట్టుకుంది—మళ్ళా అదేతంతులో రెండవదాడి. మూడవసారి మరింత హీనంగా ఒక్కుమ్మడి చిలిపిచూపులు చూశారు. ఈనాడికి తట్టుకోలేకపోయింది—వెటకారంగా ఒక్క సకిలింపు సకిలించి మందలించింది. అంతటితో ఆగలేదు రూత్ హృదయంలో ఒక మహావేశం బయలుదేరింది. ఎల్లిస్ మార్సీని లోపలికి తీసుకుపోయి అత్యంతావేశంతో తను సాధించిన విజయాన్నిగురించి చెప్పేసింది—కంగారుపడుతూనే. ఆ ఉత్కంఠతో రూత్ కంఠం కళవళపడిపోయింది. ఆ కళవళంతోనే, తిరిగి మగవాళ్లు కూర్చున్నదగ్గిరికి వచ్చింది. వాళ్లుకూడా అదో విచిత్రంగా కనుపించారు పూర్వం, తోటిస్త్రీలు అందరికంటే తన్ను ఎంతో గౌరవించుతున్నట్టు వాళ్ళ సంభాషణలలో వ్యక్తమవుతూ వుండేది. ఇప్పుడు దానిస్థానే ఒక క్రొత్తరకం మితభాషణ కనుపించుతోంది. తను అక్కడికి వచ్చినప్పుడల్లా వాళ్లు కటిక్కన తమలో తాము మాట్లాడుకోవటం మానివేయటంకూడా చాలా అసహ్యకరంగా తోచింది.

తుదిసారిగా మరికొన్ని సీసాలు చంకను బెట్టుకుని చార్లెస్ లోపలికిరావటంతో, బ్రతుకుజీవుడా అని ఇదోసాకు చూసుకుని, కంగారుగా అతనితోపాటు లోపలికి వచ్చేసింది.

'డార్లింగ్!—అంతా సరిగా జరిగిపోతున్నట్టేనా?'

చార్లెస్ జిన్సీసా మూత ఊడబెరుకుతున్నాడు:

'ఇప్పుడుకూడా సరిగా జరక్కపోతే ఇక అది మన విధివ్రాలు అనుకోవాలి అంతే— నీకంటే చాకచక్యంగా ఇంకెవరు సమర్థించగలరు'—అతను తల ఎత్తకుండానే సమాధానం చెప్పాడు.

'నేనా?—నావల్ల నేమయ్యేది — నువ్వుగాదూ వీళ్లందరితో అలా చక్కగా మాట్లాడి సమర్థించుకొస్తోంది.

'సరే ఒప్పుకున్నాను—రాణీగారి కనుసన్నల ఆజ్ఞల ప్రకారం వర్తించుతున్నాననుకోండి — అదీ సంగతి తెలిసిందా?'

జిగ్ బాటిలు మూతతీసి చేత్తో పుచ్చుకున్నాడు: 'యేమాత్రం తయారు చెయ్యమన్నావు? రెండు దఫాలకు సరిపోయేట్టు తయారు చెయ్యనా? మూడు దఫాలకు చెయ్యనా?'

'ఏమో ఎలా చెబుతాం — మూడు దఫాలకే చేసుకుని వుంచుకుంటే బాగుంటుందేమో.

'సరే — యజమానురాలి ఆజ్ఞ' —

అతను కలపటం మొదలు బెట్టాడు. రూత్ ఒక్క క్షణం అక్కడ నిల్చుని మళ్లా హాల్లోకి వచ్చేసింది.

అతిథులంతా ఆనాడు మరింత తాగివేయటమే గాక — చార్లెస్ దంపతులనుకున్నదానికంటే మరింత సేపు అక్కడే కూర్చునిపోయారు — ఆ కూర్చోటం విందు ఉజ్వలంగావున్న కారణంచేతనైనా కావచ్చు లేక తాము ఊహించుకున్న సంఘటన ఏదో ఇంకా జరగలేదేమో అని దానికోసం ఆదుర్దాగా ఎదురు చూస్తూ వుండటంవల్లనైనా కావచ్చు.

మన్యమన్య ఆపనులున్నాయ్ యీపనులున్నాయ్ బయలు దేరితే బాగుంటుందంటున్నా — మళ్ళీ గొంతులు తగ్గించి యేదేదో గుసగుసలాడుకుంటున్నారు — మళ్ళా గొంతులు పెద్దవి చేసి చెకా అర్థమైన చెత్తా మాట్లాడుతున్నారు. మరీ చివర చివరకు వాళ్ళు మాట్లాడేదంతా అర్థంపర్థంలేని పిచ్చి వాగుడుక్రింద తయారైంది. వాళ్ళు చార్లెస్‌తో మాటాడే మాటలు తగ్గితగ్గిపోతున్నాయో అతని వైపు పరచే క్రీగంటి చూపులు అలా బహుళమౌతున్నాయ్. ఒక వేళ వాళ్ళంతా ఏమీ పైకి అనుకోకుండా నే ఒకే నిర్ణయానికి వచ్చి, చార్లెస్‌ను రెచ్చగొట్టి, మునుపటిలా బూతుమాతల ధోరణికి దిగజారిపోతాడో లేదో చూదామని ప్రయత్నించినా, ఆశాభంగాన్ని పొందేటట్టే వున్నారు. ఎందుచేతనంటే రూత్ క్షణ క్షణం అతన్ని అంటిపెట్టుకునే తిరుగుతోంది. చార్లెస్ నిరవధికానందంతో రూత్ వంక చూసే చూపుల్లో ఆ స్త్రీపట్ల అతనికున్న అవ్యాజమైన అనురాగమంతా ద్యోతమానమౌతోంది. ఆ చూపులను వాళ్ళు ఇక ఎన్నటికి మరిచిపోలేరు.

ఇక గత్యంతరంలేక, భార్యలు భర్తలకీ, భర్తలు భార్యలకూ సంజ్ఞలు చేసుకున్నారు. ఏదో యింద్రజాలంలా వాళ్లందరికీ ఒక్కుమ్మడిగా, ఇంటి కొడున్న పిల్లాజల్లా సంగతీ ఇతర డిన్నర్ కార్యక్రమాల సంగతీ సినిమా ప్రోగ్రాముల సంగతీ, వాళ్లవాళ్ళ యిళ్లకు రానున్న అతిథుల సంగతీ—యివన్నీ హఠాత్తుగా జ్ఞాపకానికొచ్చాయి. బిలబిలా అంతా లేచారు. తొట్రుపడ తన కాళ్ళు తాను తొక్కుకుంటూ, తెచ్చుకోలు నవ్వులతో అభినందన పరంపరలు తెలుపుతున్న చివరి అతిథిని బయటికి సాగనంపి రూత్ చార్లెస్‌లు తలుపులు మూసుకున్నారు. ఆశాభంగసూచకములైన ఆ అభినందన వాక్యాలు రోడ్డుమీది చీకటిలో లయించిపోయినై.

'అరి వీళ్ళీయిల్లు బంగారంగానూ!' అన్నది రూత్.

'ఇష్'—అనే ఏహ్యభావాన్ని వ్యక్తంచేస్తూ ఊపిరి విడిచాడు చార్లెస్.

'డార్లింగ్! లోపలికి పోయి తింటానికేమైనా యింత ఉడకేస్తా గాని, ఈలోగా, నీకు అలసటగా లేకపోతే—కాస్త ఈ ఖరాబంతా సర్దేస్తావా?' అన్నది.

'దేవిగారి సెలవు......' అంటూ లేచాడు.

భోజనం తయారుకావటానికి గంట పైచిలుకు పట్టింది. నిజంగా అలాంటి సమయంలో మామూలు కంటే మరింత తొందరగా వండి వెయ్యాలిసినపని. కాని రూత్ మనస్సు అదోలా వుంది. మరికొన్ని సీసాలు తేవటానికి చార్లెస్ వింగులో నుంచి బయటికి వెళ్లిపోయినప్పుడు హఠాత్తుగా తన మనసులో కలిగిన ఆవేశం ఇంకా మెదడును పట్టుకుని వదలటం లేదు. చాలా అలసిపోయినస్థితిలో వుండి—'ఓ సరే! రాణీ గారి ఆజ్ఞ' అన్న చార్లెస్ మాటలు ఎడనెడా మనసులో గర్వరేఖలులా మెసులుతున్నాయి. 'వెర్రితనం! అలసిపోయి వున్నప్పుడు మనసు యెంత విచిత్రంగా తయారవుతుందీ?' అనుకుంది. అంత తెలివిగా ఆలోచించి కూడా, ఆ ఆవేశాన్ని సర్దుకోలేక బాధపడుతోంది. క్రొత్త కోటు కొత్తగా తగిలించుకున్నప్పుడు, అలవాటయే వరకూవుండే విచిత్రమైన ఎబ్బెట్టుతనం. హాల్లో నుంచి తనలో తను ఏదో మాట్లాడుకుంటున్న చార్లెస్ గొంతు ఎడనెడా వినిపించుతోంది. తనలో తను చిరునవ్వు నవ్వుకుంది.

తీరా వంట పూర్తి అయిందని చెప్పటానికి హాల్లోకి వచ్చేసరికి, ఎక్కడసీసాలక్కడ, ఎక్కడి

పళ్ళాలక్కడ చెల్లాచెదురుగా ఇంకా అలానే పడివున్నయ్.

'చార్లెస్!...ఇంతసేపూ ఏం చేస్తున్నట్టు?'

'మరింకొంత పుచ్చుకుంటున్నాననుకుంటున్నావేమిటి!... లేదులే'

'సరే భోజనానికిలే!—' చిన్న చిరునవ్వు విసిరింది.

భోజనంసగ్గిర కాసేపు యిద్దరూ ఏమీ మాట్లాడలేదు. చివరికి చార్లెస్ ఫోర్కు బల్లమీద వుంచేస్తూ!

'మహబాగా జరిగింది' అన్నాడు.

'అవును—అద్భుతంగా సమర్థించావు'—ఒక చిరునవ్వు నవ్వింది.

'నిజానికి ఒక మహాకార్యాన్ని సాధించటమే'—

'ఊ....

'నేను చెబుతున్న జీవితంలే...' అతనిగొంతు కొంచెం పదునెక్కింది. వాళ్ళంతా ఒకళ్లతో ఒకళ్ళు చెప్పుకుంటుంటే ఇప్పుడే విన్నాను 'రూత్ అద్భుతమైన మనిషి—ఎప్పటికప్పుడు ఆ చార్లెస్ మన్నపోతును అలా జయించుకొస్తూనే వుంటుంది. ఈమధ్య జరిగిన విందులన్నిట్లో ఇంతబాగా జరిగింది మరోటి లేదు. ఈ సంవత్సరంలోనే జరగలేదు ఈ శతాబ్దానికే అద్భుతవిషయం.

'చారెస్ డారింగ్!'—

'చార్లెస్ డార్లింగ్!' వికారంగా మూలిగేశాడు.

రూత్ చేతిలోవున్న ఫోర్కు క్రిందబెట్టేసింది. అలసట, ఆశాభంగం, అంతవరకూ అనుభవించుతూ వచ్చిన మనోవ్యథ రూత్ మనోనిబ్బరాన్ని ఛిన్నాభిన్నం చేసివేసినై. జీవితంలో ఎన్నడూలేనిది కోపం వచ్చే స్థితికి వచ్చేసింది.

'చార్లెస్! ఇక్కడికి మూడు సంవత్సరాలుగా సహిస్తున్నాను—తిట్టావు, తిమ్మావు, ఏహ్యంగా చూశావు—నా గుండెల్ని వాలికలు వాలికలుగా చీరేశావు; పశువును హింసించినట్టు హింసించావు, నీచాతినీచంగా చూశావు—ఇంత సహిస్తూ, సర్దుకురావటానికి నా శక్తినంతా ధారపోశాను'—వలవలా కళ్ళవెంట నీళ్లు వచ్చేసినై: 'ఆ కష్టాలన్నీ తీరాయనీ నాకు మంచిరోజులొచ్చాయనీ ఒక్క క్షణం ఇప్పుడే...' బోరున ఏడ్చేసింది.

చార్లెస్ కంగారుగా కుర్చీలోనుంచి లేచాడు—తడబడుతున్న కాళ్లు నిలవదొక్కుకుంటూ బల్ల అవతలపక్కకు తిరిగివచ్చి, భార్యకుర్చీముందు మోకాళ్లమీద వొరిగిపోయి రెండుచేతులా ఆవిడ నడుము చుట్టూ పసిబిడ్డలా పెనవేసుకున్నాడు.

'రూత్!—రూత్!—ఇక ఎప్పుడూ అలా ప్రవర్తించను—ఇకెన్నడూ.....క్షమించు—నన్ను క్షమించు రూత్!...'

'వాగ్దానం చెయ్యి!' కళ్ళనీళ్లు తుడుచుకుంటూ అడిగింది. తన ఒళ్లోవున్న అతని తలను పసిబిడ్డ తలను నిమిరినట్టు నిమిరింది.

* * * *

మర్నాడు రూత్ స్నేహితురాళ్ల మధ్య టెలిఫోన్ సంభాషణలు అనంతంగా సాగిపోతున్నయ్. 'ఏలాగైనా సాధించనీ, నిజానికి రూత్ ఒక యింద్రజాలమే చేసివేసింది—ఈకథ ఇలా ఎంతకాలం నడుస్తుందీ అన్నదే ఊహించరాని విషయం. ఏదిఏమైనా, తాత్కాలికంగానే అయినా ఆ యింద్రజాలం నిజంలానే కనుపించుతున్నది'—ఇది ఆ యిల్లాళ్ల అధికసంఖ్యాకాభిప్రాయం. ఈ అభిప్రాయాన్ని వ్యతిరేకించినవారు కూడా లేకపోలేదు. ఇదంతా వట్టిభ్రమ. చార్లెస్ అసభ్యప్రవర్తనలో ఇది మరింత క్రూరమైన ఘట్టం. ముందు ముందు రూత్ మీద మరింత తీవ్రంగా దెబ్బతియ్యటానికి యిప్పుడీ నటనంతా చేస్తున్నాడు' అన్నారొకరిద్దరు.

వాళ్లు ఎప్పుడూ అలా అశుభాన్నే ఆశంకించుతూ వుండే రకమేనని జనవాక్యం వుండటంవల్ల ఆ యిద్దరి మాటలను ఎవ్వరూ ఖాతర్ చెయ్యకుండా అతిమర్యాదగా ఉపేక్షించి వదిలేశారు. మగవాళ్లలో మట్టుకు కొంత పరివర్తనం కలిగింది — భార్యలు వినకుండానే అనుకోండి—'పాపం చార్లెస్ మంచివాడు...మనం అలా ప్రవర్తించవలసింది కాదు' అనుకున్నారు.

రోజులు గడచినకొద్దీ, ఆ యిల్లాళ్ళంతా, రూత్ గొప్పతనాన్ని గాని, రూత్ సాధించిన యింద్ర

జాలాన్నిగాని అభినందించటం క్రమంగా తగ్గించివేశారు మరో నెల గడిచేసరికి, రూత్ ఏ పార్టీలో నుంచైనా ముందుగా బయటికి వెళ్ళిపోయిందంటే, అభిజ్ఞానుసరించిన అభినందన పరంపరలకు మారుగా ఇప్పుడు నిశ్శబ్దత వ్యాపించటం మొదలైంది. పడక గదులలోని అద్దాలముందు మాత్రం అభిజ్ఞానుసరించిన మననం లావైంది: 'ఆ వెధవ చార్లెస్ గాడు ఇప్పుడు దాని సలహా లేందే బూట్ లాళ్లుకూడా ముడేసుకోలేడు. అది చూసుకుని అది తెగని నిక్కుబోతోంది. మొగాన ముడత ఏర్పడటానికి సిద్ధంగావున్నా తన సౌందర్యం చూసుకు తానే మిడిసిపడుతోంది' అనుకుంటూ ముడతలు పడని తమ సౌందర్యాన్ని తాము అద్దంలో చూసుకుని మురుసుకుంటున్నారు. 'ఎంత టక్కులాడి! ఎంత నంగనాచితనం పోయి ఇన్నాళ్లూ మనవాళ్లనందర్నీ మోసగించింది! ఈ చెంపను కొడితే ఆ చెంప చూపేదట! భడవా!'

భార్యాభర్తలమధ్య మతభేదాలుండటం మంచిదిగాదని అనుకోనివ్వండి, అమాయకత్వాన్ని నటించి తమ సాంసారిక జీవనపు బంతులాటలో మరో చిన్న విజయాన్ని చేపట్టవచ్చుననే ఉద్దేశంతో కానివ్వండి—జాలిపడవలసింది చార్లెస్‌ను గురించి కాని రూత్‌ను గురించి కాదనే విషయాన్ని, తమతమ భర్తలముందు ఆ యిల్లాళ్ళంతా ఒప్పేసుకున్నారు. ఆ విషయమై మతభేదం లేకుండాపోయినా, ఇతరత్రా ఏవో కారణాలను పురస్కరించుకుని ఎల్లిస్ మూర్సీ భర్తమీద అలిగి బిర్రబిగిసి కూర్చోనే కూర్చుంది.

మరొక మూడు మాసాల అనంతరం, మాడ్ ఫెదర్ యింట్లో జరిగిన కాక్ టెయిల్ పార్టీలో ఈ ప్రసక్తి మళ్ళా వచ్చింది. పొద్దు క్రుంకటానికి ఇంకా ఒకగంట వేళవున్నా, చార్లెస్ దంపతులు పెందరాళే లేచి యింటికి వెళ్ళిపోయారు. దాంతో కల్లోలం బయలుదేరింది.

'ఈ మధ్యను వాళ్లు అతి పెందరాళే గూటికి చేరుతున్నారు'—ఎవరో అనేశారు. నిజానికి ముందు ఆమాట అన్నది యెవ్వరో యెవరికీ జ్ఞప్తిలేదుగాని అనంతరం యెవరికి వారు తామే అన్నామని ఆ కీర్తిని అంజించుకోవటానికి ప్రయత్నించారు.

అదో అర్థయుక్తంగా ఒకరి ముఖాల్లోకి ఒకరు చూచుకున్నారు.

'పెందరాళే లేవటం పెందరాళే బజ్జోటం చార్లెస్‌కు ఆరోగ్యైశ్వర్యమరణాలు ప్రసాదించుతుంది' అన్నది జాన్ మార్సీ.

లూసిలీ కిచకిచలాడింది. జార్జి బిగ్ బీ ఆ కిచకిచతో కొంత ఉత్సాహం పొంది, చొరవచేసినవాడై, సోఫాలో తన ప్రక్కనున్న తొడను కొంచెం తోవపాశం పెట్టాడు—ఆ ప్రక్కనున్నది లూసిలీ తొడ—నవ్వు కిచకిచలు తొణికిసలాడుతున్న గొంతుతో ఆవిడ చెవిలో రహస్యంగా చెప్పాడు:

'కొంచెం ఇటు తిరిగి ఆ బుగ్గకూడా చూడనివ్వు డియర్!'—

లూసిలీ—శోభావిన్యాసంతో నేననుకొండి—చివాల్న మోమటు త్రిప్పి తరుణారుణ ప్రభలతో తళతళలాడుతున్న కన్నుగవతో అతనివంక తీక్ష్ణ రూక్షణములు పరపింది.

ఆ సమయంలో సాగిపోతున్న దూషణ ప్రభంజనంలో ఈ సతీతిలకం యొక్క క్రోధంపు కంటియెరుపును గమనించినవారెవరూ లేకపోయారు.

'అలాంటి సిగ్గుమాలిన వ్యవహారం నేను మరెక్కడా చూళ్లేదు'—అన్నది మేరియన్ మిల్లిగన్.

'ఆడజాతికే అవమానకరం'—మాబెల్ గాప్స్ గావుకేక పెట్టింది.

'పాపం! అమాయకుడు చార్లెస్' అన్నాడు హెన్రీ మిల్లిగన్—తనకు తెలిసిన కుంటివాడైన ఒక గోళ్లవైద్యుణ్ణి జ్ఞాపకం చేసుకుంటూ.

'ఆ బాడఖావ్‌ను అసలు బజార్లోకి యీడ్వాలి'—హారియట్ వాన్ లైన్.

'ఊళ్లోనుంచి తరిమెయ్యాలిసిన రకం'—అనాబెల్ బిగ్ బీ.

'తనో పతిత్తునంది'—కారోలిన్ అంపర్ హిల్.

'అన్నులమిన్నగ మన రూతూ!
దాని
కున్నది సెంటా బుజిమేకా'— మాడ్ ఫెదర్ పాట కట్టాడు.

ఈ ప్రభంజనం కొంచెం తగ్గిన తరువాత: 'యేలగడు సేసెదరె ముద్దరాలి'ననే ధోరణిలో లేచి, 'ఏదియేమైనా మనం ముందుగా తొందరపడి రాళ్లు

రువ్వటం బాగుండదు' అని చిన్న ఉపన్యాసం చేసింది, ఎల్లిస్ మార్సీ.

కాని ఈ రువ్వుకోవటం, ఒకనాడు రూత్ తన మీద తానే రువ్వుకుంది. ఫోన్‌లో ఎల్లిస్ మార్సీని పిలిచి—'నేను నీతో ఒక సంగతి మాట్లాడాలి మీ యింటికి రానా?' అని అడిగింది. 'చార్లెస్ సంగతి ఒకటి అడగాల్లే!'—

ఎల్లిస్ మార్సీహృదయం ఎగిరి గంతు వేసింది—అయిందీ!—వాడు ఇంతకాలం అలా ఎలా వున్నాడన్నదే ఆశ్చర్యం, అనుకుంది.

'ఏమీ లేదనుకో—చార్లెస్ ఈమధ్య మరీ పసిపిల్లడిలా ప్రతిదానికీ నామీద ఆధారపడుతున్నాడు—నాకు బెంగగావుంది—ఇదేదైనా ఒకరకం మానసిక వ్యాధి కాదు గదా?'—

ఎల్లిస్ మార్సీ ఉత్సాహమంతా ఒక్కసారి కుప్పన కూలిపోయింది. నవనాడులూ జివ్వున దించుకుపోయాయి.

రూత్‌కు మళ్లా హింసాకాండ మొదలైందని వినటానికి ఉవ్విళ్లూరుతున్న హృదయాన్ని, రూత్ సాధించిన విజయం అలా చిరంతనమై నిలచిపోబోతున్నదన్న విషయం బోధపడేసరికి హతాశ యేర్పడిపోయింది.

'సరే! పక్క అమర్చుకున్నావు—ఇంకేం హాయిగా పడుకో' అని చిరాగ్గా ఫోను మూసేసింది.

ఇకేమిటి ఇలా మాట్లాడిందని ఆశ్చర్యపడుతూ రూత్ ఇంకా ఫోన్ పట్టుకు ఎదురుచూస్తూనే వుంది. ఒక క్షణానికి మార్సీ ఫోన్ దించేసిందని తెలుసుకుని తాను కూడా పెట్టేసి కుర్చీలోనుంచి లేచి వంటయింట్లోకి వెళ్ళింది.

టీ వాసన ఘుమాయించుతూనే వుంది; కాని రూత్ మనస్సుకేమీ హాయి కలుగక మనస్సులో ఏదో దిగులుగావుంది. జీవితం ఎన్నడూ కనుపించనంత నిరుత్సాహకరంగా కనుపించుతోంది. ఉన్నట్టుండి ఒక అభిప్రాయం తోచింది. చార్లెస్ పట్ల తను మంచిగా ప్రవర్తించుతున్నాననే ఆత్మాభినివేశమే తన కింతవరకూ జీవశక్తిగా ఉపకరించింది. ఇప్పుడు ఆ అవకాశం ఎక్కడో జారిపోయింది. ఈ ఊహ తోచగానే వెనువెంటనే మరొక ఉత్సాహజనకమైన ఊహ మెరుపులా హృదయంలో మెరిసింది. పోనీ యిప్పుడు మాత్రం ఏమిః మునిగిపోయింది. తన నిర్ణయాలు తను చేసుకోలేక చార్లెస్ ప్రతి చిన్న విషయానికీ తనమీద ఆధారపడుతున్నాడు—అలా అతనికి సహాయపడి తిరిగి ఆ ఆత్మాభినివేశాన్ని ఎందుకు పొందకూడదు?—ఆవిడ రక్తనాళాలలోకి తిరిగి ఒక నూతనోత్సాహం ప్రవహించింది.

మరొక గంటకు—వోవెన్‌లో మాంసం మగుతోంది. పొయ్యిమీద కూర ఉడుకుబట్టింది. రొట్టె కూడా తయారయిపోయింది. తలుపు తెరుచుకుని చార్లెస్ లోపలికొచ్చాడు. హాల్లో బూట్లు విడిచి ఉత్సాహంగా వంటయింట్లోకి వస్తున్నాడు.

'నేను మరేమంత ఆలస్యంగా రాలేదనుకుంటాను' అంటూ సరాసరి లోపలికి వచ్చి చెక్కిలి ముద్దు పెట్టుకున్నాడు.

'లేదు డార్లింగ్!—పెందరాళే వచ్చావు—కాస్త ఆ కాక్ టెయిల్ కలిపి పెడతావూ'—

'రాణీగారి ఆజ్ఞ!'—చిరునవ్వు నవ్వాడు.

పాత పడకకుర్చీకి బదులు కొత్తగా కొన్న కుర్చీలో చార్లెస్ కూర్చున్నాడు. అతని కెదురుగా మరో చక్కని కుర్చీలో కూర్చుని ట్రేలో సీసాలు సర్దుతోంది.

'నువ్వు లేకపోతే నేను ఏమైపోయేవాణ్ణో డార్లింగ్' అన్నాడు.

'నువ్వు లేకపోతే నేను మాత్రం!'—రూత్ ఆలోచించకుండానే అనేసింది. తను అలా ఎందుకు మాట్లాడిందీ తనకే అర్థంకాక ఆశ్చర్యపోయింది.

'సరే! ఈ రాత్రికి మన్‌హాటన్ చార్లెస్!'—

'రాణీగారి ఇచ్ఛ!'—భర్త సమాధానం పలికాడు.

* 'లండన్ మాగజైన్' సౌజన్యంతో

# మెలటూరు భాగవతమేళ నాటకములు

శ్రీ యస్వీ జోగరావు

ఆంధ్రుల నాట్యకళాప్రతిష్ఠ కధిష్ఠానము కూచిపూడి. అరవలకు మెలట్టూరు గట్టిది. ఉభయత్ర ఆ కళా సంప్రదాయములు చాలకాలమునుండి శాస్త్రీయముగను అనూచానముగను బ్రాహ్మణ భాగవతుల మేళములవలన అభివృద్ధినందుచు వచ్చినవి. కాని ఈనాడు మన కూచిపూడిలో కొలదిమంది పెద్దలయొద్ద సంప్రదాయజ్ఞానము మాత్రమే మిగిలియున్నది. ప్రదర్శనప్రతిష్ఠ లడుగంటినవి. మెలట్టూరులో నేటికి నేటేట నృసింహజయంతినాడనగా వైశాఖ శుక్ల చతుర్దశినాడు ప్రదర్శనములు సంప్రదాయబద్ధముగా పెద్ద పెద్దలచేత జరుపబడుచున్నవి.

విజయనగర సామ్రాజ్య మున్నదశలో నున్నప్పుడే రయస్వమా ద్వితీయులగు నాయక రాజులయాజమాన్యమున దక్షిణదేశమున ఆంధ్రప్రభుత నెలకొన్నది. తల్లికోటయుద్ధ మైన తరువాత నంతరించు రాయసామ్రాజ్యము నాశ్రయించియుండిన ఆంధ్రకవులు పండితులు నితర కళాజీవులును కుటుంబములకు కుటుంబములుగా రాజాశ్రయ మపేక్షించి దక్షిణాంధ్ర సంస్థానములకు వలసలుదీసిరి. బ్రాహ్మణపండితులు రాజులను మెప్పించి అగ్రహారములను బొందిరి. అట్లు వెలసినదే మెలట్టూరు. అది తంజావూరికి సుమారు రామడదూరములో నున్నది. తంజావూరి ఆంధ్ర నాయక రాజగు అచ్యుతప్ప నాయకుని రాజ్యకాలమున (క్రీ శ 1561-1614) అది యతని పేర బ్రాహ్మణాగ్రహారముగా నొనర్పబడినది.

అచ్యుతప్పనాయకుని తరువాత తంజావూరి ప్రభువులు, రసికులు, గీతిసాహితీప్రియులు నగు రఘునాథ విజయరాఘవనాయకుల కాలమునను, అటుపిమ్మట మహారాష్ట్రప్రభువుల కాలమునను, ఆ తంజావూరిలోనే కాక మధుర, మైసూరు, పుదుకోట మొదలగు సంస్థానములలోను అసలానాడు దక్షిణదేశములో నెటుచూచినను యక్షగానముల రూపమున కోటలో పేటలో ఆంధ్రసరస్వతి ప్రతిష్ఠ నృత్యము చేయుచుండినది. కాని యక్షగానముల రచన మాత్రమే బ్రాహ్మణకవులు చేయుచుండిరి. ప్రదర్శన ప్రతిష్ఠలు రాజాస్థానములనుండి రచ్చసావళ్ళవరకు భోగమువారు మొదలగు జాతులవారి పరమై యుండినవి. ఆ దినములలో నచటి యగ్రహారములందు స్థిరపడిన ఆంధ్రబ్రాహ్మణపండితులు కొందరు, భరత విద్యాధురంధరులు, అందులో కూచిపూడిప్రాంతములనుండి లేచివచ్చినవారును కొందరుండిన నుండవచ్చును. వారు అచటి యరవసోదరులను కూడగట్టుకొని శిష్టతా పరిపుష్టముగను సంప్రదాయబద్ధముగను నాట్యకళ నుద్ధరించుటకు పూనుకొనినట్లు తోచును. తత్ప్రయత్న ఫలితమే మెలట్టూరు భాగవతమేళ నాటకములు — అనగా భక్తులైనవారు కొందరు కూడి ప్రదర్శించు నాటకము లని యర్థము. కూచిపూడివాని వలె నివి నృత్యరూపకములు (Dance-dramas)

మెలట్టూరికి మెరట్టూ రనియు వ్యవహార మున్నది. దాని అసలు స్వరూపము అరవములోనయితే మిళత్తూరై యుండుననియు, తెలుగులోనయితే మేలపుటూరై, మెలట్టూరై యుండవచ్చు ననియు ఆచార్య శ్రీ గంటిజోగిసోమయాజి గారును, ఆచార్య శ్రీ విస్సా అప్పారావు గారును సెలవిచ్చియున్నారు. చక్కగా కుదిరియున్నది వారివక్కణ. అయితే మెలట్టూరిలోని ఇటీవలి ప్రదర్శన ప్రతిష్ఠలు మాత్రమే తమిళసోదరులవి. కాని వారు ప్రదర్శించు నాటకముల గ్రంథములును, తత్సంబంధములైన కళా సంప్రదాయములును మనవారివి. ఇది మన ఆంధ్రులెంతో అబ్బురపడవలసిన సంగతి. అరవదేశపు లోగిట యీనాటికిని ఆంధ్రసరస్వతి గజ్జెకట్టి వారి ఆదరాభిమానములు చూరగొనుచున్నదనిన మన మెంత అబ్బురపడవలెను మరి!

## మెలట్టూరు వెంకటరామశాస్త్రి :

భామకలాపాదుల విషయమున కూచిపూడివారికి కులపతి సిద్ధేంద్రయోగి. భాగవతమేళ నాటకముల విషయమున మెలట్టూరు వారికి వెంకటరామశాస్త్రి యట్టివాడు. ఈయన వెలనాటి తెలుగుబ్రాహ్మణుడు. ఇంటిపేరు తెలియదు. మెలట్టూరు వెంకటరామ

శాస్త్రి యని వ్యవహరించుటే పరిపాటియైనది. ఈయన శ్రీవత్ససగోత్రుడు, గోపాలకృష్ణార్యుని పుత్రుడు, లక్ష్మణార్యుని శిష్యుడు, దేవి నృసింహోపాసనములు గలిగిన మహాభక్తుడు, నాట్యసంగీతసాహిత్యవిద్యావిశారదుడు నని యాతని గ్రంథములవలనను, స్థలజ్ఞులగు పెద్దల వలన, తంజావూరు మండలము కుంభకోణము తాలూకా పాపనాశము సమీపమున నున్న అన్నకుడి గ్రామము నందలి ఆయన బంధువర్గమువారి వలనను కొంత కొంత విషయము తెలియవచ్చినది. మరియు నితడు తన వార్ధకమున త్యాగరాజునకు సమకాలికుడైనట్లు శ్రీ పి. సాంబమూర్తి డాక్టరు శ్రీ వి. రాఘవన్ మొదలగు తమిళదేశపు పండితు లనేకు లనుచున్నారు. త్యాగరాజు కాలము[1] క్రీ. శ. 1759—1847 అనగా వెంకటరామశాస్త్రి పదునెనిమిదవ శతాబ్ది నడిమిభాగమునను చివరను గూడ నుండియుండవచ్చునని యూహింపనగును.[2] త్యాగరాజు నివాసము తిరువారూరు మెలట్టూరికి సమీపమున నున్నది. అతడు వేంకటరామశాస్త్రి నాటకములను జాల మెచ్చుకొనినాడట. తాను నిందుమించట్టి రచన లొకటి మూడు చేసినాడు. త్యాగరాజ వేంకటరామశాస్త్రుల కృతులకంటె ముందే మెలట్టూరిలో నే యొక తెలుగు దృశ్యప్రబంధము వెలిసినది. అది క్రీ. శ. 1700 ప్రాంతము[3] వాడును తొలుత ఆయన గోదావరీ మండలమందలి కూచిమంచి అగ్రహార వాస్తవ్యుడును పిదప దక్షిణదేశమునకు జరిగినవాడును శ్రీకృష్ణలీలాతరంగిణీ రచనావిఖ్యాతుడు నగు శ్రీ నారాయణ తీర్థులు రచించిన పారిజాతాపహరణము. పైమువ్వురి రచనములు నుద్దిష్టరూపక ప్రయోజనములు. అందు కొన్ని నాటకము లనియు వ్యవహరింపబడినవి. వేంకటరామశాస్త్రి కృతు లన్నియు నాటకము లని యతని చేతనే వర్ణింపబడినవి. వానికి దశరూపక ప్రభేదముగు నాటకము లక్షణము పట్టదు అట నాటకశబ్దము రూపక సామాన్యవాచి. నాటి తంజావూరు యక్షగానములు నట్లే వ్యవహరింపబడినవి. తీర్థప్రభృతులకృతులు రచనాప్రక్రియనుబట్టి యక్షగాన ప్రాయములైనవే. అట్టి విశిష్టులు, రాజాశ్రయము నపేక్షింపని వారును ఆ రచనలు చేసిరనగా ఆనాడు దక్షిణదేశమున యక్షగాన మెంత ప్రజాదరపాత్రమై ప్రచుర ప్రచారము నందినదో తేటతెల్లమగుచున్నది.

## వెంకటరామశాస్త్రి కృతులు :

నారాయణతీర్థ త్యాగరాజుల పేరు ప్రతిష్ఠ లాంధ్రదేశమునకు వ్యాపించినవి. అందులకు కారణము వారి యితర కృతులు కాని యీదృశ్య రచనలు గావు. వేంకట రామశాస్త్రి కీర్తి తమిళదేశము దాటి రాలేదు. కాని యదట నతని దృశ్యప్రబంధములకు గల ప్రదర్శన ప్రతిష్ఠలు వారి కృతులకు లేవు. అతని నాటక కృతులుగా చెప్పబడునవి పండ్రెండు :

1 ప్రహ్లాద చరిత్ర, 2. రుక్మాంగదచరిత్ర, 3. మార్కండేయచరిత్ర, 4. ఉషాపరిణయము, 5. హరిశ్చంద్ర, 6. సీతాకల్యాణము, 7 రుక్మిణీ కల్యాణము, 8 కంసవధ, 9. శివరాత్రి నాటకము, 10. సత్సంగరాజు నాటకము, 11. అసత్సంగరాజు నాటకము, 12. జగల్లీలా నాటకము. ఇవి యన్నియు తెలుగు భాషలో రచింపబడినవే నట.[5] ఇందు చివరి యారింటిలో నన్నియు నితని కృతు లగునో కాదో, వాని ప్రతు లసలు దొరకుచున్నవో లేవో సరిగా తెలియదు. అవి అంతగా ప్రదర్శనల కెక్కినట్లు గణించి

---

1. చూ. వింజమూరి నరసింహాచార్యులవారి శ్రీ త్యాగరాజచరిత్ర, ఆంధ్ర గ్రంథమాల ప్రచురణ, మదరాసు, 1934.

2. 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని'ని బట్టి ఇతని కాల మింకను వెనుకకు బోవును. అందు శ్రీ సుబ్బరామ దీక్షితారుగారితడు తంజావూరి మహారాష్ట్ర ప్రభువులు శరభోజి, శివాజీల కాలమున నుండినట్లు చెప్పినారు. ఆ రాజుల రాజ్యకాలములు వరుసగా క్రీ. శ. 1800—1832; 1832—35. దీనినిబట్టి వెం. రా. శాస్త్రి 19.వ శతాబ్ది పూర్వార్ధమునను నుండినట్లు చెప్పవలెను.

3. చూ. History of Classical Sanskrit Literature by Dr. M. Krishnamacharya.

4. మెరట్టూరు బాలసుబ్రహ్మణ్యశాస్త్రి గారికడ నొక ప్రతి గలదట. తంజావూరు సరస్వతీ మహలులో నొక ప్రతి గలదు. కేటలాగు నెం. 544.

5. మొదటి యారును తెలుగువే యని చూచి తెలిసికొంటిని.

నట్లును తోపదు. ఈ గ్రంథము లన్నియు నముద్రిత ములు. కొన్నిటిప్రతులు గ్రంథలిపిలో విడివిడిగా డాక్టరు శ్రీ వి. రాఘవన్ గారి వంటి వాఙ్మయ పరిశోధ కులయొద్దను, శ్రీ ఆర్. కల్యాణరామయ్యర్ బి. ఏ. (మదరాసు) గారి యొద్దను దొరుకుచున్నవి.

తంజావూరు మండలము మెలట్టూరు శూలమంగ ళాదిగ్రామముల చుట్టుపట్లను గొన్నిటి ప్రతులు దొరుకవచ్చును. రుక్మాంగదము సీతాకల్యాణముల అసమగ్రప్రతులు మాత్రము తం. స. మ॥ నకు చేరినవి. (కేటలాగు నం. 582, 673). తం. స. మ. లో నున్న 'నానావిధ నాటకములు' అను రెండు కలగూరగంప తెలుగు గ్రంథములందు (కే. నం॥ 802 & 803) పై పట్టికలోని మొదటి యారింటి పేళ్లును గల గ్రంథ భాగములు చెదురుగా నున్నవి. అందుకొన్ని వేం. రా. శాస్త్రి గ్రంథ భాగములే. ఇవికాక తం॥ స॥ మ॥ లో 'నాటక పాత్రలు' అను నింకొక గ్రంథము (కే. నం. 799) గలదు. అందు 'రామాపండితుల నాటకాలు' అని పదమూడు నాటకముల పట్టిక యొకటి తెలుగున గలదు. ఆ రామాపండితుడీ వేంకట రామశాస్త్రి యగునో కాదో కాని యా పట్టికలో వేం. రా. శాస్త్రి నాటకముల పేళ్లు మాత్ర మైదు (రుక్మాంగదము, ఉషా రుక్మిణీ సీతాకల్యాణములు, శివరాత్రి నాటకము) గన్పట్టుచున్నవి. ఆయా నాటక ముల సమగ్రప్రతులు సంపాదించి (ఆ యరవదేశపు గ్రంథ లిపి ప్రతులు తప్పులు తడకలు, అందు తెలుగు శబ్దముల స్వరూపములే మారిపోయినవి. ప్రక్షిప్తము లనేకమున్నవి). మన లిపిలోనికి మార్పించి ఉన్నంత మట్టునకు తం. స. మ. తెలుగు లిపి ప్రతులతో సంప్రదించి పరిష్కరించి, ప్రచురించుట మంచిది.

వేంకటరామశాస్త్రి నాటకములలో నెక్కు వగా ప్రదర్శనల కెక్కి రాణించినవి ప్రహ్లాద రుక్మాం గద మార్కండేయచరిత్రములు, ఉషాకల్యాణము. ఇటీవల హరిశ్చంద్ర అందు ప్రదర్శన విషయమున ప్రహ్లాదయు, 6 రచనా విషయమున ఉషా పరిణయ మును 7 గొప్పవని చెప్పుదురు. ఇక్కడ ప్రతి గ్రంథ మును విడిగా విమర్శించుట కవకాశముచాలదు. అన్నియు ప్రసిద్ధేతివృత్తములు. అన్నిట రచనా ప్రక్రియ యించుమించొక్క మాదిరిగ నేయుండును. స్థూలముగా తత్స్వరూప మిట నిరూపింతును—

## రచనా ప్రక్రియ :

ప్రతి గ్రంథారంభమునను గ్రంథనామనిర్దేశక ము కందమొకటి, పిమ్మట కథాసంగ్రహము కవి స్వవిషయము నుటంకించు ద్విపదయు నుండును. కథారంభమునకు ముందు గణపతిస్తుతి మాత్రమే కాక పాత్రప్రవేశ సంరంభము గూడ నుండును. ప్రాయిక ముగ ప్రతిపాత్ర ప్రవేశమునకును సూచనగా నొక సంధివచనము, పాత్రవర్ణన ద్విపద, ప్రావేశికగ్రంథమును నుండును. యక్షగాన సామాన్యముగా అంకవిభాగ మవసరము లేకుండ కథాసంవిధానము తరచు సంధి వచనముల ద్వారా సూచింపబడును. సంధివచనాలే కాక పాత్రల సంభాషణ వచనాలు, స్వగతాలు కూడ అక్కడక్కడ నున్నవి. కాని తరచు సంభాషణలు దరువులు దీర్ఘద్విపదలలో నే జరుగును. గ్రంథాంత ములో మంగళము ఫలశ్రుతియు నుండు ననుమాట, అది యొక పెద్ద విశేషముగాదు; గ్రంథమున ద్విపద భాగము, దరువులు నెక్కువ. పద్యాలు ప్రసిద్ధ వృత్తాలు, జాత్యుపజాతులు, తద్భిన్నపద్యాలు అనగా కందార్థాదులు, కొలది సంస్కృత శ్లోకములు, చూర్ణి కయు ప్రయుక్తములైనవి. దరువులు ప్రసిద్ధరాగ తాళ ములలో నే గలవు. రాగాలు ఆహిరి, ముఖారి, ఉసేని బిలహరి, మోహన, పున్నాగవరాళి, పంతువ రాళి, కల్యాణి, దేవగాంధారి, మధ్యమావతి, సురటి మొ॥; తాళాలు ఆది, చాపు, రూపకము మొ॥ ఆదితాళము వాడకము తరచు, సంగీతశాస్త్ర దృష్టితో జూచినచో వేం. రా శాస్త్రి కృతులలో గొప్ప విశిష్టత గోచరించును. అపురూపములగు రక్తిరాగము లెన్నింటికో చక్కని లక్ష్యములు రచించినాడు వేం. రా. శాస్త్రి. ముఖ్యముగా ఆహిరియో ముఖారియో ఎత్తుకొనెనా ఆ యొక్క రాగము నే విభిన్న సంచార ములతో వివిధ రసోత్పత్తికుపయోగించ గలడు. అనొక గొప్ప నేర్పు. ఉశేని (హుసేని) స్వరజతి యొకటి యితని ప్రతిభకు తార్కాణముగా పేర్కొందురు పెద్దలు. 8 వెంకటరామశాస్త్రి కృతు లన్నిట రచన

---

6 &7 ఈ రెండింటికి మాత్రము నేను శూల మంగళముగ్రంథ లిపి ప్రతులు సంపాదించి తెలుగు లిపి ప్రతులు తయారు చేయించుకొన గలిగితిని.

8. See 'The Useni Swarajati' By Dr. V. Raghavan in the journal of the Music Academy, Vol.XVII-Parts I-IV; P P.149-159

రూపకోచితమైన సరళశైలిలో సాగిపోవును. ఆయన అనవసరమైన పాండిత్య ప్రాగల్భ్యము చూపించలేదు. నాటి వాడుక నుడికారపుసొంపు లక్కడక్కడ చిలుకరించినాడు. ఆయన నాటక సామాజికులలో అధిక సంఖ్యాకు లరవలు గద.

## ప్రదర్శన ప్రక్రియ— సంప్రదాయము :

ఈనాడు మెలట్టూరు భాగవతమేళ నాటకము లన్న వెంకటరామశాస్త్రి నాటకములే యన్నమాట. వాని రచనాప్రక్రియ చాలవరకు యక్షగాన సామాన్యమైనదే యైనను ప్రదర్శన ప్రక్రియ యట్టిది గాదు. అది మిక్కిలి కట్టుదిట్టములు గలది. అవి ప్రవేశపెట్టినవాడు వెంకటరామశాస్త్రియే. ప్రదర్శన సంప్రదాయములో మాత్రము మన కూచిపూడివారి కనుకరణము కొంత యున్నట్లు తోచును. వెంకటరామశాస్త్రి పూర్వులు గాని యీ కూచిపూడి ప్రాంతములకు చెందియుండిన వారేమో మరి! మెలట్టూరు భాగవత మేళనాటకములు వైశాఖమాస వసంతోత్సవ కాలమున వరుసగా నైదారురాత్రులు నడుమ నొకనాటి విరామములో జరుగును. వెం. రా. శాస్త్రి నృసింహోపాసకు డగుటచే గాబోలు అవి సరిగా నృసింహజయంతినాడు ప్రహ్లాద నాటకముతో ప్రారంభింపబడును. (కూచిపూడి వారికిని ప్రహ్లాద నాటకమన్న పట్టు).

మెలట్టూరు పురాధిష్ఠాన దైవతము వరదరాజు పెరుమాళ్లు. వసంతోత్సవసందర్భమున స్వామివారి ఆలయ బహిఃప్రాంగణమున పెద్ద పందిరి వేయుదురు. అందులో చుట్టుప్రక్కల గ్రామములనుండి నాటకములు చూచుటకు వచ్చిన వారికి భూరి సంతర్పణ జరుగును. బ్రాహ్మణ సమారాధన బాగుగా జరుగును. ఆ పందిటిలోనే నాటకరంగము స్వామి కభిముఖముగా తీర్చెదరు. నాటక మున్ననాటి సాయంకాలమున స్వామివారి ఉత్సవ విగ్రహమును బహుపుష్పమాలాలంకృత మొనర్చి మేళతాళములతో ఉపనిషత్సూక్త పఠనముతో నూరేగించెదరు. ఆ మాలికలనే రాత్రి నాటకము నందలి ముఖ్యపాత్రధారులు ధరించెదరు. వారి వేషధారణలో వర్ణవైశిష్ట్యము (*Colour values*) పాటింపబడును. రాజవేషములు తంజావూరి రాజుల కనుకరణగా నుండును. వారు రాక్షస వేషములకు, వినాయక నృసింహ బ్రహ్మాది వేషములకును కరాళము (*Masks*) లుపయోగింతురు. నృసింహ కరాళమునకు నిత్య పూజా పురస్కారము జరుగును. (కూచిపూడి వారును కరాళము లుపయోగింతురు). వారి ముఖ్యమైన సంగీత జంత్రపుహంగు మృదంగము, తిత్తి, ముఖవీణ. సూత్రధారుడు తాళముచిప్పలు పట్టుకొనును.

నాటకము రాత్రి సుమారు పదిగంటల కారంభింతురు. 'నట్టువాంగం' (హంగు) జరిపే భాగవతులిద్దరు, ముగ్గురు పాటగాండ్రు, జంత్రగాండ్రు, గ్రాంథికుడు, (Prompter) లేక ప్రసంగి అనగా సంధివచనములు చదివెడివాడు, - వీరు హంగుదారులు. సర్వసిద్ధమై జంత్రగాండ్రు సరే యనగానే భాగవతులు పుండరీకధ్యానశ్లోకములు పఠించెదరు. ఆ వెంటనే తైతై మనుకొనుచు కోణంగి రంగమునకు వచ్చును. గ్రంథములో చెప్పబడకపోయినను వాని రాక యొక ఆచారము. సూత్రధారిచే పృచ్ఛితుడై వసంతోత్సవ కార్యక్రమము జరిపించుటకై సభవారి నెచ్చరింప వచ్చితిననును. వాలకము హాస్యగాని వలె నున్నను అత డొక మహాభక్తుని క్రింద లెక్క. అటుపిమ్మట భాగవతులు 'తోడై మంగళము' అందుకొందురు. తోడై మంగళ మనగా మన తాళ్ళపాక చిన్నన్న రచించిన కీర్తన పంచకము.[9] ప్రతి కీర్తనకు ముందు జతి తరువాత శబ్దము, కౌస్తుభము (మాతు ప్రధానమైన శబ్దజతి వంటిది) పఠింపబడును. ఇక్కడికిదంతయు 'మేళం కట్టుడల్' అనగా పూర్వరంగ నిర్వహణ.

తరువాత గ్రాంథికుడు వచ్చి 'ఆది ద్విపద' అనగా కథాసంగ్రహ కవి విషయిక ద్విపద నొక రాగమాలి

---

9. దక్షిణదేశమున యీనాటికిని హరికథలు, భజనలు, బొమ్మలాటలు మొ॥ ప్రారంభించినపుడు తత్పఠన మొక పరిపాటి. ఆ పాటల పల్లవులు : 1. నాట, జంపె॥ 'జయజానకీరమణ—జయవిభీషణ శరణ'; 2. ఆరభి—మిశ్రచాపు॥ 'శరణుశరణు సురేంద్ర సన్నుత। శరణు శ్రీసతివల్లభ'; 3. మధ్యమావతి—ఆది॥ 'మురహర నగధర—ముకుంద మాధవ। గరుడగమన పంకజనాభా'; 4 సావేరి—రూపక ॥ 'దేవశ గణా రాధిత—దివ్యాంబుజపాద। శ్రీ వేంకటగిరి నాయక — శ్రీశ హెచ్చరిక'; 5. పంతువరాళి—ఆది॥ 'మాధవ; భవతు తే మంగళమ్। మధుమురహర తే మంగళమ్'.

కలో పఠించి, యొకవచనమును వినాయకపాత్ర ప్రవేశ సూచనచేసి యొకజతి చెప్పును. భాగవతులు ప్రావేశికీ ధ్రువను పఠింతురు. తదనుగుణముగా నృత్యము చేయుచు గణపతివేషము వేసికొని యొక కుఱ్ఱవాడు వచ్చును. రంగముపై కొంతసేపు కూర్చుండి, 'పండారకురుక్కళులు' (పూజారులు) రాగా వారిచే పూజ లందికొని, మరల నృత్యము చేయుచు నిష్క్రమించును. అంతట జతియుక్తముగా నొక వచనముపఠించి కటికమువాని ప్రవేశము సూచించును ప్రసంగి. భాగవతుల దరువున కనుగుణముగ నృత్యముచేయుచు కటికమువాడు ప్రవేశించును. కటికమువాడనగా రాజుగారి రాకగురించి సభవారి నెచ్చరింపవచ్చు చోపుదారు. మార్కండేయ చరిత్రలో మాత్రము రాజపాత్రకు ప్రసక్తి లేదని కాబోలు వీనివాలకము కనిపించదు. అందులో కురవంజి (ఎఱుకత) పాత్ర విశేషము కటికము భాగవతులచేత పృచ్ఛింపబడి తానెవడో యెందుకువచ్చినట్లో చెప్పి వెళ్లిపోవును. ఆతరువాత కథాపాత్రలు యథాసంప్రదాయ క్రమముగా సూచన వర్ణనలైనవెంటనే ధ్రువానుగుణ నృత్యముతో ప్రవేశించి వెంటనే నాటకప్రవర్తనలో పాల్గొనును. నాయికపాత్ర ప్రవేశవిషయములో మాత్ర మొక విశేషముండును. ప్రావేశికధ్రువతో ప్రవేశించిన నాయికాపాత్రధారి తన నర్తనకళాప్రావీణ్యము ప్రదర్శించవలెయుండు. అందుల కొక 'అల్లారిప్పు' (శుద్ధనృత్తము), 'మెయ్' (తారస్థాయి షడ్జస్వరము, ఆదితాళములో తాళజతి ప్రధానమైన సంగీత ప్రక్రియ), తిల్లాన, శౌక్కవర్ణము అభినయించి తీర్మానము చేయవలెను. నాటకమున సామాన్యముగా ప్రతి పాత్రకును అభినయపద్ధతి కరతలామలకముగావలె. అందును కూచిపూడి భామవేషగానికివలె నిందు నాయిక పాత్రధారి కెంతో అభ్యాస ముండవలెను. ఈ నాటకములలో స్త్రీ పాత్రలు పురుషులచేతనే నిర్వహింపబడును.10

ప్రసంగిగ్రంథములోని సంధివచనములనే కాదు వర్ణనాత్మకములైన ద్విపదలను గూడ చదువవలెను. సంవాదాత్మకములైన ద్విపదలు, పద్యములు మాత్రమే పాత్రధారులచే పఠింపబడును. ఇవి నృత్యప్రధానములైన నాటకములు కావున పాత్రధారి ప్రతిదరువునకును నృత్య మువచరించవలెను. అట్టిచో ఆ దరువులు కూడ వారే పఠించుట కనుకష్టమైనపని. అందుచే నాటకములోని పాటలన్నియు పాత్రధారులని కూడ సూత్రధారుడే ఎత్తుకొని తన వంతుదారులకు ముందు ముక్కలందిచ్చి తాను చివర తీర్మానము చేయును. వారి వంతలకనుగుణముగా అభినయము మాత్రమే పాత్రధారులు చేయునది. ఈ పద్ధతి మాత్ర మిది కథకళి ఫక్కి. కథకళి కేవలము ఇంగికాభినయప్రధానమైనది. అందు వాచికము పూర్తిగా పరిహరింపబడును. 11 ప్రసంగి పాత్రల నెప్పుడును పలుకరించదు. సూత్రధారుడే ప్రతిపాత్రను ప్రవేశింపగనే ఆ పాత్రనుతదుదంతము గొంత, అనగా నీ వెవరవు, ఎందులకు వచ్చినట్లో చెప్పుమని పృచ్ఛించును. అప్పుడప్పుడు పాత్రను కథను వ్యాఖ్యానించుటయు కూడ నుండును.

ఈ నాటకములలో శధాగుల ప్రవృత్త్యములన్న భరతసంప్రదాయములు పాటింపబడును. హిరణ్యకశిపుడు నరసింహునితో (నృసింహపాత్రధారి ఆ దినమంతయు నుపవాసముచేయును. ఇది కూచిపూడి ఆచారమే) యుద్ధంచి అతడు తన్ను పట్టవచ్చు సరికి తెరలోనికి పారిపోవును అక్కడితో ఆ నాటకముయిపోయినట్టే. నాటకము పూర్తియగు సరికి తెల్లవారును. భాగవతులు భూపాలరాగములో కీర్తన ఎత్తుకొని 'గర్భగుడి'లోని స్వామికి ప్రదక్షిణ దీపారాధనము లొనర్చి పురవీధులలోనికి నొక మేళముగాబోయి యింటింటికడ యథోచితముగా గౌరవింపబడుదురు. (కూచిపూడి భాగవతులు నిట్లే చేయుదురు)

పై లక్షణములను బట్టి చూచినచో వెంకటరామశాస్త్రి నృత్యరూపకము లెంత లబువు బిగువులు గలిగినవో తెలియగలదు. కూచిపూడి వానివలె నివియు కేవలము బ్రాహ్మణమేళముల వారి చేతనే ప్రదర్శింపబడునవి. కాని కూచిపూడి బ్రాహ్మణమేళముల వారూరూర దిరుగుదురు. మెలట్టూరు వారూరువిడచి ప్రద

10. తం. స. మ. లోని 'నాటకపాత్రలు' పట్టికలలో గూడ స్త్రీపాత్రలు పురుషులే ధరించినట్లు స్పష్టముగా తెలియుచున్నది. కూచిపూడివారున ట్లే చేయుదురు.

11. Vide : Triveni Vol 7. No. 4 for an essay on 'Dance traditions of south Inadia' By Mr. K. V. Ramachandran.

ర్శించరు. వెంకటరామశాస్త్రి నాటకములను మెలట్టూరు చుట్టుపట్ల నున్న శూలమంగళము, ఊత్తుక్కాడు, శాలియ మంగళము, నల్లూరు, తేపెప్పెరుమాళ్ నల్లూరు మొదలగు గ్రామములలోని బ్రాహ్మణ మేళములవారు కూడ ప్రదర్శించుటకు పూనుకొనిరి. వారును మెలట్టూరివారి వలె వారి గ్రామములలో నే విష్ణు సన్నిధానములో నే ప్రదర్శనలు జరుపుదురు. అందుచే నవి మతప్రయోజనాత్మకము లైన వని కొందరందురు.

ఆ యా మేళముల గురించి తెలియవగిన విశేషములు : మెలట్టూరివారి తరువాత చెప్పుకొన దగినది శూలమంగళమువారు. వారు వెం. రా. శాస్త్రి నాటకములనే కాక కొఱవంజిని కూడ యాడుదురు. అది యెక్కువగా ప్రజాదరము మూరగొన్నదట. వారు తమ ప్రదర్శనములలో గొన్ని హాస్యపాత్రలను సాంప్రదాయికముగా రూపొందించినారు. అవి కొఱవన్, కొఱతి (ఎఱుకవాఁ, ఎఱుకతె,) కరకం (గ్రామదేవత ఘటము ధరించువాఁడు), కుడుహుడుప్పంకి (శకునపక్షి), కప్పల్, గంజిన్ అనే తురక వేషపు హాస్యగాండ్రు. వీరు నాటక కథతో సంబంధము లేకుండగనే ప్రేక్షకులను రంజింపజేయుటకు రంగముపైకి వత్తురు. వీరి ప్రసంగములు మాత్రము అరవములోనే జరుగును. ఊత్తుక్కాడులో వెం. రా. శాస్త్రి నాటకములకు ముందు రాధాకృష్ణ విలాసము, పార్వతీ పరిణయము,12 భామకలాపము, గొల్ల కలాపము అనునవి ఆడుచుండెడివారట. కలాప మనగనే కూచిపూడి జ్ఞప్తికి వచ్చును. అది నృత్యప్రధానమై ఉపరూపక సదృశమైనది. 13 వెం. రా. శాస్త్రి వానిని జూచిన జూచియుండవచ్చును. తెరుపజ్ఞమైన నాటక ప్రదర్శన ఫక్కికకు అవి కొంత యుద్బోధకములైయుండిన నుండవచ్చును. ఈ గ్రంథములును తెలుగు వే. కుట్టనూరులో మాత్రము తమిళ రుక్మాంగదము వీధురాత్రులు ప్రదర్శించెడివారట. నల్లూరు భాగవతుల నాట్యవిద్యకు ప్రమాణ గ్రంథములు అభినయ దర్పణము, భావప్రకాశనము, రసమంజరి అని తెలియవచ్చినది.

ఇట నృత్యరూపకముల యుత్పత్తి గురించి కొంత వ్రాయుట అప్రస్తుతము గాదు. భారతీయ నాట్యకళా సంప్రదాయ సర్వస్వమునకును భరతుని నాట్యశాస్త్రమే మూదల. భరతుని తరువాత తరువాత కేవదాసీ జనమునకును గైవసమైవారికలనవిపుల ప్రచారముగాంచినను వారికన లాశాస్త్రము చదివి చెప్పవలసిన గురుస్థానములు బ్రాహ్మణపండితులే యైరి. ఆపండితులలో కేవలము విద్యావ్యాసంగ సంతుష్టులు గాక శాస్త్రప్రయోజనాభినివిష్టశీలురైనవారు కొందరు మేళములుగా నేర్పడి తామును గొన్ని ప్రదర్శనములు చేయుట కారంభించి యుందురు. అట్టి బ్రాహ్మణ మేళము ప్రసక్తి క్రీ. శ. 9 వ శతాబ్దినాటి కాశ్మీరకవి దామోదరగుప్తుని కుట్టనీమతమున గలదట. కుటనీమతమున 800 వ శ్లోకమున గల యొక రూపక విశేష ప్రసక్తినిబట్టి చూచినచో దక్షిణదేశపు రూపకపద్ధతులకు జాల సన్నిహితముగా నున్నదని రాఘవన్ గారనియున్నారు.14 ఆయన దక్షిణదేశపు భాగవత మేళనాటక సంప్రదాయ మతి ప్రాచీనమైనదనియు, అది తంజాపూరి చోళరాజులనాడు దేవాయతనస్థ నాటకశాలలో బ్రాహ్మణమేళాలచే ఆడబడు 'అరియకూత్తు' అను దానికి సంబంధించిన దనియు ననియున్నారు. అరియకూత్తు ప్రసక్తిగల రెండు చోళశాసనముల నెత్తి చూపియున్నారు.15 అది శిలప్పదిగారమున పది రకములగు కూత్తు (నృత్యము, నాట్యప్రదర్శనము లేక నాటకము) లలో నొకటిగా నుదాహరింపబడినది. కాని 'అరియకూత్తు' సప్తాంకికయని పై శాసనములలో రెండవది తెలుపుచున్నది. మెలట్టూరు భాగవత మేళనాటకములలో అంకవిభాగము గానరాదు. అట్టిచో రెండిటికిని సాదృశ్యము నూహించుట సమంజసముగా దోపదు. అసలు నృత్యప్రధానములైన రూపకము లనగా ఉపరూపకములు. భరతినాట్యశాస్త్రమున వాని యుబుసు లేదు. బహురూపరూపక లక్షణము విపులముగా నిచ్చినవారిలో ప్రధానుడు భావప్రకాశనకర్త

12. ఇది నుదురుపాటి వెంకన కవి దని గుర్తించితిని. దీని ఊత్తుక్కాడు గ్రంథలిపి ప్రతి శ్రీ రాఘవన్ గారి కడగలదు. ఒక తెలుగు లిపి ప్రతి ఆంధ్ర సాహిత్య పరిషత్తులో నున్నది. (నెం. 166)

13. For details vide., 'The Kalapam', an article by the present writer in Triveni, Silver Jubilee Number, 1955.

14. See his essay on Yakshagana — Triveni Vol. 7, No. 2.

15. Tanjore Inscriptions :-154 of 1895 & 120 of 1925.

యగు శారదాతనయుడు. (క్రీ. శ. 1175—1250) అతడు దక్షిణదేశీయుడగుటయు[16], అతని భావప్రకాశనము నల్లూరు భాగవతులకు ప్రమాణగ్రంథమగుటయు గమనింపదగినవి.

పద్మావతీచరణచారణచక్రవర్తి యగు జయదేవుడు తన గీతగోవిందము నభినయపద్ధతి నుద్దేశించె ననియును మన సిద్ధేంద్రయోగి భామకలాపమునకును, నారాయణ తీర్థుల శ్రీ కృష్ణలీలాతరంగిణికిని దాని 'బాణీ' యే మాదిరి యనియు పెద్దలందురు. సిద్ధేంద్ర యోగికి ముందే ప్రసిద్ధులైన కూచిపూడి వారి ప్రదర్శన లెంతవరకు నృత్యప్రధానములై యుండెనో తెలియదు గాని సిద్ధేంద్రయోగి భామకలాపము మాత్రము భావాశ్రయమైన నృత్యకళ ప్రధానముగా వెలసినది. (అది ఆత్మాశ్రయ ఫక్కికము, నాయికానాయక సఖీపాత్ర ప్రధానము నగుట గీతగోవింద సామ్యము). శ్రీ కృష్ణ లీలాతరంగిణి వస్తుప్రధానమైన రచనయైనను తాళజతి బహుళములైన ఆ తరంగములు పదములవలె హృదయంగమాభినయోద్దీపకములుగా నున్నవి. వెంకటరామశాస్త్రి అరియకూత్తు, భావప్రకాశన, గీతగోవింద, భామకలాప, కృష్ణలీలాతరంగిణుల నన్నిటిని జూచి యుండవచ్చును గాని వానిలో నతని నృత్యనాటకములకు ప్రత్యక్ష సంబంధ మేమియు గానరాదు. అవి యతని నూతన నృత్యరూపక శిల్పసంకల్పమునకు దోహదకారులై యుండవచ్చును. ప్రత్యక్ష సంబంధము కూచిపూడి వారి కలాపముగాక తదితరములగు ప్రహ్లాదాది నాటకములతోడను, తంజావూరు నాయక మహారాష్ట్ర ప్రభువుల ప్రాపకమున వెలసిన యక్షగానములతోడను. (ఇవి ఆంధ్రదేశపు సామాన్య యక్షగానములవలె శుద్ధ నృత్త నాట్యములతో సరిపుచ్చవచ్చునను మచ్చునకొక నృత్యకళాప్రియంభావుకులగు ఆ ప్రభువుల అభినివేశము కారణముగా నృత్యసమృద్ధములై వెలసినవి), ఇంకను మలయాళదేశపు కథకళి (తమిళదేశమునకు దగ్గరిదే మలయాళము. అదికాక కథకళి కళాప్రవర్తకులలో ప్రథముడు గాకపోయినను ప్రధానుడగు త్రయిమ్మణతంపి వెం. రా. శాస్త్రికి సమకాలికుడే. ఆ దినములలోనే కథకళి ,కళాసాహిత్య ప్రతిష్ఠ పరాకాష్ఠ నందినది) తోడను కొంతకొంత యున్నట్లూహింపవచ్చును. కాని వెం. రా. శాస్త్రి కృతులకు వాని ప్రత్యేకత వానికున్నది.

ఈ నాడే చేటట నీ భాగవత మేళనాటకములు జరుగుచున్న దొక్క మెలట్టూరులో మాత్రమే. కాని యీ మేళముల వారును అక్కడే కనిపెట్టుకొని యుండిన రాజపోషకుల రోజులు పోయినవి. ఇపుడు పొట్ట పోషణము జరుగుటలేదని నేటి చదువులు చదువుకొని పెద్ద పెద్ద యుద్యోగులై దేశము నలుమూలల చెదరి యున్నారు. కాని యొక విశేషము. ఈ భా. మే. నాటకములలో కొన్ని కొన్ని పాత్రధారణములు ప్రత్యేకము కొన్ని కొన్ని కుటుంబముల వారికి హక్కుగా పరిగణింపబడుచున్నవి. అందుచేత నే కాబోలు వారందరు నా వసంతోత్సవముల (అప్పుడే వేసవి సెలవులు) నాటికి స్వగ్రామములో కలసి యీ నాటకములను నిర్వహించుచున్నారు. అనగా వారి దెంతటి మహత్తరమైన యభినివేశమో తెలియుచున్నది. ఇంచుమించు వారందరును అరవలే. అయినా మహాపురుషులైన మన తీర్థులు, వెంకటరామశాస్త్రి, త్యాగయ్యలు వారి కిలువేల్పులవంటివారు. మన వారిని తగినట్లు గౌరవించుకొనుటలో మనమే వెనుకబడియున్నాము. ఇదివరకు తీర్థులు త్యాగయ్యలను కొంత కొంత ఎరుగుదుము కాని గట్టిగా వెంకటరామశాస్త్రి పేరు వినలేదు మనము. అతడు స్వయముగా గజ్జెకట్టినాడో లేదో గాని నాటక గ్రంథకర్తయై తత్ప్రదర్శన ప్రక్రియా సంప్రదాయ సంధాతయు తానేయై అరవసోదరులను కూడ గట్టుకొని, వారి మన్నలకును పాత్రుడైన మహానుభావుడు. (ఆయన గురించియు, ఆయన నాటకములగురించియు శ్రీ రాఘవన్ ప్రభృతులు కొలది మంది తమిళదేశపు పండితులు మాత్రము కొద్దికొద్దిగా ఆంగ్ల తమిళ పత్రికలలో వ్యాసములు వెలయించి యుండిరి. అరవలు భాషా విషయములో మనకు పితృదేవతల వంటివారే యైనను సంగీత విషయమున మన భాషకున్న మాధుర్యము వారి భాషకులేదని కాబోలు వారి రాష్ట్రములో వెలసిన మన సంగీత సాహిత్యముల నాదరించి ప్రచారము

16. చూ. భావప్రకాశనము—బరోడా ప్రతి, 1930—ఉపోద్ఘాతము.

నను దెచ్చి సహృదయతను ప్రకటించిరి. అందుల కాంధ్రులకు వారవశ్య మభినందనీయులు).

మెలట్టూరులోనైనను భాగవత మేళనాటక ప్రదర్శనము లెల్లకాలము సాగగలవని చెప్పలేము. అంతటి యుత్కృష్ట కళాసృష్టి నన్యరాష్ట్రముల వారికిని అది సజీవముగా నుండగనే ఎరుకపరచుట మంచిది. ఆ భాగవతులు తమయూరి పొలిమేర దాటి ప్రదర్శించరు. వారికి ధనార్జనాశ లేదు. ఎంత కుతూహలమున్నను దూరప్రదేశముల నున్నవారందరికి నక్కడికి పోయి చూచుట కవకాశము లుండవు. అంతేకాదు మన తరువాతి తరాలవారికిని ఆ కళాస్వరూపము నందజేయుట అవశ్యము వాంఛనీయము. అందుల కొక్కటే మార్గము గలదు. ప్రభుత్వము నారైన పూనుకొని వెంటనే 'డాక్యుమెంటరీ' చిత్రములు నిర్మించుట.

---

గమనిక : నా కీ వ్యాసరచనలో ఆకరములు పేర్కొనబడని అనేక ముఖ్య సందర్భములందు మిక్కిలి తోడ్పడినట్టివి :

1. శూలమంగళము భాగవతోత్తములు శ్రీ ఎం. స్వామినాథ భాగవతార్, బి. ఏ. (మదరాసు), శ్రీ ఆర్. కల్యాణరామయ్యర్, బి. ఏ. (మదరాసు) గారలు దయచేసిన విలువగల విపులమైన ఫోటోగ్రాఫ్లు, గ్రంథములు.

2. డాక్టర్ శ్రీ వి. రాఘవన్, ఎం. ఏ., డి. లిట్ గారి భాగవత మేళనాటకములను గూర్చిన ఆంగ్లవ్యాసము (Journal of the Indian Society of Oriental Art—Sri Coomaraswamy Comemoration Volume)

3. 'The Music of the Nrtya Natakas of south India' By Srimati K. Gomati. (Thesis submitted for M. Litt of the Madras University—ఇది అముద్రితము. మదరాసు విశ్వవిద్యాలయ గ్రంథభాండాగారమున దీనికి 'టైపు' ప్రతిగలదు. శ్రీమతి గోమతిగారు కూడ యీ విషయానుసరించి శ్రీ స్వామినాథ భాగవతార్ కడ శుశ్రూష చేసినవారే)

వీరందరికిని నా కృతజ్ఞతాపురస్సరమైన అభివాదములు.

# విషాదాంతం

## నాగభూషణ్

### పాత్రలు

| | |
|---|---|
| ప్రసాదరావు | రంగయ్య |
| రామమోహన్ | గోపాలం |
| సూర్యం | విజయ |
| చంద్రం | కుసుమ |

### మొదటి రంగం

తెరలో: సోదర సోదరీమణులారా! సమాజంలోని కుళ్ళును వెలికితీసి, వినూత్న పంథాలో సజీవ సమాజాన్ని స్థాపించి, నవజీవనానికి నాందీ ప్రస్తావన చెయ్యాలంటే మనిషికీ మనిషికీ మధ్యనున్న ఈ తెరను లాగివెయ్యండి.

[తెర త్వరగా తొలిగిపోతుంది. అది ప్రసాదరావుగారి మేడలో ముందుహాలు. వాకిట్లోకి, వెనుక తోటలోకి, ఇంటి లోపలి భాగానికి పోవడానికి మూడు విడివిడివాకిళ్లు వున్నయ్. నవనాగరిక ప్రపంచంలో సాధారణంగా ధనవంతుల ఇళ్ళల్లో కనిపించే ఏ వస్తువూ ఆ గదిలో వుండకుండా పోలేదు. తెర ఎత్తగానే మనకు కనిపించే ఇద్దరూ, ఏదో గంభీరంగా ఆలోచిస్తూ, ఎంతకూ ఒక నిర్ణయానికి రాలేకపోవడంవల్ల విషాద వదనాలతో కనిపిస్తారు. ఒకసారి ఒకరికేసి ఒకరు, మరొకసారి ప్రేక్షకులవంక చూస్తారు. చివరకు ఒకడు ఏదో నిశ్చయపరుచుకున్నట్లుగా తలపంకించి, లేచి, ముందుకు వచ్చి, ప్రేక్షకులకు నమస్కరిస్తాడు.]

సూర్యం: సోదర సోదరీమణులారా! నమస్కారం. నా పేరు సూర్యం. ప్రసాదరావుగారి రెండో అబ్బాయిని. ప్రస్తుతం కాలేజీలో బి. ఏ. చదువుతున్నాను. ఇహ మావాడు—

[రెండో అతన్ని చూపిస్తాడు.]

చంద్రం: నమస్తే! నా పేరు చంద్రం. నేనూ, సూర్యం ఒకే క్లాసు చదువుతున్నాం. ప్రపంచానికి పై సూర్యచంద్రులు ఎలాగో, మా కాలేజీకి మేమూ అంతే—అయితే పైవాళ్లు ఒకరు వున్నప్పుడు మరొకరు వుండరు. కాని మేం యిద్దరం లేకుండా ఎప్పుడూ వుండం—

సూర్యం: మావాడు చెప్పినవన్నీ నిజమే. అయినా, ఈ నాటకంలో మేం ఏపాత్రలను ధరిస్తున్నామో, మాకే తెలియదు. నిజానికి ఈనాటకానికి ప్రయోక్త మానాన్న. నాయకుడు మా అన్నయ్య ... నాయిక ఎవరో ఇంకా నిర్ణయం కాలేదనుకోండి—(ఒక్క క్షణంఆగి) అన్నట్లు, చెప్పడంమరచాను—మా నాటిక 'విషాదాంతం' ... (చంద్రంకేసి తిరిగి) ఎలావుందిరా?

చం: ఏడిసినట్టుంది.

సూ: (బిక్కచచ్చి) ఏం?

చం: ఏం ఏమిటి? 'ఇది విషాదాంతనాటకం' అని ముందేచెబితే ఆడియన్సులో ఒక్కడు వుంటాడా హాలులో? ... అయినా, వీరం

దరూ ప్రజ్ఞాధురంధరులూ, అశేష శేముషీ విభవంకలవారు—వాళ్ళకు ఆమాత్రం తెలియదా, ఇది సుఖాంతమో, విషాదాంతమో?

సూ : అయితే ఏంచేద్దామంటావ్?

చం : ఉపోద్ఘాతం లేకుండానే నాటకం మొదలుపెడితే ఎంతబావుంటుంది?....ఓ! అదుగో, మీ నాన్నగారు వస్తున్నారు, ప్రేక్షకులకు పరిచయం చెయ్యి.

[ప్రసాదరావుగారు వస్తాడు. మనిషికి నలభై అయిదు సంవత్సరాలవరకు వుంటయ్. సిల్కులాల్చీ, మల్లుధోవతి, అధునాతన నవనాగరిక వేషం]

సూ : సోదరీసోదరులారా! వీరు మా నాన్నగారు. ఈ నాటకానికి ప్రయోక్త. అకళంక దేశభక్తులు; నిస్వార్థ ప్రజాసేవకులు కావడం వల్లనే వారికి అంత గౌరవం. గౌరవం ద్వారా ధనం; ధనంద్వారా పలుకుబడి—

ప్రసా : ఏమిట్రా యిదంతా?

సూ : ప్రయోక్తగారిని ప్రేక్షకులకు పరిచయం చేస్తున్నాం నాన్నా.

ప్రసా : ఏడిసినట్లుంది. ఈ నాటకాలతో నీకు పిచ్చి ఎక్కేటట్లుగా వుంది.

చం : అదిమాత్రం అసంభవమండీ!

ప్రసా

చం మనిషికి రెండుసార్లెలా పిచ్చెక్కుతుంది చెప్పండి.

సూ అంటే, నన్ను ఇదివరకే పిచ్చివాణ్ణి చేశావేరా?

చం ఒక్కసారి 'నాటకాల పిచ్చి' ఎక్కిం తర్వాత, ఇక 'నాటకాలతో పిచ్చి' ఎలా ఎక్కుతుంది?

సూ : భేష్! ఆలస్యంగా సమర్థించినా అద్భుతంగా సమర్థించావురా!

ప్రసా ఎంత మిడిసిపడుతున్నావురా? మా కాలంలో యిట్లాగా? పెద్దవాళ్ళ ఎదట ఇలా తెగబడి మాట్లాడేవాళ్ళమా? ఆ రోజుల్లో పిల్లలకు ఎంత వినయం, ఎంత విధేయత?

సూ : అవునవును. ఎంత భయం? ఎంత భక్తి?

ప్రసా : నువ్వు వెక్కిరించినంత మాత్రాన వాళ్ళ గొప్పతనం ఎక్కడికీపోదు...సరే కాని, అన్నయ్య రాత్రి వచ్చాడట, క్రిందికి వచ్చాడా?

సూ వాడికింకా తెల్లవారిందో లేదో!—నేను వెళ్ళి మేలుకొలుపులు పాడి వస్తాను.

ప్రసా రక్షిస్తావ్—వెళ్ళు—

సూ : మళ్ళీ వస్తానుగా!—రా, రా చందమామా!

[వెళ్ళిపోతారు.]

['రోజులు ఎంత మారాయ్! మా రోజుల్లో' అనుకుంటూ సోఫాలో కూర్చుంటాడు. ఓ క్షణం తర్వాత కాఫీ తీసుకొని విజయ వస్తుంది. వయసు పంధొమ్మిది, ఇరవై సంవత్సరాలు. అందమైన ఆమెకు వినయం మరీ శోభనిచ్చింది.]

ప్రసా : (కాఫీ తీసుకుంటూ) ఏమమ్మా! మీ చినబాబుగారు లేచాడా?

విజయ : ఇంకా లేవలేదు. చాలా ప్రొద్దుపోయి పడుకున్నట్లున్నారు.

ప్రసా : నేను ప్రశ్న వెయ్యకుండానే ఏదో ఓ సమాధానం చెప్పు...అయినా, వాడు చేస్తున్న దేం బావుండటంలేదు మొన్న అయిదు వందలు తీసుకువెళ్ళి వారంరోజుల్లో వట్టి చేతుల్తో తిరిగివచ్చాడు. ఇన్నేళ్లు వచ్చిన తర్వాత నయినా కాస్త యింటిమీద ధ్యాస వుంచుకోకపోతే ఎలా?

విజయ : మీరొక్కసారి చెప్పిచూడండి.

ప్రసా : అదే నేనూ అనుకుంటున్నాను. వాడు లేచినతర్వాత ఒకసారి నాదగ్గరకు రమ్మను. —(విజయ వెళ్ళబోతుంది) అన్నట్లు, మీ నాన్నగారు ఈ పూటనేకదూ వస్తా రన్నావ్?

విజయ : అవును.

ప్రసా మీ అన్నయ్య—?

విజయ : అన్నయ్యకూడా వస్తాడనే నాతోచెప్పాడు.

ప్రసా : నేనే వాళ్ళకు కబురుచేశాను విజయా! మీ అన్నయ్య సీతను పెళ్ళిచేసుకోనన్నాడట!— నాకేమీ బాగాలేదు.

విజయ : (అవునన్నట్లుగా తలతిప్పుతుంది.)

ప్రసా : (దానివల్ల ప్రోత్సాహితుడై) చూడమ్మా! ముందు మాట ఇవ్వడమెందుకు? తరువాత వాళ్ళు అటువంటివాళ్ళని, ఇటువంటివాళ్ళని వంకలు పెట్టడం దేనికి?

విజయ : క్రిందటిసారి వచ్చినప్పుడు నేనూ అమాటే చెప్పాను.

ప్రసా : అయినా, తెలిసినవాళ్లు...... మీ అంత బాగాలేరనుకో — అంతమాత్రాన వదిలి వేస్తారా?.... ఇవ్వాళ నేను ఖచ్చితంగా చెప్పదలుచుకున్నాను ... ఇటువంటి మాట తప్పేమనిషి మీనాన్న తరువాత నా ఆస్తికి అజమాయిషీ చేస్తున్నాడంటే నా కెంత అప్రతిష్ఠ?

విజయ : నిజం.

ప్రసా : కొంచెం నువ్వుకూడా చెప్పమ్మా...ఆ సీత వచ్చి నిన్న ఎలా ఏడ్చిపోయిందో చూశావుగా! ... అయినా ఈ ఆడవాళ్ళంతా అంతేలే! మగవాడు ఆశపడ్డప్పుడు అంతా మునిగిపోయినట్టు దగ్గరకే రారు తీరా మగవాడు విసుగుపుట్టి విరమించుకున్న తర్వాత కాని తెలిసిరాదు.

[విజయ మాట్లాడదు]

అయినా మా కాలంలో ఇట్లాగా? తల్లి దండ్రులు ఏ పిల్లను చూపించి పెళ్ళిచేసుకోమంటే, ఆ పిల్ల మెళ్ళో మంగళసూత్రం కట్టేవాళ్ళం...ఇవ్వాళ—? ...ఏముంది! చెట్టు చెడే కాలానికి కుక్కమూతిపిందెలు.

[సూర్యం, చంద్రం వస్తారు.]

సూ ఎవరి సంగతి నాన్నా? ఈ కాలంలో పిల్ల లేనా? అవును...మరీ అదుపూ, ఆజ్ఞా లేకుండా పోతున్నారు — అన్నయ్యే చూడు! ఇంతవరకు లేవలేదు...వాడికి మగ వాళ్ళ మేలుకొలుపులు పనికిరాలేదు... అయినా...సరే! అక్కడ జరిగిందంతా చెప్పరా చంద్రం.

చం : ఏముంది?

సూ : ఏమీ లేకపోతే నువ్వు చెప్పేదేమిటి?.... వున్నదే చెప్పు—

చం : అదే!...గదిలోకి వెళ్ళాం. నిద్రా దేవత రామాన్ని తన ఒళ్ళో పెట్టుకొని ఆప్యాయంగా లాలిస్తోంది. మెల్లగా తట్టి లేపాం.. ఊహుఁ. బిగ్గరగా మాట్లాడాం! ఆ దేవత వదలందే! కొట్టాం, తిట్టాం! అబ్బే! అవన్నీ చెవిటిముందు శంఖా లయినయ్.

సూ : ఇహ తెమిల్చి ఏడవ్వోయ్.

విజయ : (నవ్వుతూ) ఏది ముందు చెయ్యమంటావ్?

చం : అంటే—?

విజయ : తెమల్చడమా? ఏడవడమా? ఏది ముందు చెయ్యాలి అని?—

చం : రెండూ చెయ్యకుండా నే తప్పించుకుంటాను గా! మహా మహా ప్రిన్సిపాలు గారి క్లాసు ఎగకొట్టి అటెండన్సు వేయించుకుంటూ వుండగా లేనిది ఇదో లెక్కా?—ఇన్ని చేసినా రామం లేవలేదు. చివరకు సంగీతం మొదలుపెట్టాం ఇంకేం! టక్కున లేచి కూర్చున్నాడు. లేచినవాడు వూరుకున్నాడా? లేచి—

ప్రసా : చెప్పు చంద్రం. సస్పెన్సు దేనికి?

చం అదే!...లేచి, 'చాకలివాళ్ళు వచ్చారేమో చూడరా,' అన్నాడు.

సూ "చాకలివాళ్ళు ఇప్పుడెందుకొస్తార్రా?" అన్నాను నేను.

చం 'అబ్బే, ఏమీ లేదు. స్నేహితులకోసం వచ్చిన గాడిదలను తోలుకుపోవడానికి' — అన్నాడు రామం.

సూ ఈకాలం పిల్లలు చూశావా నాన్నా! .. ఇంతకూ నాటకం సంగతి ఏం చేశావ్ నాన్నా?

ప్రసా నీకెప్పుడో చెప్పాను కదరా, సూర్య చంద్రాదులు అస్తమైనా ఈనాటకం ఆగదు.

చం ఎవరు? మేమే!

ప్రసా కాదు .. (పైకి చూపుతూ) వాళ్ళు.

చం : రక్షించారు...అంటే—'నిటలాక్షుం డిపు డెత్తి వచ్చినను రానీ' మాదిరిగానంటారు. (తన ఉపమానానికి తనే మురిసిపోయి) ఎట్లా వుందిరా కంపారిజన్?

సూ (తేల్చేస్తూ) ఫరవాలేదు.

చం ఇంత గొప్పగా పోల్చినందుకు అమాంతం అభినందించక ఫరవాలేదని నానుస్తావేం?

సూ నేను 'ఫరవాలేదు' అంటే మా తెలుగు లెక్చరరు గారి 80% మార్కులతో సమానం; తెలుసా?

చం (హుషారుగా) థాంక్స్.

సూ (చంద్రంవైపు చూస్తూ) చూశావా నాన్నా, ఈ కాలం పిల్లలు!

ప్రసా : సంతోషించాం కాని, నోరుముయ్యనోయ్.

సూ : (నోరు మూసుకుంటూ) పెద్దవాళ్ల మాటలు వినాలి —

చం : (సూర్యాన్ని అనుకరిస్తూ) బుద్ధిమంతుల లక్షణం.

ప్రసా : (నవ్వుకుంటూ) మీ నాన్న రాగానే కబురు చెయ్యమ్మా! పైన వుంటాను (విజయ తలవూపుతుంది. ఆయన వెడతారు. విజయ కూడా ఆయన తాగిన కాఫీ గ్లాసు తీసుకొని పెరటివైపుకు వెడుతుంది.)

చం రామం ఎంత బెట్టు పోతున్నాడురా!

సూ ఆc! మనంతటు మనం కోరాం కదరా! 'వనిత తనంత తా వలచి వచ్చిన మల్కన గాదె యేరికిన్' అన్నట్లుగా పిలవా పెట్టాకుండా వీడిదగ్గరకు కీర్తి కాంత వస్తుంటే విడు వట్టి ప్రవరుడయి కూర్చున్నాడు.

చం : అయినా నిన్నటిదాకా మన నాటకంలో వేస్తానని, ఇంతలో ప్లేటు ఫిరాయించాడేరా?

సూ : ఏముంది? మొన్న టూర్‌లో ఏదో పురుగు తొలిచి వుంటుంది. మళ్ళీ పరిషత్తుకు నాటకం తీసుకువెడతాడట! — ఇప్పుడు వ్రాయడానికి కూర్చున్నాడు...... నేను చెప్పాను, మనం నాటకాలాడుతున్నది కీర్తికోసం కాదు, కళకోసం; మన ఆదర్శాలు అందరిముందు వుంచడంకోసంరా — అని. అవన్నీ వదిలి, తను కళ్లనీళ్ళు కారకుండా, ప్రపంచానికి కూడా సంవత్సరానికి ఒక్క కుమ్మద్దా మనుకుంటున్న ఈ పరిషత్తులో నాటికి కంకుకు చెప్పు?

చం : సరే! ఇంతకూ రాముం మన నాటకంలో వెయ్యడానికి వప్పుకుంటేనా?

సూ : నీకా భయం అక్కర్లేదు. వాడిచేత వేయించే భారం నాది.

చం : అచ్ఛా! అయితే త్వరగా రిహార్సల్సు మొదలు పెట్టాలి. ఇంకా ఆలస్యం చేస్తే మన ప్లానంతా ఫట్టాసీనా అవుతుంది.

సూ : అరే! ఇంతవాళ్ళం ఇక్కడ వున్నాం, అంతపని జరగనిస్తామా?

చం : గుడ్!...అయితే నాటకాన్ని ప్రేక్షకులకు పరిచయం చెయ్.

సూ అరేమిట్రా! ఇంకా నాటకాన్ని ప్రేక్షకులకు పరిచయం చేద్దాంరా అంటే నాకొ మాత్రం తెలియదా అన్నావ్. ఇప్పుడు —

చం : అది కాదురా! నాటకం సుఖాంతమో, విషాదాంతమో చెప్పకుండా కాని— పేరు వదిలెయ్. 'వాటీజ్ ఇన్ ఎ నేమ్' అన్నాడు ......ఎవరు?

సూ : ఎవరో తెలిస్తే కాలేజీలోనే వుండేవాడిని గా! ... సరే! (గొంతు సవరించుకొని) సోదరీసోదరులారా! నాటకాలు కేవలం సరదాకోసమో, ప్రచారంకోసమో కాక, సాంఘిక న్యాయాన్ని నిరూపించే నగ్న సత్యాలు కావాలన్నది నా అభిప్రాయం. జీవిత సత్యాన్ని నిరూపించడానికి నాటకం మూలాధారం. అనేకమందికి తెలియని రహస్యమైన గొప్పతనం నాటకంలో మరొకటి వుంది. అభ్యుదయ మార్గాన సాంఘిక విప్లవానికి మానవజాతి పురోగమించి, చరిత్రను పునరుజ్జీవింపచేయగల శక్తి నాటకానికి మాత్రమే వుంది.

చం : ఈ నాటకాన్ని ప్రేక్షకులకు పరిచయం చెయ్యరా అంటే, నాటకాల్ని గురించి

ఉపోద్ఘాతం మొదలు పెట్టావేరా? ఉపోద్ఘాతమే బంగాళాఖాతం అయింది. ఇక ఆపు.

సూ : నువ్వు పోయి దాన్లో పడితేగాని, దీనికి అంతం వుండదు. నేను చెప్పిందంతా ప్రత్యక్ష సత్యం. మనలో చాలామంది కళ్లు వుండికూడా చూడలేని దాన్ని నేను చెప్పాను. సంఘంమీద నాటకప్రభావం ఎంత? దానికి సమాధానమే ఈ నాటకం. ఈ భావాలే నన్ని నాటకం వ్రాయడానికి పురికొల్పినయ్. ప్రదర్శించడానికి ఉత్తేజపరిచినయ్. అటువంటి అప్పుడు నువ్వన్నట్టుగా నా యీ ఉపోద్ఘాతమే లేకపోతే, నా నాటకం లేదు. నా నాటకం లేకపోతే నేను లేను.

చం : ఇవ్వాళ ప్రొద్దునే లేచి ఎవరి మొహం చూశానో కాని, నీ ఉపన్యాసాలు వినలేక చస్తున్నాన్రా!

సూ : ఆ చూసిన వాళ్లెవరో, వాళ్లదగ్గరకు వెళ్లి అనంతం అభినందించి రారా. లేకపోతే ఈ అవకాశం అందరికీ అనుకున్నప్పుడల్లా దొరుకుతుందా?

చం : ఇంతకూ నాటకాన్ని గురించి ఏమీ చెప్పవన్నమాట!

సూ : పానకంలో పుడకలా అడ్డువచ్చేది నువ్వే, మళ్లీ చెప్పడం లేదని దెప్పిపొడవడం నువ్వేనా?

చం : ఐతే మనం నోరు తెరవం. నువ్వు చెప్పుకుపో—

సూ : ప్రపంచాన్ని ఒకప్రమాదంలోనుంచి తప్పించావురా!—

నిత్యజీవితంలో నిరంతర వ్యథతో నిండి, ఆవలితీరం కనుపించని అమాయకుడి విషాదాంత గాథ యిది...... చెడు వుంటేనే విషాదాంతం కానక్కరలేదు... ఇది మంచికీ మంచికీ జరిగిన సంఘర్షణ...బలం కలిగింది నిలుస్తుంది. రెండోది నశిస్తుంది.

చం : అబ్బబ్బ! ప్రేక్షకులకు నీ నాటకం గొప్పగా వుంటుంది. సరా? ఇహ కథ ఏమిటో చెప్పు—

సూ : చెప్పబోతున్నదే అది!—భూత భవిష్యద్వర్తమానాల్లో ఎప్పుడో ఒకప్పుడు, ఎక్కడో ఒకచోట, ఎవరో ఒక మనిషి.

చం : ఉఁ!

సూ : కాశీమజిలీ కథల్లో మాదిరిగా నువ్వు 'ఊ' కొట్టకపోతే కథ సాగదా ఏరా?

చం : కాదురా! ... లేకపోతే నిద్రపోతున్నావేమో నని! (సూర్యానికి కోపం రావడం చూచి) సారీ బ్రదర్...కంటిన్యూ—

సూ : ఆయనబంగారు పిచ్చుక. ఆయనకు ఒక్కడే కొడుకు — అందమైనవాడు, చదువుకున్నవాడు, బుద్ధిమంతుడు—

చం : నా స్నేహ ... నా స్తబ్ధత లోపించిందిరా బ్రదర్—

సూ : ఏం?

చం : ఒకేమనిషి చదువుకున్న వాడైవుండి, బుద్ధిమంతుడు కావడం కేవలం అసహజం ... సింప్లీ ఇంపాజిబుల్...

సూ : నీబోటివాళ్ళు వుండబట్టే దేశం యిలా తయారైంది! ... ఆమాత్రం ఊహించలేవురా? ఊహ లేనివాళ్లను ఉరితియ్యమన్నాడు షెర్లాక్ హోమ్స్.

చం : వాడు మావాడేలే .... సరదాకి చెప్పివుంటాడు....ఆ, తరువాత?

సూ : అతను తెలివిగలవాడు కూడాను—

చం : ఏం? కొంపతీసి ఎవరినయినా ప్రేమించాడా యేమిటి?

సూ : అమోఘం...అద్భుతం. నీ అత్యద్భుతమైన ఈ పరిశోధనకు నీకు నోబుల్ బహుమానం యిచ్చినా తక్కువే—నిజంగా అంతే జరిగింది. ఆ అబ్బాయి ఓ అమ్మాయిని ప్రేమిస్తున్నాడు.

చం : సహజమే కదా!

సూ : మనకు సహజం కావచ్చు. వాళ్ళవాళ్ళకది కొండవిరిగి నెత్తిన పడ్డట్లయింది. వాళ్ళిద్దరి మధ్యా ఎంతో దూరం వుంది. ఆ అమ్మాయి అతిసామాన్య. ఆమె వీధిలో వుంది. అతను పైఅంతస్థుమీద వున్నాడు.

ఆమెలో అతను తన ఆరాధ్యదేవతను చూసుకున్నాడు. ఆ అమ్మాయికికూడా కళ్లుకిందికి రాలేదు. కాళ్లు ముందుకు పోలేదు. ఆమె పైకి పోవడానికి మెట్లు వేసి వున్నయ్. అతను క్రిందికి రావడానికి తెరలు మూసి వున్నయ్.

ఆమె నిరాశతో చూసింది. అతను మేలుకొన్నాడు. వాళ్ళ కళ్ళు కదిలినయ్. వాళ్ల మనసులు కలిసినయ్. వాళ్ల కాళ్లు కదిలినయ్.

చం : అంటే, కథానాయకుడు మేడమీదినుంచి క్రిందికి దిగివచ్చాడంటావ్. అంతేనా?

సూ : అక్కర్లా!

[అంటూ వుండగా మేడ దిగి రామమోహన్ వస్తాడు. మనిషి అందగాడే! వయసు ఇరవైమూడు, ఇరవైనాలుగు వుంటయ్. మనిషి వుల్లాసంగా కనుపించినా, లోపల తీరని వ్యథతో బాధపడుతున్నవాడిలా వుంటాడు.]

చం : ఓహో! ఏం కథా సంవిధానంరా! సాక్షాత్తూ కథానాయకుడే పైనుంచి క్రిందికి దిగివచ్చాడు కదా!

సూ : మరేమనుకున్నావ్! 'రవి గాంచనిచో కవి గాంచునే కదా!' అన్నారు. మనం రవి, కవి రెండూ కాబట్టి మనం సర్వజ్ఞాన సంపన్నులం—

చం : కథానాయకుడు వచ్చాడు, బాగానేవుంది. మరి కథానాయిక—?

సూ : అరె! అంత త్వరపడతావేం? కథానాయకుడు క్రిందకువచ్చి తలుపు తీస్తేకదా, ఆమె లోపలకు వచ్చేది? అందువల్ల కొంతసేపు తాళుము కృష్ణా!

చం : నేను కృష్ణుణ్ణి కాదురా, చంద్రుణ్ణి.

సూ : పోనీ తారకోసమైనా కొంచెంసేపు ఆగు.

చం : నేను కథానాయకుణ్ణి కాదు కదరా!

సూ : ఏదో వినాయకుడివి ... ఆంధ్రదేశంలో 'విట్' వేస్తే అర్థం చేసుకునే రసజ్ఞుడు మచ్చుకైనా ఒక్కడు లేడుకదా! ఎవరికైనా దీన్లో విశేషం యిదిరా అని చెప్పినా, "ఓస్! ఇంతే! నాకిదివరకే తెలుసు న"నేవాడే కాని, సరిగ్గా ఆనందించేవాడొక్కడు లేడే!

చం : బ్రదర్! నా మాటవిని పత్రికలో ఒక ప్రకటన వేయించు. "సునిశితమైన హాస్యాన్ని ఆస్వాదించగలవారికి ఒక అమూల్యమైన అవకాశం..."

సూ : ఇంకా కొంచెంసేపు అట్లాగే వాగుతూ వుండు. ఘాటైన హాస్యమే రుచి చూస్తావు.

చం : పనిలేని మంగలి మాదిరిగా ఏదో ఒకటి చేసి, నీచేత మాటలు పడడమెందుకు? ఇహను మాట్లాడను—(రామంవైపు చూసి) మనం ఇన్ని మాటలు మాట్లాడినా కథానాయకుడుగారు యిక్కడ వుండికూడా మాట్లాడ్డేం?

సూ : మౌనవ్రతమేమో?

చం : మొహమాటమేమో?

సూ : మనం మాట్లాడలేదని కోపమేమో?

చం : కావచ్చు.

సూ : కథానాయకులకు నాటక నిర్వాహకుల హృదయపూర్వకాహ్వానంతో కూడిన కృతజ్ఞతాభివందనాలు. తమ రెందుచేతనో మౌనం వహించినట్లున్నారు?

చం : ఈ సేవకులపై కరుణ వహించి, మా తప్పులను మన్నించి, నోరు తెరువ ప్రయత్నింపరా?

రామం : తమరు ముందు నోరు మూసుకోవడానికి ప్రయత్నిస్తారా?

సూ : మరి నాటకం?

రామం : మీరు ఒక పావుగంట ఈ రంగంమీదనుంచి నిష్క్రమిస్తే, నా పని పూర్తి అవుతుంది. అప్పుడు నేనూ మీతో కలుస్తాను. ఒక నాటకం ఏమిటి? ఎన్నైనా వేద్దాం.

చం : ఇదివరకైతే కథానాయికలు ఏకాంతంగా కోపగృహంలోనో, ఎక్కడో ఒకచోట వుండేవాళ్లు. ఇప్పుడు మగవాళ్ళు ఎందుకు వుంటున్నారో?

సూ : తీరిగ్గా మేడమీద కూర్చుని భగవంతుణ్ణి అడుగుదువుగాని పద—బ్రదర్! నీ సీను

పూర్తి కాగానే కేకవెయ్. లేకపోతే అనవసరంగా రసభంగం అవుతుంది.

[వెళ్ళిపోతారు]

[రామమోహన్ చాలాసేపట్నుంచి ఎవరి కోసమో నిరీక్షిస్తున్నట్లు కనబడతాడు. చేసిన ప్రయత్నాలు విఫలం కావటంవల్ల నిట్టూర్పు విడుస్తూ, సోఫాలో కూలబడి కళ్ళు మూసుకుంటాడు. ఇంతలో విజయ కాఫీ కప్పుతో సహా వస్తుంది. ఏదో ఆలోచిస్తున్న రామం ఆమె రాకను గుర్తించడు. కాఫీ బల్లమీద పెడుతుంటే చప్పుడవుతుంది.]

రామం ఓ! విజ్జీ!

విజయ ఏమిటి ఆలోచిస్తున్నారు?

రామం నిన్ను గురించే!

విజయ ఏమని?

రామం నీకేం శిక్ష విధించాలా అని.

విజయ ఎందుకో?

రామం ఇంకా ఎదురుప్రశ్నలు కూడానా? రాత్రి నగా వస్తినని. ఇక నేను చస్తున్నానో, బ్రతుకుతున్నానో ఆలోచించే అవసరం కాని, అవకాశం కాని నీకు లేదన్నమాట.—

విజయ ముందు కాఫీ తాగండి. తరువాత విచారింతురుగాని నేరసుల్ని—

రామం నువ్వు సమాధానం చెప్పందే నేను తాగను.

విజయ చెబితే అసలు తాగరు.

రామం అంత చేదు ఏమిటో?

విజయ చెబుతానుగా.... తాగండి.

రామం సభవారు హామీ యిచ్చినమీదట తీర్మానం వుపసంహరించుకున్నాం. (కాఫీ తాగుతూ వుంటాడు)

విజయ : మీ నాన్నగారూ మిమ్మల్ని గురించే ఆలోచిస్తున్నారు.

రామం : (కాఫీ తీసుకుంటూనే) ఏమనో?

విజయ : మీరు బాగుపడేటందుకు మార్గం ఏమిటా అని?

రామం నిన్ను అడిగారా?

విజయ : ఒక్క అడగడమేనా? సలహాకూడా సెలవిచ్చారు.

రామం : మరి నువ్వు చెప్పలా?

విజయ : ఏమని?

రామం : పెళ్ళిచేస్తే తీరిపోతుందని—

విజయ : ఆమాత్రం సలహా మీరు చెప్పినతర్వాతకదా, నాకు తెలిసింది.

రామం : పోనీలే! చెప్పినతర్వాతనైనా తెలిసింది.

విజయ : తెలుసులే చెబుతున్నా తెలియకపోవడానికి చెముడేం లేదుగా!

రామం : అమ్మమ్మ! ఎంతమాట? నిన్నట్లనుటకు సాహసించిన ఆదురాత్ముడెవ్వడు?

విజయ : తమరే!

రామం : నేనా? చేలా! నీవు నన్ను పార్థము చేసుకొంటివి.

విజయ : ఈ నాటకాలే ఇంతవరకు తెచ్చినయ్.

రామం : ఎంతవరకు?

విజయ : (మెడను సూచిస్తూ) ఇంతవరకు. (క్షణం ఆగి) ఇట్లా మీరు ఇల్లు పట్టకుండా నాటకాలంట తిరగడం మీ నాన్నగారికేమీ బాగాలేదు—

రామం : మా నాన్నగారికి ఇంకా బాగులేని సంగతులు చెప్పనా? నేను ఇట్లా డబ్బు ఖర్చు పెట్టడం—

విజయ : ఇన్నీ తెలిసేనన్నమాట!

రామం : చూడు విజ్జీ! ఇవన్నీ నాన్నగారికి దురంతాలు, దుర్బుద్ధులు, కాని నాదృష్ట్యా వాటికి చాలా విలువవుంది. నిజానికి నాన్నగారు ఎన్నడూ నాటకం చూడడం నాకు తెలియదు. అట్లా చూడకుండానే ఆయన నాటకాలంటేనూ, నటకులంటేనూ ఎందుకూ పనికిరాలినవాళ్ళన్న అభిప్రాయానికి వచ్చి అనవసరమైన కోపం తెచ్చుకోవడంలో ఏమైనా అర్థం వుందా?

విజయ : సరే! నాటకాలు వేస్తున్నారు, బాగానే వుంది. కాని, ఇట్లా డబ్బుఖర్చు పెట్టడం—

రామం : అక్కడే మన అభిప్రాయాలకు పొంతన కుదరడం లేదు. నాన్నగారికి డబ్బు సంపాదించడంలో వున్న ఆనందం తెలుసు. నాకు డబ్బు ఖర్చు పెట్టడంలో ఆనందం తెలుసు.

మనిషి ఆర్జించడం మొదలుపెట్టాక చిల్లికానీ ఖర్చుపెట్టలేడు. అయినా డబ్బు వుండి కూడా ఖర్చు పెట్టనివాడు దేశానికి చేసే ద్రోహం, రాజకీయనాయకులు కూడా చెయ్యలేరన్నాడు ఓ మహాత్ముడు.

విజయ : గొప్ప వేదాంతమే! ఇవన్నీ మీ నాన్నగారి ముందు చెప్పండి.

రామం : ఏం? కొడతారా? కోసుకుతింటారా? మంచిగా, మనకెందుకులే అని వూరుకుంటే వాడు అసమర్థుడు. కాదు కావాలి అనుకుంటే ఖుషామీ.... కాని, గౌరవంకోసం చూస్తున్నాను కాని, నేను కూడా అంత పిరికివాణ్ణి కాదని తెలుసుకో — ఇవ్వాళ కాకపోతే, రేపైనా ఆ సంగతి ఋజువు చేస్తాను.

విజయ : ఇప్పుడు మాత్రం నాకు తెలియదని చెప్పానా? నలుగురూ ఏమనుకుంటారు? పరిస్థితుల్ని ధైర్యంగా ఎదుర్కొనే శక్తి లేక దానికి ఏదో పేరు పెట్టుకొని సంతృప్తి పడతారన్న మీమీద వున్న అపోహను మీరు తొలగించాలనే నే ననేది.

రామం : సరే! అందాకా యెందుకు? ఇవ్వాళో, రేపో మన సంగతి నాన్నగారికి ఎలాగూ చెప్పబోతున్నానుకదా! అప్పుడు మాడు —

విజయ : (కంగారుగా) అంత తొందరేం చెప్పండి?

రామం : తొందరా? ఇప్పటికే ఆలస్యమయిందని నేను బాధపడుతుంటే — మాడు విజ్జీ! ఈ సంగతి ఎప్పుడో ఒకప్పుడు తెలియవలసిందే కదా! అది ఎంత త్వరగా తేల్చుకుంటే అంతమంచిది. నిన్ను చూడకుండా ఒక్క క్షణంకూడా గడపగలగడం అసంభవం. అందుకే నెలరోజుల్లో వస్తానని చెప్పిన వాణ్ణి, వారం రోజులకల్లా తిరిగివచ్చాను.

విజయ : కాని పెదబాబుగారికీ విషయం మీరు స్వయంగా చెబితే బావుంటుందా?

రామం : మనం సందేహాలకు సమాధానాలు వెతుక్కుంటూ కూర్చుంటే పని జరగదు విజ్జీ... రంగంలోకి దూకుదాం. ఆ తరువాత అటునుంచి నరుక్కురమ్మన్నాడు.

విజయ : నిజమే ననుకోండి. కాని త్వరపడి మనం ఏం చేసినా మనకే ముప్పుకదా అని.

రామం : అంత ప్రమాదం జరగడానికి అవకాశాలు ఏం వున్నాయ్? చిన్నప్పటినుంచీ మాలో, మా మధ్యన పెరిగావ్.. చదువూ, సంస్కారం అన్నీ వున్నాయ్.

విజయ : అన్నీ వుండగా సరా? మీ నాన్నగారికి నచ్చవద్దా?

రామం : పెళ్ళి చేసుకునేది నేనన్న సంగతి జ్ఞాపకం వుంచుకో —

విజయ : కాని, మీరు మీ నాన్నగారి యిష్టానికి వ్యతిరేకంగా చేసుకుంటారా?

రామం : ఆయన నా యిష్టాన్ని వ్యతిరేకిస్తే, నేనూ అంతే చేయవలసి వస్తుంది, మరి. అంత ఆపద రాదనుకుంటాను.

విజయ : ఒకవేళ వస్తే? —

రామం : రానీ విజ్జీ! దీన్లో నే నెందుకు వెనక్కి పోవాలి? నాన్నగారిమీద నాకున్న గౌరవంకూడా నా ఆశయాన్ని నెరవేర్చలేకపోతే, గత్యంతరం ఒక్కటే వుంది.

విజయ : నా మాటవిని అటువంటి ఆలోచనలు మాత్రం మానండి. దానివల్ల ఎవ్వరికీ శుభం కలుగకపోగా, అనవసరమైన అపవాదులూ, అనర్థకమైన బాధలూ అనుభవించవలసి వస్తుంది.

రామం : విజ్జీ! నువ్వు చెప్పే సలహా మరీ బావుంది... ఇటువంటి సమయంలో నాకు సహాయంగా ఉండడంపోయి —

విజయ : అబ్బే! నా వుద్దేశం అదికాదు. అనవసరమైన బాధలు కొనితెచ్చుకోవడం మాత్రం దేమోనని —

[ఇంతలో సూర్య చంద్రులు వస్తారు.]

సూ : మీ సీను పూర్తికానిదే ప్రవేశించినందుకు క్షమించండి... కాని ప్రయోక్తగారి ఆజ్ఞ ప్రకారం వెంటనే కథానాయకుడు వారిని కలుసుకోవలసి వుండడంతో యిలా మీ సంభాషణకు అంతరాయం, రసభంగం కావించవలసి వచ్చింది.

# విషాదాంత

రామం : నీ నాటకాల భాష ఆపి, మనుష్యుల భాష మాట్లాడరా! నాన్నగారు ఎక్కడ?

సూ : అంతఃపురంలో! — ఆమాత్రం తెలుసుకోలేవా? పైగా ఏమన్నా అంటే నాకు నాటకరంగంతో పదేళ్లపరిచయం వుందంటావు! పరిచయం ఎందుకురా? పరిశోధనలు కావాలిగాని — (రామం వెళ్లబోతాడు)

చం : నీ సీను కాగానే మన నాటకం మొదలు పెడదామన్నావు...జ్ఞాపకం వుందా!

రామం : ఈసీను పూర్తికానిస్తేకదా!

సూ : క్షమించమని ప్రార్థించినతర్వాత ఇంకా తప్పుల్ని ఎన్నడం సభ్యతకలవాడు చెయ్యవలసినపనేనట్రా?

రామం మన సభ్యతే చెప్పుకోవాలి!

సూ పోనీలేరా బ్రదర్! చంద్రుడంతటివాడికి మచ్చ తప్పలేదు.

రామం అందుకే నిన్ను నువ్వు మరగేసి తోడుక్కో—

చం నువ్వుధరించిన కొయ్యతుపాకీ పారెయ్.

సూ అరే చంద్రం! నువ్వుకూడా నామీదకే వస్తున్నావ్. భావ్యంగావుందా?

చం లేదా?

సూ ఏమీ లేదు.

చం అయితే విరమించుకున్నాం.

సూ అన్నయ్యా! నాన్న పిలుస్తున్నాడురా.

రామం ఇంకేం? మీరంగం కానివ్వండి. (విసురుగా వెళ్లిపోతాడు)

సూ : (వెళ్లిపోబోతున్న విజయతో) విజయా! బ్రహ్మాండమయిన ఐడియా! ఇంతవరకు ఎవ్వరికీ తట్టలేదు, ఇకముందు తట్టదు... నువ్వే ఈ నాటకంలో కథానాయికవు ఎందుకు కాకూడదు?...ఏం, చంద్రం?

చం : అవును. ఎందుకు కాకూడదు?

విజయ : నేనా?

సూ : ఏం, నువ్వే! దేనికి నీభయం?

విజయ : నేనింతవరకు నలుగురితోనూ మాట్లాడి ఎరుగను.

సూ : ఏ నటుడూ, నటీకూడా వాళ్లు మొదటిసారి స్టేజీ ఎక్కకుండానే గొప్పవాళ్లు కాలేదు. అలాగే ఈ శుభసమయంలో నాందీగీతం పాడుకోనే నీ నటన ప్రపంచచరిత్రలో నీకొక విశిష్టస్థానాన్ని సంపాదించి పెట్టగలదేమో ఎవరు చెప్పగలరు?

విజయ ఎవ్వరూ చెప్పలేని మాటయితే నిజమే కాని నాకు మాత్రం ఇష్టంలేదు సూర్యం. కావాలంటే మరేదైనా సహాయం చేసిపెడతాను.

సూ సరే! ఏం చేస్తాం? నీలాటి నటి నటనను చూచి ఆనందించే భాగ్యం ప్రేక్షకులకు, పరిచయంచేసే భాగ్యం నాకూ, నీప్రక్కన నటించే భాగ్యం మా అన్నయ్యకు లేకపోయిందికదా! —

విజయ అంత మాట లెందుకులే! ఏదో అనామకురాల్ని —(నవ్వుతూ వెళ్ళిపోతుంది)

సూ ఇంతేరా మనదేశంలో ఆడవాళ్లు. దేనికీ ముందుకు రారు. అన్నింటినీ విమర్శిస్తారు. ఇదే ఏ—

చం ఆడవాళ్లమీద నీ వుపన్యాసం అంతటితో ఆపి, నాటకాన్ని కంటిన్యూ చెయ్.

సూ ఆఁ!...ఎక్కడ వున్నాం?

చం ఇకేమన్నా పురాణ శ్రవణమా?

సూ కాదులే! ఎంతవరకు నడిచిందీ అని—

చం కథానాయకుడు, కథానాయిక కలుసుకున్నారు. ఇద్దరూ సానునయ వాక్యాలు చెప్పుకున్నారు. ఒకరికోసం ఒకరు ఎంత త్యాగమైనా చేస్తామని బాసచేసుకున్నారు.

సూ ఆఁ!...అదే రంగంలో అమ్మాయిని వెతుక్కుంటూ ఆ అమ్మాయి తండ్రి వస్తాడు... తండ్రికి ఎటువంటి వేషం బావుంటుందిరా?

చం అసలా వేషం ఎవరు వేస్తారు?

సూ ఎవరు వేస్తేనేరా? కావలసింది పాత్రపోషణకు కావలసిన దుస్తులు...ఉదాహరణకు నువ్వే వేస్తావనుకో—

చం నన్ను వెయ్యమంటే, నేను ట్వీడుసూటు వేసుకువస్తాను.

సూ నీకున్న ఒక్క ట్వీడుసూటును ప్రేక్షకులు చూడరేమోనని నీ దిగులు. నీవంటివాడు నాటకం ఏం వేస్తాడురా? మన ఎమెచూర్

సంఘాలు ముఖ్యంగా ప్రాముఖ్యం ఇవ్వవల సింది పాత్రపోషణమకదా! ఆ పాత్రచేత ట్వేగు సూటు వేయిస్తావా? ఆ అమ్మాయికి ఈ అబ్బాయికి మధ్య అంతస్థులవార వుందని ఇప్పుడేకదరా చెప్పుకున్నాం. అటువంటి అమ్మాయి తండ్రికి ట్వేడుసూటు వేయించి స్టేజిమీదకు రప్పించేవాకా ఎంత వెధవై వుండాలి!

నం పెద్దవెధవై వుండాలి.

సూ : అలా మర్యాదగా ఒప్పుకో, బావుంటుంది.

చం : నీదగ్గర మర్యాద నేర్చుకోవడానికి ట్యూషన్ చెప్పించుకుంటానుకాని, ఇంతకూ ఆపాత్ర ఎలావుండాలో చెప్పు?

సూ : మనిషి పల్లెటూరివాడు. కాని వాళ్ళ మన స్తత్వానికి సంపూర్ణంగా విరోధి. జీవితంలో సాధన, సంతృప్తి రెండూ వున్నవాడు. (సోఫాలో కూలబడి, కళ్ళుమూసుకొని) ఇక వేషం!—నువ్వు చెప్పినదానికి పూర్తిగా వ్యతిరేకం — మోకాటివరకు నీరుకావి ధోవతి, ఓ బనీను, తలపాగా, కాళ్ళకు కిర్రుచెప్పులు, చేతులో కర్ర—విశాలమైన వక్షం, పరిశ్రమతో ధృడపడ్డ శరీరం, ఒత్తైన తెల్లటిమీసం, వెనుకటి బాధలను జ్ఞాపకం చేసే విషాదనూచకమైనవవ్వు—(కళ్ళు తెరిచి) ఎలావుందిరా?

[ఈ వర్ణన మొదలు పెడుతూవుండగా నే రంగయ్య వస్తాడు. పల్లెలోవున్న ప్రసాద రావుగారి ఆస్తి అజమాయిషీ అంతా అత నిదే—వయసు యాభై]

రంగయ్య: ఏం సూర్యంబాబూ! నన్ను చూసేనా ఏమిటి, వెక్కిరిస్తున్నావ్?

చం : లేదు రంగయ్యా! ఇది మా నాటకంలో ఓపాత్ర. సూర్యం! మన నాటకంలో ఆపాత్ర రంగయ్యచేత నేవేయిస్తే నాస్తవిక తకు మనం చాలాదగ్గర్లో వుంటాంకదూ?

సూ : దేనికైనా అతిపనికిరాదురా! నాటకం సాంఘికమైన సత్యాన్ని నిరూపించవల సిందే! కాని వున్నదాన్ని వున్నట్లు చూపిం చడం శోభస్కరంమాత్రంకాదు. నాటకం కావ్య గౌరవాన్ని అందుకోవాలంటే, సంఘాన్ని, సత్యాన్ని సమమైన మోతా దులోమాత్రమే స్వీకరించాలి. అద్దాన్ని ముఖానికి మరీదగ్గర వుంచుకొని చూసినదాని కన్న నియమితమైనదూరంనుంచి చూస్తే నే సరియైన ప్రతిబింబం కనిపిస్తుంది.

చం : రంగయ్యా! మంచినీళ్లు కావాలా?

రంగ : ఏం?

చం : మావాడిమాటలకు కొంచెం సొమ్మసిల్లి నట్లుగా వుంటేనూ.

సూ : అంతేబ్రదర్! నిజం చెబితే మూర్ఛపోతారు అబద్ధం చెబితే ఆనందిస్తారు ... ఆంధ్రుల తత్వమే అంత.

రంగ : నాన్నగారు వున్నారా, బాబూ?

సూ : పైన వున్నారు రంగయ్యా. పిలవమం టావా?

రంగ : ఎందుకు బాబూ? నేనే వెడతాను.

[ఇంతలో ప్రసాదరావు గారు వస్తారు.]

చం : ఆడబోయిన తీర్థ మెదురైన యట్లు—

ప్రసా : ఏం రంగయ్యా?

రంగ : నమస్కారం బాబూ!

ప్రసా : కూర్చో!

సూ : మాకు మేడమీద చిన్న బిజినెస్ వుంది— వస్తాం.

ప్రసా : ఉద్ధరిస్తావ్.

సూ : తప్పకుండాను. రా, రా బ్రదర్! (వెళ్ళి పోతారు.)

ప్రసా : కూర్చో రంగయ్యా! గోపాలం వచ్చాడా?

రంగ : వస్తున్నాడు బాబూ!

ప్రసా : వాడి విషయం మాట్లాడుదామ నేనయ్యా! నిన్ను పిలిపించింది. వాడు సీతను పెళ్ళి చేసుకోనంటున్నాడట!

రంగ : అవును బాబూ! ముందునుంచీ అనుకుంటు న్నదే! ఇప్పుడు మీ డిట్లా బిగిసి కూర్చు న్నాడు.

ప్రసా : మరి? ముందు చేసుకుంటాననడం ఎందుకు? తరువాత మాట తప్పి దాన్ని బాధపెట్టి, తను బాధపడడ మెందుకు? (గోపాలం వస్తాడు.) రా, గోపాలం! నీ విషయమే మాట్లాడుకుంటున్నాం.

గోపాలం: ఏమిటి బాబూ అది?

ప్రసా : నువ్వు సీతకు పెళ్ళిచేసుకుంటానని మాట యిచ్చావు కదూ?

గోపా ఒకప్పుడు.

ప్రసా ఎప్పుడయితే నేం? ఇచ్చావు–మరి ఇప్పుడు చేసుకోనంటున్నావ్?

గోపా : అవును.

ప్రసా : ఏం? నిన్నటికాకా పనికి వచ్చింది ఇవ్వాళ పనికి రాలేదా?

గోపా : నిజంగా అంతే బాబూ!

ప్రసా : ఇదిగో గోపాలం! నువ్వు మా పిల్లలతోటి వాడివి. నేను చెప్పేదమాట విను. కొంచెం మాకన్న వాళ్లు తక్కువ స్థితిలో వున్నారనుకో. ఆ కారణంతో ఆ అమ్మాయికి మాట యిచ్చి తప్పటం—

గోపా : ఇందులో ఆ అమ్మాయి స్థితి సంగతి ఏముంది పెదబాబూ?

ప్రసా : మరి నువ్వు అడ్డుచెప్పడానికి కారణం?

గోపా : అవన్నీ ఇప్పుడెందుకు బాబూ? ఈ పెళ్ళి జరగదు.

ప్రసా : ఏం? నువ్వు ఒప్పుకుంటే ఎందుకు జరగదు?

గోపా : అదే! నేను ఒప్పుకోవడమే జరగదు.

రంగ : మేము అడిగేదీ అదే! 'ఎందుకు' అని?

గోపా : మమతలతో కలుసుకోలేక, కలతలతో విడిపోయిన మనసులు మళ్ళీ కలుసుకోవడం మాటలు కాదు బాబూ!

ప్రసా : నిజమే! కాని ఒక్కమాట చెబుతాను విను. ఆ అమ్మాయి నీ కయిష్టతనే కలిగించిందనుకో. నీకు మనసు వుంది. ఆమెను మన్నించు. నీకు మనసు లేదనుకోవడానికి నువ్వు మనిషివి కాకుండాపోలేదుగా!

గోపా : కాని సర్వస్వాన్ని తనకే అర్పించుకున్న మనిషిని అన్నివిధాలా నిర్లక్ష్యంచేసినప్పుడు మనిషి మనిషిగా వుండడం కష్టం. నన్ను అనవసరంగా బాధపెట్టకండి బాబూ!

ప్రసా : ఇదేమీ బావుండలేదు గోపాలం. నువ్వు అడుగైనా ముందుకు కదలకుండా, నువ్వు కావాలనే వస్తువు రమ్మంటే ఎలా వస్తుంది?

గోపా : నాకు కదలడానికి శక్తి లేక కాదు బాబూ: నాకా వస్తువు అసలు అక్కరలేదంటున్నది.

ప్రసా : నీమాట నీకు తప్పకొస్త ఆలోచించవేమోయ్! ఆఖరుసారి చెబుతున్నాను...ఆ అమ్మాయిని పెళ్లిచేసుకుంటేనే నువ్వు మీ నాన్న తరువాత నా భూముల అజమాయిషీ చెయ్యగలవు... లేదా — ఆలోచించుకో.

గోపా : నేను చెయ్యలేని పనులను నా చేత చేయించాలని మీకెందు కీపట్టుదల చెప్పండి. ఈ విషయంలో ఎవరు ఎన్ని చెప్పినా నా సమాధానం ఒక్కటే—

రంగ : గోపాలం!—(వారిస్తాడు)

గోపా : అవును నాన్నా! నేనూ మనిషినే! నాకూ చీమూ, నెత్తురూ వున్నాయ్...... మానాభిమానాలు, నీతి నియమాలు మామూలు మనిషిని ఎలా మార్చగలవో, నన్నూ అంతే! — క్షమించండి పెదబాబూ! ఈవిషయంలో మాత్రం నన్ను బలవంతపెట్టకండి.

ప్రసా : సరే! ఇంకేం చేస్తాం?....విన్నావుకదయ్యా కొడుకుచెప్పిన మాటలు! ఇప్పుడు నేను మాత్రం ఏం చెయ్యగలను? గోపాలం ఒక్కడే నా మాటమీద నిలబడగల మనిషి? — నేనూ అంతే!

రంగ : బాబూ!

ప్రసా : అవునయ్యా! జరగవలసిందేదో జరుగుతుంది. అంతే!—

[ప్రసాదరావుగారు వెళ్ళిపోబోతాడు. ఇంతలో సూర్యం, చంద్రం లోపలినుంచి త్వరగా వస్తారు.]

సూ : చూడు నాన్నా! అన్నయ్య నాటకమే వద్దంటున్నాడు!

ప్రసా : ఏం నాటకాలురా? ఇహనేం పనిలేదా యేం?

చం : పనంటే యేమిటి? మనం కల్పించుకున్నదే కదా! మాకు ఇదే పని.

ప్రసా చదువ్వూ, చట్టుబండలూ ఏం అక్కర్లా?

సూ ఇది మాత్రం చదువుకాదా నాన్నా? కొన్ని వేలమంది ఆడియన్సును కదలకుండా అట్లాగే నోరు తెరిపించి వుంచగలగడం, అవసరంగా నవ్వించగలగడం, అవసరమైతే ఏడిపించడం—ఇవన్నీ యేమిటి? మా లెక్చరరుగారు వందమందికి పాఠం చెబుతుంటే సగం మంది నిద్రపోయేవాళ్లు; మిగిలిన సగం నిద్రపోతూన్న వాళ్ళ గురకవల్ల పాఠం వినబడక పోవడంవల్ల వింటున్నట్లు మాత్రమే నటించేవారు... ఇప్పుడు చెప్పు, ఏది చదువో?

ప్రసా : చచ్చిపోతున్నాం కదరా, నీ వుపన్యాసాలతో—

సూ : ఉపన్యాసాలు వినలేక తలకాయ నొప్పి వచ్చి బాధలు పడేవాళ్ళను చూశాంగాని, చచ్చిపోయినవాళ్ళను చూడలేదు...... ఇంతకూ నాటకం మాట ఏం చేశావు నాన్నా?

ప్రసా : ఎట్లాగో ఏడవండి... నాకేమీ తెలియదు.

[అని ఛర్రున వెళ్ళిపోతాడు. రంగయ్య, గోపాలంకూడా దొడ్లోకి పడతారు. సూర్యం, చంద్రం ఇద్దరూ ఒకరివంక ఒకరు చూసుకొని, ఏడుపు మొహంపెట్టి, 'ఎలాగో ఏడవడం' మొదలు పెడతారు.] — తెర

[సశేషం]

# ప్రాచీన నాట్యశాస్త్రములు

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

భరతునకన్న పూర్వము నాట్యశాస్త్రప్రవక్తలు కొందరు గలరని వినవచ్చుచున్నది. పాణిన్యాచార్యుడు "పారాశర్యశిలాలిభ్యాం భిక్షునటసూత్రయోః" (4. 3. 110) అని సూత్రించుచు శిలాలి చెప్పిన నటసూత్రములను ప్రస్తుతించినాడు. తర్వాతి సూత్రమున "కర్మందకృశాశ్వాదినిః" (4. 3. 111) అని కన్పించుటచే కృశాశ్వుడు సహితము నటసూత్రములను చెప్పియున్నాడని యెంచవలెను. దర్శనములు, ధర్మశాస్త్రములు తొలుదొల్త సూత్రములుగా చెప్పబడినట్లు నాట్యశాస్త్రముగూడ మొదట సూత్రరూపమున ప్రవచింపబడినదనవలెను. "ఛందోగౌక్థిక యాజ్ఞిక బహ్వృచనటాఞ్ఞ్యః" అను పాణిని సూత్రము (4. 3. 129) ద్వారా నాట్యశబ్దముత్పన్నమగుటచే రసభావాభినయాత్మకమగు నాట్యమునే సూత్రములలో చెప్పినారని యెంచవలెను. కాని శిలాలి, కృశాశ్వులను తర్వాతివా రెవరును ప్రస్తుతించినట్లు కన్పింపదు. పాణినిచే నుదాహరింపబడదగిన ఈ శాస్త్రకర్తలేల విస్మృతులైనారో మనకు తెలియదు. శిలాలిశబ్దము శైలూషశబ్దములో నిలచిపోయినది. కృశాశ్వశబ్దమునకీయవస్థగూడ లభించలేదు. తత్సన్నిహితములగు కుశలవ, కుశీలవశబ్దములే కన్పించుచున్నవి. శిలాలికృశాశ్వులు గాక నాట్యశాస్త్రకర్తలితరులనేకులు గలరని సాహిత్యసంప్రదాయము చెప్పుచున్నది. అర్వాచీనులగు ఆలంకారికులు, సౌందర్యమీమాంసకులు అనేకవిషయములపై ఇతరుల అభిప్రాయముల నుదహరించుట గలదు:

"తస్మాన్నాట్యరసా అష్టా
వితి పద్మభువో మతమ్.
ఉత్పత్తిస్తు రసానాం యా
పురా వాసుకినోదితా
నారదస్యోచ్యతే సైషా
ప్రకారాంతర కల్పితా." (పే. 47)

అని శారదాతనయుడనినాడు. పద్మభువు డనగా బ్రహ్మ. బ్రహ్మ ఎనిమిది రసములనే ప్రస్తుతించినాడట. ఇది బ్రహ్మకృతమగు నాట్యశాస్త్రములోనిభావమై యుండవచ్చును. వాసుకి తర్వాత గలడు.

"ఇతి వాసుకినాప్యుక్తో
భావేభ్యో రససంభవః
తస్మాద్రసాస్తు భావేభ్యో
నిష్పద్యంతే యథార్థతః." (ʼ 37)

అని శారదాతనయుడే చెప్పుచున్నాడు. భావములనుండి రసములు నిష్పన్నములగుచున్నవని రసోత్పత్తిని ప్రవచించినవాడు వాసుకియట! నారదుడు వేరొకమార్గము నవలంబించినాడని తన్మతపరమగు రస నిర్వచనము నాపై గావించినాడు.

బ్రహ్మ, వాసుకి, నారదుడు అను నాట్యశాస్త్ర ప్రవక్తలు గలరని ఇంతవరకు చెప్పగల్గుచున్నాము. వీరుగాక ఇతరులుగూడా కలరని శారదాతనయుడు తన భావప్రకాశములో చెప్పుట గలదు.

"ఏవ ముత్సృష్టికాంకస్తు
కర్తవ్యః కావ్యవేదిభిః
అస్యాంక మేకం భరతో
ద్వావంకా వితి కోహలః
వ్యాసాంజనేయ గురవః
ప్రాహు రజ్కత్రయం యదా
విష్కంభకోఽత్ర సంకీర్ణః
తత్ర ప్రవేశకః
ముఖనిర్వహణే సంధీ
ఇతి కోహలభాషితమ్."

అని అష్టమాధికారమున శారదాతనయుడు ఉత్సృష్టికాంకమున అంకనియమమునుగూర్చిన మతభేదములను, సంధివిషయమున కోహలమతమును చెప్పినాడు. వ్యాసుని మతము, ఆంజనేయుని మతము లభించుటచే వీరిద్దరును నాట్యశాస్త్రమును చెప్పినవారే యని ఎంచవలసివచ్చుచున్నది. రసముల ప్రాధాన్యాప్రాధాన్యములను వ్యాసమతానుసారము చెప్పదలచి:

"వ్యాసప్రోక్తేన మార్గేణ
కథయామి యథార్థతః" (పే 55)

అని శారదాతనయుడు పలికినాడు. నందికేశ్వరుడు బ్రహ్మకు నాట్యమును నేర్పినాడని వ్యాసవచనము గలదట. కాగా బ్రహ్మ, వాసుకి, నారదుడు, వ్యాసుడు, ఆంజనేయుడు, నందికేశ్వరుడు అను ఆర్గురు నాట్యప్రవర్తకులు గలరని తెలియవచ్చుచున్నది. వీరందరు సదాశివుని నాట్యమును భావించి, తత్స్వరూప స్వభావములను మర్త్యలోకమునకు గొనివచ్చిరని సంప్రదాయము.

సదాశివుడు నాట్యమూర్తి. నటరాజ శబ్దమున దక్షిణదేశమున ప్రసిద్ధిజెందినాడు. శివనాట్యమున పాణిన్యాచార్యుని మాహేశ్వరసూత్రము లుత్పన్నములైనవి ఇట్టి సదాశివుడు నాట్యశాస్త్ర కర్తలలో మొట్టమొదటివాడు.

"ప్రోక్తః సదాశివే నాస్య స్వరూపాశ్రయనిర్ణయః
'రసః స ఏవ స్వాద్యత్వా
ద్రసికస్యైవ వర్తనాత్
నానుకార్యస్య వృత్తత్వా
త్కావ్యస్యాతత్పరత్వతః
ద్రష్టుః ప్రమోద ప్రీడేర్ష్యా
రాగ ద్వేష ప్రసంగతః
లౌకికస్య స్వరమణే
సంయుక్తస్యైవ దర్శనాత్'
రత్యాదిరేవ స్థాయ్యాఖ్యః
తత్తదాలంబనాశ్రయః
స్వవిభావాది సంసృష్ట
రూపస్త్రైవ రసోభవేత్." (పే 152)

అని శారదాతనయుడనినాడు. కావ్యము రసాత్మకమని, రసమాస్వాద్యత్వ లక్షణలక్షితమని, రసము రసికుడగు సామాజిక నిష్ఠమని సదాశివుడు ప్రపంచించినాడు. ఈ సదాశివుడు లాస్యతాండవ సమ్మిళితమగు నాట్యమును వివరించినాడు. శివుడు తాండవమును, పార్వతి లాస్యమును నిర్వచించెనని సంప్రదాయము. ప్రాచీన నాట్యశాస్త్రకర్తలను వివరించుచు

"శ్రీతస్సోఽపి సదాశివస్య శివయో
ర్గౌర్యామతం వాసుకే
ర్వాగ్దేవ్యా అపి నారదస్య చ మునేః
కుంభోద్భవవ్యాసయోః
శిష్యాణాం భరతస్య యానిచ మతా
న్యధ్యాప్యతా న్యంజనా
సూనో రప్యథ నాట్యవేద మఖిలం
సమ్యక్త మధ్యాపయత్." (పే. 2)

అని శారదాతనయుడు పలికినాడు. సదాశివుడు శివుడు, గౌరి, వాసుకి, సరస్వతి, నారదుడు, కుంభోద్భవుడు, వ్యాసుడు, భరతుడు, భరత శిష్యులు, ఆంజనేయుడు అనువారు నాట్యశాస్త్ర ప్రవర్తకులని వీరి గ్రంథముల నవలోకించి తాను భావప్రకాశమును రచించుచుంటినని ఇచట పలుకుచున్నాడు. వీరందరలో మొట్టమొదట కన్పించు సదాశివుడు సంగీతప్రవర్తకులలో నొకడని శార్ఙ్గదేవుడనుచున్నాడు.

"సదాశివః శివా బ్రహ్మ
భరతః కశ్యపో మునిః
మతంగో యాష్టికో దుర్గా
శక్తిః శార్దూల కోహలౌ
విశాఖిలో దంతిలశ్చ
కంబలోఽశ్వతర స్తథా
వాయు ర్విశ్వావసూ రంభా
ర్జున నారద తుంబురాః
ఆంజనేయో మాతృగుప్తో
రావణో నందికేశ్వరః
స్వాతి ర్గణో బిందురాజః
క్షేత్రరాజశ్చ రాహులః
రుద్రటో నాన్యభూపాలో
భోజభూవల్లభ స్తథా
పరమర్దీ చ సోమేశో
జగదేక మహీపతిః
వ్యాఖ్యాతారో భారతీయే
లోల్లటోద్భట శంకుకాః
భట్టాభినవగుప్తశ్చ
శ్రీమత్కీర్తిధరోఽపరః" (1. 15)

ఇచట ఇంకను విశేషనామములు కన్పించుచున్నవి. పైగా

"కథితా యోగమాలాయాం
సంహితాయాం వివస్వతే
శివేన తాండవం లాస్యం
నాట్యం నృత్తంచ నర్తనమ్

సర్వమేత దశేషేణ
సంహితాయాం ప్రదర్శితమ్" (పే 45)

అని శారదా తనయుడును శివుని చే వివస్వంతునకు లాస్యతాండవ సహితముగు నాట్యము, నృత్తము, నర్తనము అనునవి చెప్పబడినవని, ఏతద్విషయమును యోగమాలా సంహితలో గాననగునని యనినాడు.

సదాశివ భరత మొకటి యుండెడినని నిర్ణయించితిమి. బ్రహ్మ భరతముకూడ గలదంటిమి. ఈనాట్యమును మానవుల కందజేసినవాడు నందికేశ్వరుడు. నందికేశ్వరుడెట్లు అందజేసినాడను విషయమును పలువురు పలుతెరగుల వివరించినారు.

"దివ్యం చరిత్ర మైశం మే
కథ మధ్యక్షతా మిహాత్
ఇతి చింతాపరే తస్మి
న్నభ్యగా న్నందికేశ్వరః
స నాట్య వేద మధ్యాప్య
సప్రయోగం చతుర్ముఖమ్
ఉవాచ వాక్యం బ్రహ్మాణ
నందీ తచ్చింతితార్థవిత్" (పే. 56)

అని శారదాతనయుడు జెప్పుకథ. మహేశ్వరుడు బ్రహ్మవిష్ణువులను, వైష్ణవీ సర్వమంగళాయను శక్తులను సృష్టించెను. అప్పుడు బ్రహ్మ లోకములను సృష్టించి మహేశ్వరుని పురావృత్తమును స్మరించెను. ఈ వృత్తాంతమును, తన పరిస్థితులను చింతించుచుండగా నందికేశ్వరుడు కన్పడి బ్రహ్మకు ప్రయోగపూర్వకముగా నాట్యవేదమును జెప్పినాడట.

"విజ్ఞాయ శంభు స్తత్త్వేం
నందికేశ్వర మభ్యధాత్
మత్సకాశా దధీతం త్వం
నాట్య వేద మశేషతః
అధ్యాప యైనం బ్రహ్మాణం
సప్రయోగం సవిస్తరమ్.
స తథేత్యబ్జజన్మాన
మధ్యాపయ దశేషతః
అధ్యా ప్యావోచ దేతస్య
వేదస్యైవ ప్రయోగతః
జగతాం పాలనాయాస
విశ్రాంతిసుఖ మాప్నుహి

ఇత్థం సనంది నాజ్ఞప్తః
సమాగమ్య స్వమందిరమ్
నాట్య వేదప్రయోక్తారం
భారతీసహితోఽస్మరత్
స్మృతమాత్రే మునిః కశ్చి
చ్ఛిష్యైః పంచభి రన్వితః
పురోఽవతస్థే భారత్యా
సహిత స్త్వాబ్జజన్మనః
తా నబ్రవీ న్నాట్య వేదం
భరతేతి పితామహః,
తేఽధీత్య నాట్యవేదం త
త్ప్రయోగాంశ్చ పృథగ్విధాన్
పురావృత్తాని దేవానాం
ప్రబంధే ష్వాపదిశ్యతే.
రసై ర్భావై రభినయైః
ప్రయోగైశ్చ పృథగ్విధైః
నాట్యవేదోదితైః సమ్య
త్ప్రద్మయోని ముహూతుషన్.
తుష్ట స్తే భ్యో వరం ప్రాదా
దభీష్టం పద్మయోనిః
నాట్య వేద మిమం యస్మా
ద్భరతేతి మయేరితమ్.
తస్మా ద్భరత నామానో
భవిష్యథ జగ త్త్రయే
నాట్య వేదోఽపి భవతాం
నామ్నా ఖ్యాతిం గమిష్యతి.
ఇత్యాదిశ్య తతో బ్రహ్మ
తై రేవ భరతైః సహ
వినోదయతి లోకానాం
రక్షావ్యసనజం శ్రమమ్" (పే. 2856)

అని భావప్రకాశములో చివరభాగమున విపులముగా నీవృత్తాంతమును వివరించినాడు. ప్రజాపాలన ఖేదమునబడి విశ్రాంతిని అనుభవించజాలని మనువు, వివస్వంతునితో మొరబెట్టుకొనెను. వివస్వంతుడు బ్రహ్మవద్దకు బోయెను. బ్రహ్మ మహావిష్ణువు నర్థించెను. కాని శివునివద్దకు పొమ్మని మహావిష్ణువు బ్రహ్మ నాజ్ఞాపించెను. తన ఖేదమును మహేశ్వరునకు బ్రహ్మ విన్నవించుకొనెను. అప్పుడు మహేశ్వరుడు నందికేశ్వరుని బిలచి "నీవు నావద్ద నిశ్శేషముగా నేర్చు

కొనిన నాట్యశాస్త్రమును ప్రయోగసహితముగా బ్రహ్మకు నేర్పుము" అని ఆదేశించినాడు. ఆపై నందికేశ్వరుడు నాట్యవేదమును సమగ్రముగా బ్రహ్మకు నేర్పి "దీనితో పాలనాయాసవిశ్రాంతిసుఖమును పొందుము" అని పల్కినాడు. నందిశ్వరునిచే నిట్లు ఆజ్ఞాపింపబడినవాడై స్వగృహమున కేతెంచి, భారతీసహితుడై బ్రహ్మ నాట్యవేదప్రయోక్తను స్మరించెను. స్మరించినదే తడవుగా ఐదుగురుశిష్యులతో గూడిన ఒకానొకముని భారతీసహితుడగు బ్రహ్మ యెదుట నిలబడెను. "నాట్యవేదమును మీరు భరింపుడు" అని వీరలను బ్రహ్మ ఆదేశించగా వీరు నాట్యవేదమును ప్రయోగసహితముగా చక్కగా నేర్చుకొనిరి. రసభావాభినయములతో, వివిధప్రయోగములతో బ్రహ్మను సంతోషపరచగా, వీరు భరతులను అన్వర్థనామమును బ్రహ్మ ప్రసాదించెను.

నాట్యశాస్త్రమున నాల్గవ అధ్యాయమున కరణాంగహారములు మహేశ్వరప్రోక్తములని, వీటిని భరతునకు నేర్పినవాడు తండు వనబడు నందికేశ్వరుడని గలదు. తండు ప్రోక్తమగుటచే కరణాంగహారసమ్మిశ్రితమగు మహేశ్వరుని నాట్యము తాండవమనబడినది. ఏది యెట్లున్నను నందికేశ్వరుడుగూడ నాట్యశాస్త్రమును చెప్పినాడని యెంచక తప్పదు. మనకు ప్రస్తుతము లభించు అభినయదర్పణము ప్రాచీన నందికేశ్వర విరచిత గ్రంథములోని యొకభాగమవలెను. రెండవభాగము భరతనాట్యశాస్త్రములోని నాల్గవ అధ్యాయమున గలదు. శేషించిన భాగములు మనకు సమగ్రముగా లభించుటలేదు.

నందికేశ్వరుడు భరతునికన్న ప్రాచీనుడు. సంగీతము, నృత్యము, అభినయము అనునవి నందికేశ్వరునిచే చక్కగా విస్తృతముగా వివరింపబడినట్లు కన్పట్టును. కేవలము నాట్యమునకు మాత్రముపకరించు విషయముల నే నందీశ్వరునినుండి భరతుడు గ్రహించియుండవచ్చును. నందికేశ్వరుని అభినయము పూర్తిగా అలౌకికమని చెప్పవీలున్నది. భరతుని అభినయము లోకసిద్ధము. కోహల, మతంగులు భరతుని అనుసరించినారు. "శేష ముత్తర తంత్రేణ కోహలఃకథయిష్యతి" అని చివరి అధ్యాయమున కన్పించుటచే భరతశాస్త్రపూరణమును గావించినవాడు కోహలుడని తెలియుచున్నది.

తొమ్మిదవ అధ్యాయమున వర్తనలను కొన్నిటిని భరతుడు ప్రస్తావించినాడు. ఇంగు చాలకములనబడునవి అతి ప్రధానములు. వీటిని ప్రపంచించినవాడు కోహలుడని

"నృత్తే ప్రాధాన్య మేతేషాం
కోహలో మునిరబ్రవీత్
నృత్తం నశోభతే క్వాపి
చాలకైస్తు వినా కృతమ్."

అను వేమభూప వాక్యమువలన తెలియుచున్నది. ప్రయోజనవశమును ననుసరించి అన్యస్థానములను యోజించవలెనని ఇరువదియొదవ అధ్యాయమున భరతుడు చెప్పుటచే మతంగుడు మధుపముల నావిష్కరించియున్నాడు. నాట్యమున సహితము దేశీస్థానము లత్యవసరము లగుటచే

"అంగభావేన నాట్యేఽపి
దేశీస్థానాని యోజయేత్
యతో 'లోకానుసారేణ
నాట్య'మిత్యభిధీయతే
జ్ఞేయా దేశ్యపి శాస్త్రీయ
విహితాశయ వేదిభిః
యతో కోహల ముతంగాద్యైః
ర్లక్షితా చ ప్రయోజితా."

అని వేమభూపుడనినాడు. దేశీస్థానముల లక్షణ ప్రయోగములను మతంగ, కోహలులు ప్రపంచించియున్నారు. ఇట్లు "అన్యాని", "అథాపిచ", "చ" మొదలగు పదములను భరతునిలో గ్రహించి, తర్వాతి నాట్యశాస్త్రజ్ఞులు శేషించిన ప్రక్రియలకు గతులను కల్పించిరి. "ఆయతం చావహిత్థంచ అశ్వక్రాంత మథాపిచ" అను పంక్తిలో "అథాపిచ" అని కన్పించుటచే గతాగత, వలిత, మోటిత, వినివర్తిత, ప్రోన్నతములుగూడ గ్రహింపబడినవి. ఎనిమిదవ అధ్యాయమున

"ఏభ్యోఽన్యే బహవో భేదా
లోకాభినయ శ్రయాః
తేచ లోకస్వభావేన
ప్రయోక్తవ్యాః ప్రయోక్తృభిః"

అని చెప్పుటచే సమము, నైరాజితము, ఉన్నతము, తిర్యఙ్నతోన్నతము, స్కంధానతము, ఆరాత్రికము, పార్శ్వాభిముఖము, ఉద్ధుతము, సకంపపరివాహితము,

సకంపభుతము, పార్శ్వకంపితము అను పదకొండు గూడ తర్వాతివారిచే చెప్పబడినవి.

భరతునిచే చెప్పబడిన నాట్యశాస్త్రము మనకు ప్రస్తుతము దాదాపు సమగ్రముగా లభించుచున్నది. ఈ గ్రంథమునే భరతుడు చెప్పినాడని యనగలమా? అభినవగుప్తుడు "షట్త్రింశకం భరతసూత్రమిదం" అని నాట్యశాస్త్రమును ప్రస్తుతించి యున్నాడు. "కలానామాని సూత్రకృదుక్తాని యథా" అని భరత భాష్యమున నాన్యదేవుడనినాడు. షట్సాహస్రీరూప మున నాట్యశాస్త్రము గలదను ప్రతీతియున్నది. "సూత్రణం సకలాంకానాం జ్ఞేయ మంకముఖం బుధైః ఇతి షట్సాహస్రీకారః" అని దశరూప వ్యాఖ్యానావసరమున బహురూపమిశ్రుడనినాడు. భరతముని ప్రణీతమైన నాట్యశాస్త్రము ఆరువేలసూత్రములతో నిండి యుండెడిదని భావము. కాని "సమాప్యతే హి నాట్యజ్ఞై రంకావతర ఇష్యతే" ఇతి ద్వాదశ సహస్రీకారః" అని బహురూపమిశ్రుని వాక్యమొకటిగలదు. ఇట్లే

"నాట్యవేదా చ్ఛ భరతాః
సార ముద్ధృత్య సర్వతః
సంగ్రహం సుప్రయోగార్థం
మనునా ప్రార్థితో వ్యధుః.
ఏకం ద్వాదశ సాహస్రైః
శ్లోకై రేకం తదర్ధతః
షడ్భిః శ్లోకసహస్రై ర్యో
నాట్యవేదస్య సంగ్రహః"

అని శారదాతనయుడు గూడ వచించినాడు. పూర్వ మీశాస్త్రము పన్నెండువేల శ్లోకములతో నుండెడిదని, తర్వాత ఆరువేల శ్లోకములలోనికి సంక్షిప్తముగావించబడినదని భావము. ఇంతకుపూర్వ మొకనాట్యవేద ముండెడి దని యామలాష్టకతంత్రము చెప్పుచున్నది—

"గాంధర్వవేదః షట్త్రింశ
త్సహస్ర గ్రంథసంమితః
యత్ర సప్తస్వరోత్పత్తి
కథనం పరికీర్త్యతే
వీణాతంత్రం కలాతంత్రం
రాగతంత్ర మనుత్తమమ్
మిశ్రతంత్రం తాలతంత్రం
గీతికాతంత్ర మేవ చ
లాసికోల్లాసికాతంత్రం
మేలతంత్రం మహత్తరమ్
జాతిగ్రహలయస్థానం
మార్గాంగప్రక్రియాక్రియా
కాలజ్ఞానం వాద్యవల్లీ
త్రిభిన్నాధ్యాయ ఏవ చ
తురంగరతిసారంగ
సింహలీలా విజృంభణమ్
అంగహారప్రవిక్షేపా
ధ్యాయః సంక్షోభణక్రియా
ఏవమాదీని గాంధర్వ
వేదే సంతి సహస్రశః"

ఇత్యాది యామలాష్టకతంత్రవాక్యముల ననుసరించి ముప్పదియారు వేల శ్లోకములతో నొక గాంధర్వ వేద ముండెడిదని చెప్పవలెను. ముప్పదియారు వేలు, పన్నెండువేలు, ఆరువేలు అను మూడు రూపములతో నాట్యశాస్త్రము వచ్చినదని సంప్రదాయవేత్త లనినారు. సదాశివుడు, బ్రహ్మ, భరతుడు అను ముగ్గురు నాట్యశాస్త్రకర్తలు గలరని, ఈ మతత్రయ సారమును వివేచించి బ్రహ్మమతప్రతిపాదనార్థము భరతునిచే ఈ గ్రంథము నిర్మింపబడినదని అభినవగుప్తు డనినాడు. అభిజ్ఞాన శాకుంతల వ్యాఖ్యలో నక్కడక్కడ ఆదిభరతమునుండి రాఘవభట్టు కొన్ని శ్లోకముల నిచ్చియున్నాడు. శివ పార్వతుల సంవాదరూపమునన్న ఆదిభరతము సదాశివభరతము కావచ్చును.

# ఆదిభరతము

అభిజ్ఞాన శాకుంతల వ్యాఖ్యాతయగు రాఘవభట్టు భరతుని నాట్యశాస్త్రమునుండియే గాక, ఆదిభరతమునుండి గూడ ఆయా ప్రదేశములలో కొన్ని పంక్తుల నుదహరించియున్నాడు.

"అత్ర నాందీలక్షణ మాది భరతే—
'ఆశీర్నమస్క్రియారూపః శ్లోకః కావ్యార్థ సూచకః నాందీతి కథ్యతే' ఇతి." (పే. 5)

అని యొకచోట గలదు. ఈ నాందిలక్షణము మన భరతనాట్యశాస్త్రమున గూడ గలదు. కాని ఇంత

క్షప్తము గా, ఇంత సూత్రప్రాయము గా మన నాట్య శాస్త్రములో లేదు.

"అతఏవాదిభరతే—

'త్ర్యశ్రం వా చతురశ్రం వా
చిత్రం శుద్ధ మథాపివా
ప్రయుజ్య రంగా న్నిష్క్రామే
త్సూత్రధారః సహానుగః
స్థాపకః ప్రవిశే త్తత్ర
సూత్రధార గుణాకృతిః'—ఇతి." (పే. 6)

అని పూర్వరంగవిధానమున నాలుగు విధముల పూర్వ రంగములను ప్రస్తుతించిన వాక్యము ను రాఘవభట్టు ఇచ్చియున్నాడు. ఇంకొక చోట

"తత్ర సభ్యస్వరూప మాదిభరతే—

'సభ్యాస్తు విబుధైర్జ్ఞేయా
యే దివ్యజ్ఞానాన్వితా జనాః
మధ్యస్థాః సావధానాశ్చ
వాగ్మినో న్యాయవేదినః
శ్రుతితాశ్రుతితాభిజ్ఞా
వినయా నమ్రకంధరాః
అగర్వా రస భావజ్ఞా
స్తౌర్య త్రితయ కోవిదాః
అసద్వాద నిషేద్ధార
శ్చతురా మత్సరచ్ఛిదః
అమంద రసనిష్యంద
హృదయా భూషణోజ్జ్వలాః
సువేషా భోగినో నానా
భాషా వీరవిశారదాః
స్వస్వోచితస్థానసుస్థా
స్తత్ప్రశంసాపరాయణాః'—ఇతి." (పే. 9)

అని సభ్యస్వరూప మీయబడినది. దివ్యజ్ఞానాన్వితులు, మధ్యస్థులు, సావధానులు, వక్తలు, న్యాయవేత్తలు, శ్రుతితాశ్రుతితాభిజ్ఞులు, వినయవిధేయతలు గలవారు, గర్వరహితులు, రసభావజ్ఞులు, సత్యవాక్కులు, మాత్సర్యాది రహితులు, చతురులు, రసికులు, నానా భాషాభిజ్ఞులు అగువారు సభికులని తాత్పర్యము.

"తదుక్త మాది భరతే—

'వక్ష్యేథం గాది సంభిన్నం
నాట్యగాన మతఃపరమ్
మధ్యమో త్తమ పాత్రాణాం
నాటకే సిద్ధిదాయకమ్'

ఇత్యాదినా ద్వాదశభంగాః షడుపభంగా ద్విచత్వారింశ ల్లయభేదా శ్చోక్తాః. తత్ర ద్విపదీనామ ప్రథమో లయభేదః. తల్లక్షణం తత్రైవ—

'విలంబితలయా యత్ర
గురవో ద్విపదీ తు సా
శృంగారే కరుణే హాస్యే
యోజ్యా చోత్తమ మధ్యమైః
అవస్థాంతర మాసాద్య
గాతవ్యా సానమై రపి' ఇతి." (పే. 12)

అని ఇంకొకచో గలదు. ద్వాదశ భంగములు, ఆరు ఉపభంగములు, నలుబదిరెండు లయభేదములు ఆదిభరతమున వివరించబడినవి. ద్విపదీ యనునది లయభేదము లలో మొదటిది. దీని లక్షణముగూడ ఇచట చెప్పబడినది.

"ఆరంభ బీజయో ర్లక్షణే ఆదిభరతే—

'ఔత్సుక్యమాత్ర బంధస్తు
యో బీజస్య నిబధ్యతే
మహతః ఫలయోగస్య
స ఖ ల్వారంభ ఇష్యతే' ఇతి" (పే. 15)

అని ఆరంభ బీజముల లక్షణము ఆదిభరతమున జెప్పబడినది. ఈ నిర్వచనములు నేటి భరతుని లక్షణములకు భిన్నములు గావు.

"ఉక్తం చాదిభరతే—

'ధీరోద్ధతే ధీరలలితే
ధీరోదాత్తే తథైవ చ
ధీరప్రశాంతే చ తథా
పాఠ్యం యోజ్యం చ సంస్కృతమ్.' ఇతి"
(పే. 15)

అని ఉత్తమనాయకులకు పాఠ్యవిధిని ఆదిభరతమే విధించిన దని గలదు. చతుర్విధనాయకులు సంస్కృతము నే వ్యవహరించవలె నని ఇచట గల భావము.

"తల్లక్షణ మాదిభరతే—

'కావ్య స్యార్థ సముత్పత్తి
రుపక్షేప ఇతి స్మృతః' ఇతి." (పే. 23)

అను నవుకు ఉపక్షేప మను సంధ్యంగము ఆదిభరతమున నిర్వచింపబడిన దని తెలియవచ్చుచున్నది.

"తల్లక్షణ మాదిభరతే—
'సహాసై వార్థసంపత్తి
ర్నాయక స్యోపకారికా
పతాకాస్థానకం సంధా
ప్రథమే తన్మతమ్' ఇతి" (పే. 40)

అని పతాకాస్థానక మాది భరతమున నిర్వచింపబడినది.

"ఆది భరతే చ—
'అంక ఇతి రూఢిశబ్దో భావైశ్చ రసైశ్చ రోహయ త్యర్థాన్
నానావిధానయుక్తో యస్మాత్తస్మాద్భవే దంకః
యత్రార్థస్య సమాప్తిర్యత్ర చబీజస్య భవతి సంహారః
కించి దవలగ్న బిందుః సోఽంక ఇతి సదా వగంతవ్యః
యే నాయకా నిగదితా స్తేషాం
ప్రత్యక్ష చరితసంయుక్తః । నానావస్థాంతరితః
కార్య స్త్వంకో యథార్థరసః' ఇతి" (పే. 54)

అని ఆదిభరతమున అంకలక్షణము నిర్వచింపబడినది

"బిందుప్రయత్న యో ర్లక్షణే యథాదిభరతే—
'ప్రయోజనానాం విచ్ఛేదే
య దవిచ్ఛేదకారణమ్
యావ త్సమాప్తిం బంధస్య
స బిందు రితిసంజ్ఞితః' ఇతి" (పే. 69)

అని బిందుప్రయత్నములలక్షణములు చెప్పబడినవి.

"మదిరాదృష్టి లక్షణ మాదిభరతే—
'ఆఘూర్ణమాన మధ్యా యా
క్షామా చాఞ్చితతారకా
దృష్టి ర్వికసితాపాఙ్గా
మదిరా తరుణే మదే' ఇతి" (పే. 105)

అని దృష్టిభేదములలోని దగు మదిరాదృష్టి వివరించబడినది.

"తల్లక్షణ మాదిభరతే—
'ఉపపత్తికృతో యోఽర్థ
ఉపన్యాసస్తు సస్మృతః' ఇతి" (పే. 108)

అని ఉపన్యాస మను అంగము వచించబడినది.

"తత్రాది భరతే—
'కవిభిః కావ్యకుశలైః
రసభావ మపేక్ష్య తు
సర్వాంగాని కదాచిత్తు
ద్విత్రి హీనాని వా పునః
ప్రయోక్తవ్యానీ కార్యాణి' ఇతి" (పే. 114)

అని మరియొకచోట నాచెప్ప నేటి భరతశాస్త్రము లోని సంస్కృతే గలవు.

"తల్లక్షణ మాది భరతే-
'ఉత్పత్తి ర్యస్య బీజస్య
ప్రాప్తి రప్రాప్తి రేవ చ
పున శ్చాన్వేషణం యత్ర
సగర్భః పరికీర్తితః' ఇతి" (పే. 115)

అని గర్భసంధిలక్షణము గలదు.

"నియతాప్తిలక్షణ మాదిభరతే—
'నియతాం తు ఫలప్రాప్తిం
యదా భావేన పశ్యతి
నియతాం తు ఫలప్రాప్తిం
సగుణః పరిచక్షతే' ఇతి" (పే. 168)

అని నియతాప్తి నిర్వచింపబడినది. ఇట్లు కేవలము రూపకవిషయమే గాక అభినయవిషయము సహితము ఆదిభరతమున గలదనుటకు పైన మదిరాదృష్టిలక్షణము నిచ్చితిని. ఇక:

"ఏత దుక్త మాదిభరతే చిత్రాభినయాధ్యాయే—
'శిరోగతం పతాకశ్చ
వక్షస్థో విస్మయే భవేత్'—ఇతి" (పే. 248)

అని విస్మయాభినయమున ఉగ్రోనిహిత హస్తము లుండవలె నని చిత్రాభినయాధ్యాయమున ఆదిభరతములో గలదు.

"ఆదిభరతే నాపి—
'నిర్వహణే కర్తవ్యో నిత్యం హి
రసోఽద్భుతః కవిభిః' ఇతి" (పే. 248)

ఇది సామాన్యముగా భరతునిదే యని అందరకు తెలిసిన విషయమే.

"తల్లక్షణ మాదిభరతే—
'దేవ ద్విజ నృపాదీనాం
ప్రశస్తిః స్యా త్ప్రశంసనమ్' ఇతి" (పే. 264)

అని ప్రశంసన మను అంగము వివరించబడినది.

"తదుక్త మాదిభరతే—
'పరివ్రాణ్మునిశాక్యేషు
తాపస శ్రోత్రియేషు చ
ద్విజా యే చైవ లింగస్థాః
సంస్కృతం తేషు యోజయేత్' ఇతి" (పే. 21)

అనుచో పాశ్యవిధి కన్పించుచున్నది. ఈ యుదాహరణ లన్నియు రాఘవభట్టుచే నుదహరింపబడినవే. ఇతరగ్రంథములలో పెక్కు లీ రీతిగా లభించగలవు. ఆదిభరతములో నేటి భరతనాట్యశాస్త్రములోని విషయము లన్నియు ఇంకను విపులముగా, విశదముగా చర్చించబడినవి. అనగా నేడు మనకు లభించు నాట్యశాస్త్రము ఆదిభరతమునొక్క సంక్షిప్తరూప మని చెప్ప వీలగుచున్నది.

సదాశివ భరతము, ఆదిభరతము అనునవే గాక వృద్ధ భరతమని యొకటి ఉన్నట్లు మనకు తెలియవచ్చుచున్నది. ఈ వృద్ధభరతమే ఆదిభరతమై యుండవచ్చునని చెప్ప వీలున్నది. ఈ ఆదిభరతమే సదాశివభరతము కానోపును.

"ఏవం హి నాట్యవేదేఽస్మిన్
భరతే నోచ్యతే రసః
తథా భరతవృద్ధేన
కథితం గద్య మీదృశమ్—
'యథా నానాప్రకారై ర్వ్యంజనౌషధైః పాక
విశేషై శ్చ। సంస్కృతాని వ్యంజనాని మధురాది
రసానా మన్యతమే నాత్మనా పరిణమంతి తద్భో
క్తౄణాం మనోభి స్తాదృశాత్మతయా స్వాద్యంతేః
తథా నానాప్రకారై ర్విభావాదిభావై రభినయై,
సహ యథార్హ్య మభివర్ధితాః స్థాయినో భావాః
సామాజికానాం మనసి రసాత్మనా పరిణమంత
స్తేషాం తాదాత్మిక మనోవృత్తి భేదభిన్నా స్తత్త
ద్రూపేణ తై రస్యంతే' ఇతి."

అని శారదా తనయుడు వృద్ధభరతమునుండి ఉదహరించిన గద్యభాగము దాదాపు ఇదేరూపముతో ఈ నాట్యశాస్త్రమున ఆరవ అధ్యాయమున కన్పించుచున్నది.

ఈ నాట్యశాస్త్రములో కావ్యములకు, రూపకములకు, అభినయములకు లక్షణములు ప్రపంచింపబడుటచే నివి పెద్ద గ్రంథములైనవి. తర్వాతి సాహితీసమీక్షకులు దృశ్య శ్రవ్య విభాగమును పూర్తిగా నవలంబించి అభినయాదివిషయములకు ప్రాధాన్యము నొసగలేదు. ఆచార్యదండి కూడా:

"దృశ్యాని నాటకాదీని
తేషా మన్యత్ర విస్తరః" (1. 33)

"యత్తు సంగ్యాంగ నృత్త్యాంగ
లక్షణా ద్యాగమాంతరే" (2. 367)

అని పల్కుచు రూపకవిధానమును శాస్త్రాంతరముగా భావించినాడు. ఆ తర్వాత వచ్చిన విమర్శకులు రూపకలక్షణములనుకూడ గ్రహించి అభినయ ప్రకరణములను పరిత్యజించినారు. నృత్య, గీత, వాదిత్రములతో సంబంధముకలిగి వైదికయుగమునుండి నాట్యము ప్రవృత్తమగుటచే నివి యన్నియు నొకే శాస్త్రమున నిర్వచింపబడుట సహజము. ఇట్టి లక్షణ గ్రంథములు రామాయణములోని ఉత్తరకాండకంటె పూర్వమే జన్మించిన వని ఈ క్రింది శ్లోకములద్వారా తెలియవచ్చుచున్నది.

"స్వరాణాం లక్షణజ్ఞాం శ్చ
ఉత్సుకాన్ ద్విజసత్తమాన్
లక్షణజ్ఞాం శ్చ గంధర్వా
న్నైగమాం శ్చ విశేషతః
పాదాక్షర సమాసజ్ఞాన్
ఛందః సుపరినిష్ఠితాన్
కలామాత్రా విభాగజ్ఞాన్
జ్యౌతిషే చ పరంగతాన్
క్రియాకల్పవిద శ్చైవ
తథా కావ్యవిదో జనాన్
భాషాజ్ఞా నింగితజ్ఞాం శ్చ
నైగమాం శ్చాప్య శేషతః
హేతూపచార కుశలాన్
వచనే చాపి హైతుకాన్
ఛందోవిదః పురాణజ్ఞాన్
వైదికాన్ ద్విజసత్తమాన్
చిత్రజ్ఞాన్ వృత్తసూత్రజ్ఞాన్
గీత నృత్య విశారదాన్
శాస్త్రజ్ఞా న్నీతినిపుణాన్
వేదాంతార్థ ప్రబోధకాన్
ఏతాన్ సర్వాన్ సమానీయ
గాతారే సమ వేశయత్" (94. 5-10)

ఇచట 'స్వరాణాం లక్షణజ్ఞాన్', 'లక్షణజ్ఞాంశ్చ గంధర్వాన్', 'కలామాత్రా విభాగజ్ఞాన్' అని చెప్పుటలో గీతాతోద్యములు వచ్చుచున్నవి. క్రియాకల్ప శబ్దము కావ్యాలంకారములను దెలుపునది. 'ఛందః సుపరినిష్ఠితాన్' అనుటచే ఛందఃశాస్త్రము వచ్చు

మున్నది. 'చిత్రజ్ఞాః' అనుటచే చిత్రలేఖనము నెరిగినవారు ప్రస్తుతింపబడినారు. నృత్తసూత్రము లనగా నాట్యసూత్రములు. ఈ నాట్యసూత్రములు నేటి నాట్యశాస్త్రమునకు మూలరూపము. సదాశివ భరతమాది భరతముకన్న వేరైనచో నీ సదాశివభరతము సూత్రములలో చెప్పబడిన దని యెంచవలెను.

ఆంగికాభినయాది ప్రస్తావములయందు ఈ నాట్యశాస్త్రమున 'అన్యే', 'కేచిత్', 'అపరే' ఇత్యాది పదములతో భరతుడు పక్షాంతరముల నుపన్యసించుట గలదు. రసభావగీతాది నిరూపణావసరమున అనువంశ్యశ్లోకముల నుదహరించియున్నాడు. "అనువంశభవా శిష్యాచార్య పరంపరాసు వర్తమానా" అని అభినవగుప్తుడు వ్యాఖ్యానించినాడు. అనగా ప్రాచీన లాక్షణికులచే విరచితములై, గురుశిష్య పరంపర ద్వారా వచ్చుచు ప్రసిద్ధములైన శ్లోకములు అనువంశ్య శ్లోకములని భావము. ఈశ్లోకము లన్నియు ఆదిభరతములోనివి గావచ్చును. లేనిచో ఇంకను ప్రాచీనమగు నాట్యశాస్త్రములోనివై యుండవచ్చును. నాట్యజీవితభూతమైన రసము యెట్లు నిష్పన్నమగునను విషయమున భరతుడే మతభేదమును చెప్పినాడు.

"అత్రాహ—'కిం రసేభ్యో భావానా మభినిర్వృత్తిః, ఉ తాహో భావేభ్యో రసానామ్' ఇతి. ఉచ్యతే--కేషాంచి న్మతం పరస్పరసంబంధా దేషా మభినిష్పత్తి రితి."

ఈ మతభేద మారవ అధ్యాయములోనిది. ఈ అంశములను విచేచించిచో భరతునకు పూర్వమున్న లక్షణ గ్రంథములను సమగ్రముగా అవలోకించి భరతుడు సంక్షిప్తరూపమున ఈ శాస్త్రమును చెప్పినాడన వీలగుచున్నది.

నాట్యసూత్రములు ప్రప్రథమమున నుండెడివని యనుట కుపపత్తుల నిచ్చితిని. నాట్యశాస్త్రము సూత్రరూపమున మొదట గలదు. భరతసూత్రె మని ఈ గ్రంథమునకు లోకమున ప్రసిద్ధి గలదు.

"సంగ్రహం కారికాం చైవ
నిరుక్తం చైవ తత్త్వతః."

అని మునుల ప్రశ్నలలో ఆరవ అధ్యాయమున గలదు. అప్పుడు భరతుడు

"సంగ్రహం కారికాం చైవ
నిరుక్తంచ యథాక్రమమ్."

అని పల్కుచు:

"కిం త్వల్ప సూత్రగ్రంథార్థ
మనుమాన ప్రసాధకమ్
నాట్య స్యాస్య ప్రవక్ష్యామి
రసభావాది సంగ్రహమ్
విస్తరేణోపదిష్టానా
మర్థానాం సూత్రభాష్యయోః
నిబంధో యః సమాసేన
సంగ్రహం తం విదుర్బుధాః"

అని సమాధాన మొసగి, నాట్యసంగ్రహమును తెలిపి సంగ్రహ, కారికా, నిరుక్తుల లక్షణములను మొదట వివరించినాడు.

శాస్త్రము విస్తృతముగా చెప్పుట అశక్యమనుటచే గ్రంథములోని అర్థమును బుద్ధిగ్రాహ్యమగు నట్లుగా సూత్రప్రాయమున భరతుడు చెప్పుచున్నాడు: రసభావాదికమును ప్రధానముగా గ్రహించి తదుపక్రమ పూర్వకమగు నాట్యలక్షణమును సంక్షేపముగా చెప్పుచున్నా నని యనినాడు. లక్షణపరీక్ష గావించు సూత్రగ్రంథములో లక్ష్యభాగము సంకుచితముగా, స్వల్పముగా, నామమాత్రముగా ఉద్దేశింపబడి యుండును. భాష్యమున పరీక్షితవ్యభాగము విస్తృతముగా నుపదిష్టమగును. ఈ లక్ష్య పరీక్షితవ్య భాగమును నిబంధాత్మకముగా సంక్షేపించి చెప్పుటయే సంగ్రహ మనిపించుకొనును. కొద్దిపదములతో సూత్రప్రాయముగా, సంక్షేపించి చెప్పబడు అర్థముగలదానిని కారిక యందురు. సూత్రార్థమునకు సంక్షిప్తార్థ వివరణము గావించునది కారిక. బహుతరలక్ష్యసంగ్రహముగా స్వల్పశబ్దములతో అర్థము చెప్పబడి, జ్ఞాపకముంచుకొనుటకు వీలగునట్లు చేయునది, తదర్థప్రకాశక మగు శ్లోకము కూడ ఔపచారికముగా కారిక యనబడుచున్నది.

ఉద్దిష్టవిషయమునకు ధర్మవ్యాంతరవ్యవచ్ఛేదకమగు లక్షణము చెప్పవలెను. ఈ లక్షణమును మొదట చెప్పి, తర్వాత అకృతాక్షేపోత్తరప్రపంచముద్వారా, తద్వివరణమాత్రరూపముతో, సుఖగ్రాహ్యమగు శ్లోకమును ప్రతిపాదించును. ఈశ్లోకమును కారిక యందురు. సంక్షేపముగా లక్షణీయమై అనేక వ్యక్తిభేదభిన్నమగు అర్థమును లక్షణాత్మకముగా సూచించుచు, ఆక్షేప ప్రతిసమాధానలక్షణముగా వస్తుస్థాపన గావిం

చుట పరీక్షారూపనిరుక్తమనిపించుకొనును. క్రియా విశేషణాభిధానము ద్వారా ఆక్షేప ప్రతిసమాధాన కారణము లక్షణము స్థాపించబడగలదు. లక్షణవాక్యమున అర్థ ప్రతిపాదకము లగు శబ్దములు నానాప్రకారములుగా నుండును. ఇట్టి శబ్దముల నాశ్రయించుకొని ఆక్షేపప్రతిసమాధానము లుత్పన్నమగును. నామపదములనుండి ఆక్షేప ప్రతిసమాధానములను గ్రహించుటకు అభిధానకోశములను, ప్రకృతి ప్రత్యయ విభాగ నిగమనములను స్వీకరించవలెను. క్రియాపదములనుండి గ్రహించుటకు ధాత్వర్థములను, కారకములను తెలిసికొనవలెను. ఈశబ్దపరీక్ష నిరుక్తమున ముఖ్యమైనది. శబ్దపరీక్షలో ఆక్షేప ప్రతిసమాధానములుండును. 'ఈ శబ్ద మీ యర్థము నెట్లు బోధించగలుగుచున్నది ? అను నది ఆక్షేపము. 'ఈప్రక్రియ ననుసరించి'అని చెప్పుట ప్రతి సమాధానము. అర్థపరీక్షలో నానాప్రకారములైన ప్రమాణములద్వారా ఆక్షేప ప్రతిసమాధానములను సాధించవలెను. ధాత్వర్థవచనము చేత, నామవ్యుత్పత్తిచేత, సంగ్రహముగా సూచింపబడి స్థాపితమైన అర్థమును నిరుక్తమని యందురు. సంక్షేపరూపమున చెప్పబడిన విషయమును కారికానిరుక్తములతో విస్తరించి భరతుడు ముఖ్యముగా ఆరవఅధ్యాయము నిచట చెప్పియున్నాడు. కారికాసంపదుపేత మగు విషయమును పరీక్షాపర్యంతము చెప్పియున్నాడు.

ఈ విషయమువలన సూత్రగ్రంథ మొకటి, కారికలతోనున్న గ్రంథము వేరొకటి, నిరుక్తముతో కూడియున్న గ్రంథము మరియొకటి, ఈ మూడింటితోను కలసియున్న దింకొకటి గలవని తేలుచున్నది. రససూత్రమువంటి సూత్రములతోనున్న నాట్యశాస్త్రము మొట్టమొదటిది. "అత్రానువంశ్యే భవతః" అని చెప్పి భరతుడు కొన్ని కారికల నుదహరించినాడు. ఈ కారికలు వృద్ధభరతము లేక ఆదిభరతములోనివి గావచ్చును. మనకు ప్రస్తుతము లభించు భరతనాట్యశాస్త్రము పైమూడింటియొక్క సంక్షేపరూపమని యెంచవలెను. కావుననే నాట్యశాస్త్రములోని శ్లోకములను విశేష పాఠభేదములతో కొందరు పఠించియున్నారు. తద్వారా కొన్నిచోట్ల విషయభేదము కూడ వచ్చినది.

కావ్యమాలాముద్రిత గ్రంథాంతమున "నంది భరత సంగీతపుస్తకమ్" అని గలదు. చెన్నపురి రాజకీయ పుస్తకాలయములోని యొక వ్రాతప్రతియందు ఆంగికాభినయనిరూపణాంతమున "నందిభరతోక్త సంకరహస్తాధ్యాయః" అని గలదు. ఆరవ అధ్యాయమున:

"రసా భావా హ్యభినయాః
ధర్మీ వృత్తిప్రవృత్తయః
సిద్ధిః స్వరా స్తథాతోద్యం
గానం రంగశ్చ సంగ్రహః"

అని యొక సంగ్రహశ్లోకము గలదు. కోహలుని ప్రకారము ఈ శ్లోకమున చెప్పబడిన ఏకాదశాంగములు నాట్యమున గలవని ఉద్భటు డీ శ్లోకమును వ్యాఖ్యానించెను. వాసనా లేశవశమున నటునకు రసభావయోగముతో తత్త్వావేశ ముండుటచేతను, లయాద్యనుసరణముగా నంగము లుండుటచేతను, ప్రయోజనభేదముచే నంతర్యాభూతము లగు నంగములు పునరుక్తములగుటచేతను, ఇచట క్రమ మవివక్షిత మగుటచేతను భరతుని మతమున ఏకాదశాంగములు లేవని, పంచాంగములే యని లొల్లటుడు వ్యాఖ్యానించెను. కావున రసభావాభినయగీతాతోద్యము లనునవే నాట్యములోని పంచాంగము లని అభినవగుప్తుడని నాడు.

ఈ నిదర్శనలద్వారా ఆయాస్థలములయందు ఈ నాట్యశాస్త్రమున నందికేశ్వరుని వాక్యములు, కోహలుని వాక్యములు కూడ గలవని యనవలెను. పైన చెప్పబడిన ఏకాదశాంగములను వివరించు శ్లోకము సమ్మతము గాకపోయినను నాట్యశాస్త్రమున కన్పించుట విశేషము. ఇది కోహలుని శ్లోకమై యుండవలెను. ప్రస్తుతము లభించు నాట్యశాస్త్రముకంటె కోహలుడు ప్రాచీనుడు. కోహలుని మతమని అభినవగుప్తు డనేక విషయములయం దుదహరించియున్నాడు. కోహలుడు నాట్యలక్షణములను ప్రపంచించు విశిష్ట గ్రంథమును వ్రాసినాడని తెలియవచ్చుచున్నది.

"ఫలే ప్రధానే విచ్ఛిన్నే
బీజ స్యావాంతరైః ఫలైః
త స్యావిచ్ఛేదకో హేతుః
బిందు రి త్యాహ కోహలః"

అనుచో శారదాతనయుడు కోహల మతానుసార ముగ బీజమును నిర్వచించినాడు. ఈ లక్షణము దాదాపు

నేటి భరతనాట్యశాస్త్ర నిర్వచనమునకు సన్నిహితము గాగలదు.

"సద్భావో దృశ్యతే తస్యా
మాలతీ మాధవాదిషు
తస్మాత్ పతాకా స్థానే
వికల్పం ప్రాహ కోహలః" (పే 210)

అని కోహల మతానుసారము పతాకాస్థానమును శారదాతనయుడు నిర్వచించెను.

నాట్యశాస్త్రమున భరతపుత్రులలో నొకడుగా కోహలుడు కన్పించుచున్నాడు. చివరి అధ్యాయమున

"శేషముత్తరతంత్రేణ
కోహలః కథయిష్యతి"

అని గలదు. ఈ సంక్షిప్త నాట్యశాస్త్రమునకుముందు, ఆదిభరతము వచ్చినతర్వాత కోహలుడు నాట్యశాస్త్రము నొకదానిని రచించినాడనవలెను. అట్టిచో కోహలాది భరతపుత్రులు రచించిన లక్షణ గ్రంథముల లోని భాగములు గూడ నేటి నాట్యశాస్త్రములోనికి తీసికొనిరాబడిన వని చెప్పవలెను.

నాట్యశాస్త్రము సూత్రములుగా మొదట గలదని చెప్పితిని. ఇవి ఆరువేల సూత్రములు.

"షట్సహస్రీకృతా ఘ్యుక్తం—'ఏభ్యశ్చసామాన్య గుణ యోగేన రసా నిష్పద్యంతే' ఇతి." (4.2)

అని అవలోకకారుడనినాడు. ఈ ఆరువేలు శ్లోకములా? లేక సూత్రములా? యను ప్రశ్నకు సమాధానమునొసగుటకు తగినంత ఉపపత్తులు నాకింతవరకు లభించలేదు.

"అపి తు యథావసరం మహానాట్యాత్మనా షట్సహస్రీరూపేణ ప్రధానతయా ప్రశ్నపంచక నిరూపణపరేణ శాస్త్రేణ తత్త్వం నిర్ణీయతే."

(అ. భా 1.8)

అని అభినవగుప్తుడు గూడ ఆరువేల గ్రంథమునే ప్రస్తావించినాడు.

ఆరవ అధ్యాయమున సూత్రభాష్యాత్మక భాగముతోబాటు, అనువంశ్య శ్లోకములు గలవు. సూత్ర భాగ మతిప్రాచీనమైనది. తర్వాత వచ్చినవి అనువంశ్య శ్లోకములు. చివర వచ్చినది భాష్యాత్మక భాగము. గద్యభాగము మరల గీతాద్యవిధానమున కన్పించుచున్నది. ఇచటి గద్యభాగమునకు సూత్రవివరణరూపము లేదు. భాష్యాత్మక గద్యభాగ మెచట కన్పించినను, దానిని కారికాభాగముకంటె అర్వాచీనమే యని యెంచవలెను.

కాని చిరకాలమునుండి నాట్యశాస్త్రము భరత విరచిత మను ప్రసిద్ధి యొకటి దేశమున గలదు. మహాకవి కాలిదాసు సహితము భరతుని నాట్యశాస్త్రమునే విక్రమోర్వశీయమున ప్రస్తుతించినాడు. నాటకాంత శ్లోకము నేటికిని భరతవాక్యమని పిలువబడుచున్నది.

"ఏవం పితామహాసదృశేన
సర్వదా నాట్యవేదశరీర
రూపకనిర్మాణే కవినా
భావ్య మితి ప్రదర్శ్య తత్ర విభవ
యుక్తో విధేయనటజన శ్చ
రాజా ప్రయోజయితా,
భరతమునిసదృశ శ్చ సంపన్న
పరివారః సర్వవిత్ప్రయోక్తా..." (పే. 1. 16)

అని అభినవభారతీ కారుడనినాడు. నాట్యశాస్త్రమును భరతున కాదేశించినవాడు బ్రహ్మ. భరతు డీ శాస్త్రమును మునులకు చెప్పినాడు. భరత శిష్యులు, భరతమతానుయాయులు, నటులుగూడ భరతు లని పిలువబడుచున్నారు. అనగా భరతశబ్దమునకు నాట్యముతో అవినాభావసంబంధము కన్పించుచున్నది. ఇట్టిచో నాట్యశాస్త్రమున కేక కర్తృకత్వము సిద్ధించుచుండగా, భిన్నకర్తృకత్వము నేల అంగీకరింపవలె నని కొందరు ప్రశ్నింపవచ్చును. కారికలను, కారికలపై గద్యరూపమున వివరణమును ఒకే ఒక రచయితె వ్రాయుటగూడ గలదు. ధ్వన్యాలోక, కావ్యప్రకాశాది గ్రంథము లిట్టివే యని ఉపపత్తినిగూడ నీ పృచ్ఛకులు చూపవచ్చును.

ఐనను వెనుక నాచే చూపబడిన కారణములు, నాట్యశాస్త్రమునకు సంబంధించినవిషయములు ఈ ప్రశ్నకు సమాధానము నొసగగలవు. ప్రాచీనకాలమున సదాశివ, బ్రహ్మ, భరతకృతములను మూడు నాట్యశాస్త్రములైనను ఉన్నవని అంగీకరించక తప్పదు. అభినవగుప్తుడు:

"ఏకస్య గ్రంథ స్యానేక వక్తృవచనసందర్భమయత్వే ప్రమాణాభావాత్, స్వపర వ్యవహారేణ పూర్వపక్షోత్తరపక్షాదీనాం శ్రుతి స్మృతి వ్యాకరణ తర్కాదిశాస్త్రే ష్వేకవిరచితే ష్వపి దర్శనాత్. ఏతేన సదాశివ బ్రహ్మ భరత మతత్రయవివేచనేన

బ్రహ్మమతసారతా ప్రతిపాదనాయ మత్త్రయీసార సారవివేచనం తద్గ్రంథసంక్షేపణేన విహిత మిదం శాస్త్రం, నతు మునివిరచిత మితి యదాహు ర్నాస్తిక ధుర్యోపాధ్యాయా స్తత్ప్రత్యుక్తం, సర్వా నపహ్నువనీయా బ ధిశబ్దలోక ప్రసిద్ధివిరోధాచ్చ."

(అ. భా. 1. 8.)

అని పలికినాడు. అనేక కర్తృకత్వమును నిచట అంగీకరింప నక్కరలేదట. సదాశివ, బ్రహ్మ, భరత విరచితగ్రంథములను, అనగా నీమతత్రయమును వివేచించి, బ్రహ్మ మతసారమును ప్రతిపాదింప నెంచి భరతుడీగ్రంథమును రచించె నని యొక వాదము గలదు. ఈ వాదమునుగూడ అభినవు డొప్పుకొనిన ట్లు లేదు. కాని అనువంశ్యశబ్దమును నిర్వచించుచు "అనువంశ్య భవాశిష్యాచార్య పరంపరాసు వర్తమానా" అనినాడు. పైగా "అత్రశ్లోకాః", "అత్ర సూత్రానువిద్ధే ఆర్యే భవతః" అను ప్రయోగములు, వాటివెంట కారికలుగూడ స్పష్టముగా నీ నాట్యశాస్త్రకర్తని గానట్లు కన్పించుచున్నవి. కారికలలో గన్పించు విషయమే విస్తృతముగా గద్యవివరణలో కన్పించుటచే నీ గద్యభాగము కారికాకర్తచే రచింపబడలేదనవలెను. గద్యవివరణ సూత్రమునకు భాష్యము వంటిది. ఇది శిష్యపరంపరలో గురుముఖతః వచ్చుచున్నది యనుటచేతను, ఇంతటి విషయము సంక్షిప్తరూపమున కారికలలో కన్పించుటచేతను, ఈ గద్యభాగము కారికలకంటె ప్రాచీనమనవలెను.

ఈ నాట్యశాస్త్ర మొక సంహితవంటిది. ఇతఃపూర్వ మున్న నాట్యశాస్త్రములను వివేచించి, వాటి కొక సమగ్రరూపమును, సంక్షిప్తరూపమును సమర్పించిన నాట్యజ్ఞానకుశలు డొకడు భరతుడు గావచ్చును. ఈ భరతశబ్దమునకు నటసామాన్యమను అర్థము గలదని చెప్పితిని. శారదాతనయుడు చెప్పిన వ్యుత్పత్త్యర్థములో సహిత మనేక భరతులు గలరని యనవలసి వచ్చుచున్నది. వ్యాఖ్యాతృ పాఠములు భేదించుటకు ప్రాచీన నాట్యశాస్త్రములే ప్రధానకారణము. అవి లభించనంతవరకు ఏది ప్రాచీన సంప్రదాయసిద్ధమైన అర్థమో చెప్పలేము. ప్రాచీన నాట్యశాస్త్రములలోని పాఠములు ఉద్భటాదులు గ్రహించినారా? లేక ఈ నాట్యశాస్త్రమున గ్రహింపబడినవా? యను విషయమును గూడ నిశ్చయింపలేము.

# చరిత్రగతులు

శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి

## పాత్రలు

శ్రీరంగరాయలు :—పదభ్రష్టుడైన విజయనగరాధిపుడు
రామానాయడు :—రాజభృత్యుడు; ధీరుడు
మాకరాజు :—మండలాధిపతి; మధ్య వయస్కుడు
జగ్గరాజు :—పెంటుకోట పరిపాలకుడు
యాచమనాయడు :—జీర్ణసామ్రాజ్యవైభవ పరిరక్షకుడు

రాయవేలూరు రాజధానిగా పూర్వవైభవశ్రీలను పునరుద్ధరింప జేయడానికి విజయనగర నాయకవంశ ప్రముఖులు విశ్వప్రయత్నాలు చేస్తున్న రోజులవి. సామ్రాజ్యజ్యోతి కొడి గట్టుతున్న ఆ కాలంలో ఒక రోజున జరిగిన కిరాత కృత్యమే యీ నాటికకు మూలం.

* * సూర్యోదయమై ఒక ఘటిక కాలం గడిచినా, రాజధానీ నగర బహిర్భాగమందున్న రాతికోటలోని ఆ మారుమూల గదిలో ఇంకా చీకటి వెలుగుతో ఘర్షణ పడుతూనే వుంది. గదికి మధ్యనున్న కఱకు శిలాతల్పంపై చిఱునవ్వుల దొంతరలలో శయనిస్తున్న ఓ చిన్నారిపాప వదనంపై కిటికీగుండా పడుతున్న ఒక సన్నని సూర్య కిరణం—ప్రక్కనే మనోవ్యధతో కుమిలిపోతున్న ఒక యువకుని వదనంపైనున్న దట్టమైన ఒక విషాద రేఖ. ఆ గదిలోని వెలుగునీడలను వ్యక్తంచేస్తున్నాయి. గదిలోనున్న సామగ్రి అంతంతమాత్రం. మూలల రెండు పట్టికుండలు — గోడల అంచుల కొన్ని పాతబట్టలు - గది కుపరితలమున స్వర్గీయ వీరవేంకటపతిరాయల రేఖాచిత్రం - అచటి దీనత్వాన్ని వ్యక్తంచేస్తున్నాయి రంగస్థలికి మధ్యనున్న పాపకు చేతివాటు దూరంలో ఓ రాజభృత్యుని దృక్కులు వీరివైపు పరిశీలనగా చూస్తున్నాయి.

రామానాయడు : (ప్రభువుకు దగ్గరగా వచ్చి) ఎందుకు ప్రభూ మీకింత నిరాశ?...మీరా... వయోవృద్ధులు కారు. మీ భుజస్కంధాల్లో బలమూ ..ఇంకా క్షీణించనే లేదు. అభిమానులూ వేనకువేలున్నారు—

శ్రీరంగరాయలు : (అర్ధోక్తిలోనే అందుకుంటూ) నిజమే! వయోవృద్ధుణ్ణి కాను. కాని యౌవనంలోని ఉత్తేజం నాలో ఉరకలు వేయటల్లేదుగా! ఇక భుజస్కంధాల్లో

బలమా? గత నెలనాళ్లినుంచీ దాని శక్తి క్షీణించింది నా ఏక భుక్తంవల్ల.

రామ : గత మూడు రోజులుగా అదీ వర్జించి కటిక లంఘనాలతో కాలం బుచ్చుతున్నా రను కుంటాను.

శ్రీరంగ : (తడబడుతూ) లేదే...అయినా నాకే మవసరం నిరాహారదీక్ష సాగించటానికి?

రామ : ఎందుకు ప్రభూ ఈ నటన? నిన్న రాత్రి నేను చూచాను మీరు ఆహారాన్ని వర్జించడం. (క్షణ మూరుకొని) మాటా మంతీ లేని మనుషులూ, దయాదాక్షిణ్యాల్లేని కఠినులే వుంటారనుకున్నారా ఈ ప్రపంచంలో?

శ్రీరంగ : (ఆశ్చర్యంగా) కనీసం చావడానికేనా అనుజ్ఞనీయని జగ్గరాజువద్ద నేనా నీ పరిచర్య?

రామ : దయచేసి మహారాజులవిషయాలు మఱచి పోయి మామూలుమనుషుల్లా మాట్లాడుకో లేమా మనం!

శ్రీరంగ : శత్రుమధ్యంలో అమృతబిందు వుందని, ఆశపడి నోరు జారాను. అంతకన్న అన్యథా భావించకయ్యా!

రామ : మన మనసులు మంచివైతే అమృతబిందువులు కొల్లలుగా లభిస్తాయి ప్రభూ ఈప్రపంచంలో!

శ్రీరంగ : మంచి యీ ప్రపంచంలో మఱుగైందనీ, దానికిక్కడ స్థానం లేదనీ ఇంకా తెలుసుకో లేదా నువ్వు?

రామ : మంచి ఏలా మరుగౌతుంది ప్రభూ! అలనాటి రామరాజ్యంలోనూ మంచి విరాజిల్లింది. ఈనాటి మా ప్రభుపాలనలోనూ మంచి వన్నె కెక్కుతున్నది.

శ్రీరంగ : మీ మహారాజుపాలనలోనా?

రామ : అవును.

శ్రీరంగ పండంటివంశాన్ని బండలపాల్జేసి, రాజవంశ చరిత్రకే కళంక మాపాదించిన మీ మహారాజు—మంచిరాజు. శాంతి సౌభాగ్యాలతో, కవి గాయక పండితులతో దేశదేశాల వాసికెక్కిన విజయనగర సామ్రాజ్య మూలస్తంభాన్ని సమూలంగా పెరికిన మీ మహారాజు—మంచిరాజు. కదూ?

రామ : నిష్కామకర్మద్వారా యోగమార్గం సాధించ దలిచిన మీ కెందుకీ ఆవేశం?

శ్రీరంగ : ఆవేశం కాదు నాయనా! అన్యాయాన్ని కార్యాకార్యదృష్టిలో పరిశీలించడం.

రామ : జీవితమందలి ఈతిబాధలకు రోసిన మీకీ పరిశీలన కూడా అనవసరమే గా!

శ్రీరంగ : నిజం చెప్పావు నాయనా! అయినా చిత్తచాంచల్యాన్ని — మనోప్రాదుర్భావాన్ని అరికట్టడం ఎవరికో యోగ్యులైన మహనీయులకే గాని, నాబోటి......

రామ : రాజ్యమందలి ఆకాంక్షతో సతమతమయ్యే వారికి తగదంటారు! అవునా?

శ్రీరంగ : పొరబడ్డావు రామరాయా! రాజ్యమందలి ఆకాంక్షా కాదు. ఐహికమందలి ఆపేక్షా కాదు. అరిషడ్వర్గాలమీద అధికారం లేని నాబోటివారికి సాధ్యపడదనిమాత్రమే చెప్పబోయాను.

రామ : అరిషడ్వర్గాలమీద అధికారం లేనివారు అభిమానులనుకూడా కూడగట్టుకోకపోవడం అక్రమంకదూ!

శ్రీరంగ : కాదు. ఒకదానిపై అధికారం లేనివారు మరొకదానిపైమాత్రం వీరవిహారం చేయడమెందుకూ అని.

రామ : మీరు వీరులు కాబట్టి.

శ్రీరంగ : నా వీరత్వం ఎన్నడో నశించిందినాయనా! ఆ మహనీయులు వీర వేంకటపతిరాయలవారు బ్రతికున్నరోజుల్లో యువరాజుపదవి నధిష్ఠించిన నేనూ ఓ వీరమూర్తినే! కానీ....

రామ : ఓడలు బండ్లయినాయి. కొంతకాలం తర్వాత....

శ్రీరంగ : బండ్లోడ లౌతాయన్న ధైర్యాన్ని, ఆశాభావాన్ని నాలో పురికొల్పి నాసహనాన్ని రూపుమాపదలిచావా? నీది వృథాప్రయాస నాయనా?

రామ : ఆశాభావాలూ, వాగ్దానాలూ, ఆశ్రితులకు కల్పించి వారిని అధఃపాతాళానికి పంపించడం మీబోటి మహారాజుల లక్షణంకాని

నాబోటి సామాన్యపీఠికానికి కలలోనైనా తలంచరాని ఘోరాపరాధాలు బాబూ అవి!

శ్రీరంగ ఏమిటిది రామరాయా?

రామ అవును ప్రభూ! ఏలిన శ్రీరంగరాయసార్వభౌము లేనాడీ రాజ్యపాలనను స్వీకరించారో; ఆనాడే దేశం సుభిక్షమై పాడి పంటలతో ఫలవంతమై వర్ధిల్లుతుందని ఆశించాం. కాని జరిగిందేమిటి? ఆలశలన్నీ వమ్మలయ్యాయి. ప్రజలందరు విఫలమనోరథులైనారు. భగ్నహృదయులై బాధతో పరిభవిల్లుతున్నారు.

శ్రీరంగ : ఏమిటిది రామరాయా? గతజలసేతుబంధన మెందుకయ్యా!

రామ గతాన్ని తల్చుకుంటూనే భయపడుతున్నారు మీరు. ఈ భయోద్వేగాలతో—ఓటమిని పొంది, దాని నంగీకరించడానికి సిద్ధపడి, భవిష్యత్తునుకూడా దుఃఖభాజనం చేస్తారా?

శ్రీరంగ : మనం చేయునది ఏముందయ్యా! కీలుబొమ్మ లీ మనుష్యమాత్రులు. చక్రధారి ఆ సర్వేశ్వరుడు కాదుటయ్యా ఈ జగన్నాటక సూత్రధారి!

రామ : ఆలాఅని పురుషప్రయత్న మనవసరమేనా? యుక్తాయుక్త విచక్షణతో కావించిన ప్రయత్నం వమ్మకావలసిందేనా?

శ్రీరంగ : (ఆశ్చర్యంగా) ప్రయత్నమా? వమ్ము గావడమా?

రామ : అవును. మీకోసం, మీ పుత్రుల సుఖం కోసం, మీ వంశప్రతిష్ఠకోసం కొందరు తమ ప్రాణాలనైనా బలీయడానికి సాహసించారు. తత్ఫలితం? ఓభీరువైన రాజుకోసం, ధీరుడైన ఒక యువకుడు ప్రాణార్పణ గావింపవలసివచ్చింది.

శ్రీరంగ : నిజం!! ఆ మహనీయుడెవరో!

రామ : చెప్పి మరింత మిమ్మలను దుఃఖపెట్టడమవుతుందేమో!

శ్రీరంగ : నా జీవితమే దుఃఖభూయిష్టం. ఈ బాధాలహరిలో.

రామ : జరిగినది గ్రహించకుండా మాట జారకండి మహారాజా! తరుపరి వంతచెందవలసివస్తుంది.

శ్రీరంగ : భయపెట్టి బాధపెట్టదలచావా?

రామ : (ఏకసక్కెంగా) నేనా? మిమ్మల్నా? నాల్గేండ్ల కారాగారవాసం మీపై అధికారం చెలాయింపలేకపోయింది. రెండు మాసాలక్రిందట నికృష్టమరణ వేదనలలోనైన మహారాణి మీ కన్నీటిధారకు కారణం కాలేకపోయింది. ఈ బీద భృత్యుని చిన్ని మాటలు మీకు బాధకల్గిస్తున్నాయా? ఆశ్చర్యంగానే వుంది!

శ్రీరంగ : చావలేక బ్రతుకుతున్న నా మీదెందుకు నాయనా నీకీ నిర్దయ! నలుగురిలో నవ్వులపాలైనవంశప్రతిష్ఠ—హింసకు, బాధకుగురి అయిన కుటుంబం—ఆనందానికి, సుఖానికి నోచుకోని జీవితం—వీటితోనే సతమతమవుతున్న నన్ను, నీయీ సూటీపోటిమాటలతోకూడా ఎందుకు నాయనా గాయపరుస్తావు?

రామ : చిరాశానిస్పృహలతో నీరసించేకన్న నిశ్చలమైన మనోధైర్యంతో కారణం గ్రహించడం ఉత్తమం కాదా మహారాజా!

శ్రీరంగ : ప్రత్యేకకారణమేమీ లేదే? సుఖాన్ని వదిలేస్తే సర్వమూ చక్కబడుతుందని ఆశించాను. ఆలాగే ఈ కారాగారవాసంలో ఐహికానికి పాటుపడకుండా, ఆముష్మికంలో దారితెన్నుకోసం గాలించాను. కానీ వీనిని నే సహించినా, నాకుటుంబం భరించలేకపోయింది. అంతే!

రామ : అంతేనా?

శ్రీరంగ : ఉన్న దున్నట్లుగా వివరించాను. నిజం!

రామ : ఎంత పొరపడ్డారు మహారాజా! కన్నకడుపు ఆకలిమంటలతో కటకటలాడితే దానిని బాధనోర్చుకోలేని తత్వమున్నారా?

శ్రీరంగ : ఆకలిమంటలతోనా!

రామ : మహారాజ్ఞి కట్టుపడ్డలకు కఱువయి, అలసట చెంది అవమానంపాలయితే ఆధ్యాత్మిక తత్వమూ త్యాగికింకా అలవడలేదన్నాం?

శ్రీరంగ : కట్టుపడ్డలు కరువైనాయా!

రామ : హంసతూలికాతల్పాల్లో శయనిస్తూ, భోగభాగ్యాలకలవాటైన రాజకుమారులు కఠిన శిలాతల్పాలపై శయనిస్తూ, పరుల ఆంక్షా నిర్బంధాలలో జీవనభృతి సాగిస్తుంటే అమాయకులైన వారి కష్టాలను లక్ష్యపెట్టలేదా?

శ్రీరంగ : (దుఃఖాన్ని దిగమింగుకుంటూ) చేతులు కాలిన పిదప ఆకులు పట్టుకుని ఏం ప్రయోజనం నాయనా? ఇంతకూ మాకోసం ప్రాణార్పణ గావించిన ఆ మహనీయుని నామధేయం చెప్పనే లేదు!

రామ : చెప్పమంటారా?

శ్రీరంగ : అవశ్యం!

రామ : యాచమనాయకుడు!!

శ్రీరంగ : ఆ!!

రామ : ఏ మహనీయుని నిలువెల్ల పౌరుష పరాక్రమ రాజభక్తి సంపుటీకరణమని ప్రశంసించారో, ఏ మహనీయుడు వేంకటగిరి పురాధీశ్వరుడై, విజయనగర ప్రాభవ పరిరక్షకుడుగా వాసికెక్కాడో, ఏ మహనీయుడు మీ జ్యేష్ఠ పుత్రుని మృత్యుముఖంనుండి తప్పించాడో ఆ మహనీయుడే అరివీరులచేతుల్లో...

శ్రీరంగ : చాలు — రామనాయా చాలు! మా సేవకే నే ఆ మహావీరుడు మృతికి గురైనాడా!

రామ : కనీసం ఆ మహనీయుని రాజభక్తికి ప్రతిఫలంగానైనా ఆతని కడసారికోర్కె తీరుస్తారా?

శ్రీరంగ : నేనా? పరుల దయాదాక్షిణ్యాలపై బ్రతుకుతున్న నేనా?

రామ : బ్రతికున్న రోజుల్లోనూ అతనికి మీనుండి కష్టాలే సంప్రాప్తమయినాయి. మరణాంతానకూడా మీనుండి అతనికి నిస్సహాయత్వమే లభిస్తోంది.

శ్రీరంగ : ఏం చేయమంటావు నాయనా! పరాభవాగ్నితో కుమిలిపోతున్నా అన్యాయాన్నెదుర్కోలేని అసహాయుణ్ణి నేను. ఈస్థితిలో సానుభూతి చూపించగలను గాని సహాయ సంపత్తులేలా అందజేయనయ్యా?

రామ : యాచమనాయని ఆత్మశాంతికి సానుభూతి వాక్యాలు కాదు మహారాజా — అవసరాలు! ఆ వేదనతో కర్తవ్యతావిమర్శనాజ్ఞానాన్ని కోల్పోకండి ... ముక్కోటి తెలుగుబిడ్డల ఏకైక ఆశయం జీర్ణ విజయనగర సామ్రాజ్యపరిరక్షణ.

శ్రీరంగ : అందుకు నే జేయవలసింది?

రామ : త్రికరణశుద్ధిగా సామ్రాజ్యభారాన్ని వహిస్తామని ప్రమాణం చేయండి ప్రభూ!

శ్రీరంగ : ఇదేనా మీ అభీష్టం?

రామ : అవును మహారాజా!

శ్రీరంగ : భవిష్యత్తుపై ఆశలతో జీవిస్తున్న మీకు, 'సంగో రాజా భవిష్యతి' తత్వంలో వున్న నేను నాయకత్వం వహించవలసిరావడం ఆ లీలామానుష విగ్రహుని వింతచర్యల్లో ఒకటి కాబోలు!

[మాకరాజు ప్రవేశం]

మాకరాజు : రాజ్యాధికారాన్ని తృణప్రాయంగా త్యజించిన సార్వభౌములు, వైకుంఠవాసాధికారంకోసం విశ్వప్రయత్నాలు చేస్తున్నట్టుంది.

రామ : భోగి కానిదే త్యాగి కావడం కష్టమని గ్రహించిన మహారాజులవారీమధ్య మనసు మార్చుకున్నారు మండలాధిపతీ!

మాక : ఏకవచన ప్రయోగమంత మంచిది కాదేమో రామనాయా?

రామ : మానవునికీ, మానవునికీ మధ్య, అధికారానికంతస్తులున్నాయి కానీ స్వాభిమానానికి తరతమ భేదాలు లేవు మాకరాజా!

మాక : మహారాజులవారు బోధించిన మెట్ట వేదాంతమా యిది? ఏం విజయనగర చక్రవర్తీ! కక్కిన కూటికి కాసపడుతున్నట్లున్నావు? కాలం గడిచి, అధికారం మారి, గౌరవాలు నశించినా, వ్యక్తి విలువలను సరుకు చేయక పోవడం తమ గొప్పతనమా?

రామ : వ్యక్తి విలువలకు ప్రమాణమేమి వాటిల్లిందిపుడు?

మాక : ఒకనాటి మీ పట్టాభిషేక సమయంలో — తమకు కానుకలు సమర్పింపలేదని, జగ్గరాయలవారిని, నిండు సభలో పరుష

వాక్యాలు పలుకలేదా మీ సైన్యాధిపతి యాచమనాయడు?

శ్రీరంగ / రామ : .........

మాక : మహారాజు వేంకటపతిరాయలవారు అవసాన సమయంలో ప్రళయకావేరిలోని మహారాజ్ఞి కొండమదేవిని చూడదలచినపుడు— మనసు విరుగుడు మాటలు పల్కి మహీపతిని సంసార విముఖునిగా చేయలేదా రఘునాథ రాయలు?

శ్రీరంగ / రాము : .........

మాక : తుండీర మండలాధిపతి కృష్ణప్పనాయకుడు, మధురానగర సామంతప్రభువు ముద్దు వీరప్ప నాయకుడు రాజదర్శనంకోసమే తెంచినపుడు—రాజద్వారంవద్దనే బహిష్కరించలేదా వారిని మీరు?

శ్రీరంగ : రాజ్య భద్రతకోసం చేసిన అంతరంగిక కార్యాలు బహిరంగపఱచడ మిప్పుడు అప్రస్తుతం, అనవసరం మాకరాజా!

మాక : అప్రస్తుతం; రాజ్యభద్రత; అంతరంగిక కార్యాలు;—వ్యక్తి విలువలు పాటించలేక దూషణభూషణ తిరస్కారాలు మీ ఇచ్ఛానుసారం జరపడం రాజ్యభద్రతకోసం... అన్యాయాలూ, అక్రమాలూ లెక్కకు మిక్కిలిగా చేయడాలు మీ అంతరంగిక కార్యాలు......

[మెల్లగా జగ్గరాజు ప్రవేశం]

జగ : ఏమిటోయ్ మాకరాజా! మహారాజులవారు పేరోలగం తీరిస్తే అధికారధిక్కారాపరాధాన్ని గావిస్తున్నావు?

మాక : సర్వం గతించినా స్వాభిమానం చావలేదీ రంగరాయలకు, జగ్గరాయ ప్రభూ!

రామ : స్వాభిమానం ప్రతిజీవికీ సహజంగానే సంభవిస్తుంది.

జగ : ఆరునెలలు సహవాసం చేస్తే వారు వీరవుతారన్న ఆర్యోక్తి నీయందు యథార్థమైందే రామానాయా! (అతని కటిప్రదేశంలోని వీరఖడ్గాన్ని పరిశీలనగా చూస్తూ) యాచమనాయలవారిది కాదుటయ్యా ఆ ఖడ్గం?

రాము : అవును ప్రభూ! ఇదటికి రాకపూర్వం నేను వారికి భృత్యుడనని మీకు తెలిసే వుంటుంది. ఆకాలంలోనే నాసేవకు వారను గ్రహించి ఇది నాకు ప్రదానం చేశారు.

జగ్గ : ఇంతవఱకూ నా కాసంగతి వెల్లడించనేలేదు.

రాము : సమయాసమయ నిరీక్షణ మంచి కలుగజేస్తుందేమోనని!

జగ్గ : ఇదా సమయం?

రాము : కాకపోయినా దేవరవారి దృష్టి దీనిపై ప్రసరించింది కాబట్టి ఇది యుక్తకాలమే!

జగ్గ : అలాగునా...చూచావా మాకరాజా! రామానాయని కుశాగ్రబుద్ధి. మహారాజుల కొక మంచిపని నివేదించుటకుకూడ సమయాసమయనిరీక్షణ కావాలట! రాజకార్యరక్షణకై యుక్తాయుక్త విచక్షణ వుండాలట! ఈలాంటి ప్రభుసేవకులు పదిమంది వున్నా నీలాంటివారితో నాకు పనే వుండకపోను.

: నిజమే ప్రభూ! మాతో పనీ వుండకపోను-మూడు రాత్రులలో రాజ్యం తెల్లవారిపోను!

జగ్గ : ఇంతకూ ఆ వీరఖడ్గం మనకందియనేలేదు చూచావా! తెలివి తేటలొకరిసొమ్మటయ్యా!

రాము : ఎందుకు ప్రభూ నర్మగర్భమైన ఆ మాటలు? కావలసింది ఖడ్గమేగా! గ్రహించండి మా రాజసేవకు ప్రతిబింబమైన యీ ప్రతిచిహ్నాన్ని.

[వీరఖడ్గం అందించబోతాడు. జగ్గరాజు మెడనుండి పచ్చలహారం తీస్తూ]

జగ్గ : సెబాష్! రామానాయా! మనసుకు నచ్చినవాడవయ్యా! ఏదీ ఈ పచ్చలహారాన్ని స్వయంగా నీ మెడకలంకరించనీ నన్ను!

రాము : ఎందుకు ప్రభూ అంతిమన్నన. భక్తిప్రవృత్తులతో మెలగవలసిన వారలం. బీదలం, రాజసేవకులం.

మాక : ఏమిది జగ్గరాజా! భృత్యులు రాజపాదముల కడ మెలగవలసిన వారలేకాని, మన్ననలు పొందవలసినవారా!

జగ : ఎంత పిచ్చివాడవు మాకరాజా! వారు మాత్రము మనుషులు కారూ? వారికి మాత్రం ఆశలూ, ఆశయాలూ వుండవూ? మహారాజులైనంతమాత్రాన క్రీగన్నులనైన పేదవారిని

వీక్షించరాదా? (రామానాయని అదో విధంగా చూస్తూ) రావయ్యా రామానాయా! ఆదరణతో ప్రీతిపూర్వకంగా ఆహ్వానిస్తే బిడియపడతావెందుకయ్యా!

[ఆ హారాన్ని అలంకరించటానికని దగ్గరకు వెళ్ళి, అకస్మాత్తుగా అతని పెడరెక్కలు విరిచి పట్టుకుంటాడు. రామానాయడు పెనగులాడినా లాభం లేకపోతుంది]

జగ : రావోయి మాకరాజూ! క్షణంక్రితం అనిన పలుకులు జ్ఞప్తికి తెచ్చుకొని బంధించు ఈ ద్రోహిహస్తాలు. భీతహరిణంలా ఆలా గడగడా వణకుతావేమోయి! వచ్చి నీకోర్కె తీర్చుకో.

[ఈ హఠాత్పరిణామాన్ని వీక్షించి స్తబ్ధుడైన మాకరాజు క్రమంగా కోలుకుని జగ్గరాజు ఆజ్ఞ నిర్వర్తిస్తాడు]

జగ : కృతఘ్నుడా! తిన్నయింటివాసాలు లెక్కించడం మీ యింటనున్న ఆచారమా ద్రోహీ! పాముకు పాలుపోసి పెంచినా ఆశ్రయమిచ్చినవానిని కరవక మానదట!

శ్రీరంగ : జగ్గరాజా! చేసినదుష్కృత్యాలకు ఏనాడో ఒకనాడు ఫలమనుభవించక తప్పదు. అమాయకుడైనవానిని అన్యాయంగా బంధించడం అక్రమం కాదా?

జగ్గ : అక్రమం? వీడు, మీ పెద్దబిడ్డను చాకలివాని వేషంలో తప్పించడం అక్రమం కాదా?

శ్రీరంగ : ఇతనా మా చిరంజీవి ప్రాణదాత!

జగ్గ : యాచమనాయునితో కుట్రచేసి మీకు విముక్తి కల్గించదలచడం అక్రమం కాదా?

శ్రీరంగ : మమ్మలను రక్షింపదలిచావా? ఏమిటిది రామనాయా?

రామ

మాక : పయోముఖవిషకుంభం. మాటలతో పన్నాగం వెలిబుచ్చడు ప్రభూ వీడు!

రామ : మరణానికి భయపడతాననుకున్నారా? పిరికిపందల్లారా! మా కర్తవ్యంలోని ప్రథమభాగం 'రాజవంశాంకురరక్షణ' నిర్విఘ్నంగా నెఱవేరింది. ఇక మీరు చేయగలిగిందేముంది?

జగ్గ : మాకరాజా! ఈ ద్రోహి శరీరాన్ని చిత్రవధ చేయించు! రాజద్రోహుల కొక గుణపాఠంగా వాడవాడలా వీని గాథ ప్రచారం చేయించు వెళ్ళు!

శ్రీరంగ : నీవుకూడా నన్ను నిస్సహాయుణ్ణి చేస్తున్నావా రామానాయా?

రామ : ధైర్యం వహించండి ప్రభూ! మీరే యిలా డీలైతే తమ ప్రజలేం కావాలి? చీకటి వెలుగులు అశాశ్వతాలు. పునర్దర్శనం పైలోకంలోనే.

[శ్రీరంగరాయలపాదాలకు వంగి నమస్కరిస్తాడు]

శ్రీరంగ : యాచమనాయలవారితోబాటు నీవుకూడా అనుపమానమైన త్యాగం చేస్తున్నావా రామానాయా మాకోసం ....! ఈ పాడుజీవాలకోసం రెండుప్రాణాలు నిలువునా బలికావడమా? అబ్బా!

రామ : క్షమించండి ప్రభూ! మీలో నిద్రాణమైన ధైర్యసాహసాలకుత్తేజం కల్గించడంకోసం మిమ్మల నీనాడు అనరానిమాట లన్నాను. యాచమనాయలవారి మరణవార్త...

[అర్ధోక్తిలోనే జగ్గరాజు సంజ్ఞపై మాకరాజు అతడిని బలవంతాన తీసుకుపోతాడు]

జగ్గ : రంగరాయా! కొడిగట్టిన దీపం చిరకాలం నిలువనేరదని నీకు గ్రాహ్యమేకదూ!

శ్రీరంగ : రాజభోగాలనుభవించినవారికి ప్రకృతి తత్త్వాలర్థంకావని తమ భావమా?

జగ : కాదు రాయలూ! నీ జీవితయాత్ర నేటితో సంపూర్ణం కావస్తోందనీ, నీ కష్టాలంతరించబోతున్నాయనీ దాని భావం.

శ్రీరంగ : భగవంతుడు నేటికి నాపై కరుణించాడు. ధన్యుణ్ణి.

జగ్గ : కానీ ఈ భగవత్కటాక్షానికిముందు కొంత లంచం కావలసివచ్చింది!

శ్రీరంగ : భగవంతునికి లంచమా?

జగ్గ : దైవానికి కాకపోయినా, దైవసమానుడైన పృథివీపతికి!

శ్రీరంగ : నిజం!

జగ్గ : మహారాజ్ఞి కొండమదేవి పుత్రునికి సామ్రాజ్య రక్షణవిషయంలో మీ సహాయం కావల్సి వచ్చింది.

శ్రీరంగ : నా సహాయమా?

జగ : అవును. మీ సహాయమే. దళవాయి యాచమ నాయకు ఏయే పన్నాగాలు పన్నుతున్నదీ; రఘునాథరాయ లెట్టెట్టి కుట్రలు సలుపుతున్నదీ; గోవెల వేంకటపతి నద్దగించిన రామదేవరాయ ప్రభృతు లెచట వున్నదీ— తెలుసుకోవలసిన అవసరం మా కనవరతం వున్నది. అందుకు మీ సహాయం కావాలి.

శ్రీరంగ : లభించకపోతే?

జగ్గ : నికృష్ట జీవితం, యమయాతన, ఘోర మరణం.

శ్రీరంగ : రహస్యం బయలుపడితే!

జగ్గ : యమయాతన తప్పుతుంది; కోరినవన్నీ లభిస్తాయి. నవ్వులలో మరణిస్తావు.

శ్రీరంగ : ఇంతేనా?

జగ్గ : చాలకపోతే కావలసింకేదైనా కోరుకో. అనుగ్రహిస్తా!

శ్రీరంగ : చెప్పను.

జగ్గ : చెప్పక.

శ్రీరంగ : నాకు తెలిసింది సామ్రాజ్యం. నీకు చెప్పేది శూన్యం. నీ హృదయం కర్కశత్వమైతే బాధ లనుభవించుటకు సిద్ధం. చిత్త మొచ్చినట్లు ప్రవర్తించు!

జగ్గ : (నవ్వుతూ) ఏమిటి రంగరాయా? మూర్ఖుడైనట్లున్నావు. కలసివచ్చిన సౌఖ్యాన్ని కాలదన్నుతున్నావే?

శ్రీరంగ : మూర్ఖులకు సౌఖ్యాల అనుభవం అర్థం కాదు జగ్గరాజూ!

జగ్గ : రాజధిక్కార నేరానికి ఫలితం తెలుసు కదూ?

శ్రీరంగ

జగ్గ : యమయాతన అందులో ప్రథమదశ అనుభవమైనదనుకుంటాను. ద్వితీయ దశలో నీకళ్లముందు నీ చిరంజీవి మరణం జరగాలి.

శ్రీరంగ : (ఒక్కసారిగా ఉద్రేకం చెంది) 'చిరంజీవి మరణమా ? అమాయకమైన చిఱునవ్వుతో చూపరులకు ఆనందానందం కల్గించే ఆ పాలబుగ్గల పసిపాప నీకే మపచారం కల్గించిందయ్యా? నా ఆశాంకురం, నా జీవనజ్యోతి నీహృదయంలో ఏం విషం చిలికిందయ్యా! ఇంతఘోరం తలపెట్టావు ?

జగ్గ : నీతనయగా జన్మించడమే !

శ్రీరంగ : హృదయంలేని కసాయివాడైనా చిన్నారి బంగారుపాపలను ముద్దాడుతాడే! కాలకూటవిషాన్ని వెడలగ్రక్కే కోడెత్రాచులైనా, చిదిమితే పాల్గారు చెక్కుటద్దాల పాపలను స్పృశింపవే? నీ వెట్లు చేయింతువయ్యా ఈ ఘాతుక కృత్యాన్ని ?

జగ : ఇతరులచే చేయింపను రంగరాయా! స్వహస్తాలతో కన్నులపండువుగా చేస్తాను.

శ్రీరంగ : ద్రవించని శిలాహృదయమా నీది? స్రవించని కొయ్యబొమ్మవా నీవు ?

జగ్గ : కరుడుగట్టిన నాహృదయానికి నీ చిన్నపాలు నిప్పు(?) యోజనాలు రాయలూ!

[అకస్మాత్తుగా తల్పంపైకి విజృంభించి పిల్లని హత్యచేయబోతాడు. రంగరాయ లడ్డుకోగా]

జగ : అడ్డు నిలువకు రంగరాయా. పెద్దప్రాణానికే ముప్పు తెస్తుందది !

[రంగరాయలు చలించడు. నిశ్చలమైన అతని మనోధైర్యాన్ని జూచి మరింత ఉగ్రుడౌతాడు పిల్లవాని హత్యాసంఘర్షణలో ప్రమాదవశాత్తు జగ్గరాజు కరవాలం శ్రీరంగరాయల పార్శ్వంలో గ్రుచ్చుకొంటుంది.]

శ్రీరంగ : అబ్బా! ... అన్నంత...పనీ...చేశావా? కనీసం...ఇప్పుడైనా...నావంశాంకురాన్ని కాపాడతావా? ...హరీ...అబ్బా!...

[తలవాలుస్తాడు, గదిలోనున్న కాంతిక్రమక్రమంగా అంతర్హితమౌతుంది. ఒక్క జగ్గరాజు ముఖం మాత్రం భీకరంగా కన్పిస్తుంటుంది.]

జగ్గ : ఒకపీడ విరగడైంది. వేరొకపీడ విరగడవబోతున్నది. (వికటంగా నవ్వుతూ) ఈ నాటితో రాయల వంశ చరిత్రను సమాధి చేస్తాను. అహ్హహ్హ...మూశావా. ఓచిట్టిపాపా ...పాపం ... నీకోసం మీతండ్రి తన

ప్రాణాల నర్పించాడు. ఇక నీవంటావా... మీ తండ్రికోసం నీప్రాణాల నర్పించు. అహ్హహా...యాచమనాయడు నిన్ను రక్షిస్తాడని నవ్వుతున్నావా? యాచమనాయా ...యాచమనాయా.

[క్రమంగా గదిలో కొద్దిభాగం కాంతివంత మౌతుంది. అప్పుడే ఎడమదిక్కునుండి యాచమనాయడు ప్రవేశిస్తాడు. ఆజాను బాహు విగ్రహం. గంభీరమూర్తి కలవాడు. బిడ్డనిపై వంగిచూస్తున్న జగ్గరాజు వీపునకు కత్తిని ఆనించినా, జగ్గరాజు, యాచమనాయని పరికించడు]

యాచమనాయడు : ఏం జగ్గరాజూ! నా పేరు నే కలవరించి, పలవరిస్తున్నట్లున్నావు?

జగ్గ : (ఉలిక్కిపడి) ఎవరది?

యాచ : ప్రాణాలపై ఆశవుంటే మరుమాటాడక చెప్పినట్లుచరించు జగ్గరాజూ! తెలీ దూ నేనెవరినో? ఎవరికోసం అహోరాత్రాలు అన్వేషిస్తున్నావో, ఆవ్యక్తిని. నీ సర్వస్వాన్ని ధారపోసైనా ఏవ్యక్తిని సజీవంగా బంధించదలిచావో ఆ వ్యక్తిని. ఏమలా అయోమయంలో వెఱ్ఱిచూపులు చూస్తావు? నాపలుకుల్లో నమ్మకం కల్గటల్లేదా?

జగ్గ : నీవు...నీవు...యాచమనాయడి వేనా?

యాచ : ఆ!! ఈ భుజస్కంధాల్లో బలంకోసమే నీవు అఱ్ఱులు చాచింది. ఈ ఖడ్గంలోని రుధిర పానాసక్తతకోసమే నీవింతకాలమూ నిరీక్షించింది.

జగ్గ యతిరాజు నిన్ను వధింపలేదా?

యాచ నీ భృత్యులకు చిక్కినంతటి భీరువు ననుకున్నావా నేను? ప్రాణాలపై ఆశయున్న వారలేకాని, సర్వానికీ త్యజించిన నాబోటి వారలకు భయమేమిటి రాజూ!

జగ్గ : బయట కావలివారలు లేరూ?

యాచ : కానీ వారంతరూ ఇప్పుడు నావారు.

జగ్గ : (నెత్తికొట్టినట్లు) అయితే నాతో నీకేమవసరం?

యాచ : చక్కనిసందేహం! ఒకశత్రువునకూ, మరొక శత్రువునకూ మధ్య గల సంబంధం,—ఒక రాజకుటుంబపరిరక్షకునికీ, దాని వినాశకారకునికీ గల సంబంధం — అదే నీకూ నాకూ గల బాంధవ్యంకూడా!

జగ్గ : (తనలో తననుకుంటున్నట్లుగా) ప్రస్తుత కర్తవ్యం?

యాచ : మహారాజు రంగరాయలవారెక్కడ?

జగ్గ : స్వర్గంలో హాయిగా నిద్రబోతున్నారు.

యాచ : ఆ! (ఉద్వేగంతో) ఆ ధర్మరాజును హత్యచేశావా. ధార్మికుడు. దయార్ద్రహృదయుడు. ధీశాలి. ఆ మహనీయుని ఏలా చంపావురా ద్రోహీ! శత్రుమధ్యంలో ఒంటరివానిని చేసి మరణానికి పాల్పడచేస్తావా? భీరుడా! నిన్నిచట వధిస్తే నీకు దిక్కెవ్వరు?

జగ : క్షమించు యాచమనాయా! ఒకటి చేయబోతే మరొకటి జరిగింది.

యాచ మరణానికి భయపడుతున్నావా? రణధర్మాన్నికూడామరిచి ప్రవర్తించిన నీవంటి దుష్టుని ఇక్కడ చంపి నాకత్తిలి మలిన పఱచను లే! జరుగబోవు ఆ యుద్ధంలోనే ని రుధిరంతో మా మహారాజుకు ఆత్మశాంతి కలుగజేస్తాను.

[రంగరాయలదేహాన్ని సమీపించి] మహారాజా! సమయాని కాదుకోలేకపోయిన ఈ వృద్ధసేవకుణ్ణి మన్నించండి. మీ సేవలో నా ప్రాణాలైనా త్యజిస్తాను. కానీ మీ వంశచరిత్ర నామరూపరహితం కానివ్వను. ఈ పసిపాపపై ప్రమాణంచేసి నాయీప్రతిన నిలుపుకొంటానని బాసచేస్తున్నానుప్రభూ! ఆశీర్వదించండి!

[శ్రీరంగరాయలపాదాలకు నమస్కరించి, మెల్లగా పాపనెత్తుకొని వెనుకవెనుకకు అడుగులేస్తూ నిష్క్రమిస్తాడు]

జగ : విఫలమైంది...నా ప్రయత్నమంతా బూడిదలోబోసిన పన్నీరైంది. ఈ యాచమనాయ డొకడు నాపాలిటి మృత్యువుగా దాపురించాడు. ఏదిఏమైనా 'రేపు' యుద్ధం జరిగితీరవలసిందే. అందులో ఈ వంశచరిత్ర కొందరభాగ్యులైన మానవులచరిత్రతో కలసి, శేషరహితంగా నాశనం కావలసిందే!

[ఈ మాట లంటున్నప్పుడు గది అంతా అంధకారమై పోతుంది. ఆ అంధకారప్రదేశంలో ఈ భీషణారావాలే మరల మరల విన్పిస్తుంటాయి] —తెర.

# అరిస్టాటిల్ రాజకీయాలు

శ్రీ చిత్తజల్లు వరహాలరావు

యూరపియన్ తత్వశాస్త్ర చరిత్రలో ప్లేటో పిదప అంతటి మహా మేధావంతుడుగాను, అగ్రగణ్యులైన ప్రపంచ తత్వవేత్తలలో ఒకడుగాను పరిగణింపబడే అరిస్టాటిల్, మ్యాసిడోనియన్ వలసరాజ్యమగు "స్టెగైరా"లో క్రీ. పూ. 384 లో జన్మించాడు. జన్మస్థానమునుండి విజ్ఞానకేంద్రమగు ఏథెన్స్ నగరానికి వలస వచ్చాడు. జీవితంలోని అత్యధిక భాగం, ఈ నగరంలోనే గడిపినాడు. ప్రపంచ ప్రఖ్యాత తత్వవేత్తగా పరిగణింపబడిన ప్లేటోకు ప్రథమ శిష్యుడుగావుండి ఆయనవద్దనే చదువు సాములు సాగించాడు అరిస్టాటిల్ విజ్ఞానఖని; మహా మేధావి.

ప్లేటోకి వున్నట్టి మహోన్నత ఊహాశక్తి ఈయనయందు గోచరించదు. "రాజకీయాలు" అనే ఈయన రచించిన ఉద్గ్రంథములోని ద్వితీయ భాగములోని విమర్శను చూచితే, ప్లేటోకు ఆదర్శవాదంపై ఎంతటి మక్కువ వున్నదో అంతటి అసహనాన్ని ఆదర్శవాదంపై అరిస్టాటిల్ కనపరచాడు. దోష భూయిష్టమగు విషయాలలో కూడా మంచిని చూడ గలిగిన శక్తి ఈయనలో గోచరిస్తుంది. ఈయన తన ఆదర్శాలను కేవల హేతువునే ప్రాతిపదికగా గైకొని, నిర్మించలేదు. మానవ సమాజంలోని వాస్తవిక సంఘటనలనే, తన తాత్విక విచారణకు పునాది రాళ్లుగా స్వీకరించాడు. నాటి గ్రీకు సమాజంలోని రాజకీయ జీవితాన్నిగూర్చి, ఈయన పాండిత్యమమోఘము.

రాజ్యాన్ని (State) గూర్చి, రాజ్యాంగ సంస్థలను గూర్చి, ఉన్నవాటిని ఉన్నపాళంగానే చర్చించాడు. రాజకీయ సమస్యలను కేవల రాజకీయ దృక్పథముతోనే పరిశీలించేవాడు.

వాస్తవిక జీవిత పరిస్థితులకు ప్లేటోనిక్ కమ్యూనిజం చాలా దూరంగావుంది, కాబట్టి, ప్లేటో యొక్క ఆదర్శప్రాయమగు రాజ్యాన్ని ఈయన తిరస్కరించాడు. తత్వశాస్త్రం, వ్యక్తికి సిద్ధాంత పరిజ్ఞానాన్ని ప్రసాదించగలదేగాని వాస్తవిక అనుభవాన్ని, జ్ఞానాన్ని, ప్రసాదించలేదనే కారణంవల్ల, సిద్ధాంత పరిజ్ఞానానికి తోడు మానవ జీవితానుభవముకూడా పాలకునకు చాల ప్రధానమని, ఈయన ఉద్ఘాటించాడు.

మానవునకు రాజ్యంయొక్క పరమావసరాన్ని గూర్చి, దాని స్వభావ స్వరూపాదులను గూర్చి, ఆయన ఈవిధంగా సూచించాడు: మానవ సమాజంయొక్క పురాతన రూపాలన్నీ సహజసిద్ధములైతే, రాజ్యముకూడా సహజ సిద్ధమే. కారణం? మానవ సమాజ పురాతన రూపములయొక్క పరిణామ స్వరూపమే రాజ్యము. ఎప్పుడు, ఒక వస్తువు సంపూర్ణంగా అభివృద్ధి నొందుతుందో ఆ అభివృద్ధినే, ఆ వస్తువుయొక్క సహజ స్వభావముగా పరిగణించాలి. కాబట్టి రాజ్యము ప్రకృతియొక్క సృష్టి. అందుకనే మానవుణ్ణి రాజకీయ జంతువుగా పరిగణించటము. మానవ సమాజంలో జీవించటానికి అశక్తుడైనవానిని, పశువుగానైనా తలచాలి; లేక, తనకు తాను స్వయం సమృద్ధుణ్ణని భావించేవానిని, దేవుడుగానైనా తలచాలి. కాబట్టి మానవునకు రాజ్యంయొక్క అవసరం ఎంతో వుంది.

ఐతే రాజ్యంయొక్క పాత్ర ఏమిటి ? రాజ్యం లేకుండా మానవుడు నాగరికత, సభ్యత, సంస్కృతులను కలవాడు కాజాలడు. రాజ్యం ఒక ఉపకరణ మాత్రమేకాదు. అది మానవునికి పరమావసరము. రాజ్యం మానవ జీవితధ్యేయం. అభ్యుదయానికి ప్రాతిపదిక. మానవ నాగరికతా సంస్కృతులకు మూలకందము. నైతిక జీవితాభివృద్ధియే రాజ్యంయొక్క ప్రధాన లక్ష్యము. నీతిశాస్త్రాన్ని, రాజకీయాలనుండి ఎట్టిపరిస్థితులలోనూ వేరుపరచరాదనే, గ్రీకుల రాజకీయసాంప్రదాయాన్ని అరిస్టాటిల్ కూడా అనుసరించాడు. ఒక్కమాటలో చెప్పాలంటే ఉత్తమజీవితసాధనయే రాజ్యంయొక్క ప్రధానలక్ష్యం.

ఐతే, ఉత్తమజీవితం అంటే ఏమిటి? నైతికము, ధర్మబద్ధము, మేధాసంపన్నమూ ఐన లక్ష్యాన్ని కలిగియున్నదే ఉత్తమజీవితం.

ప్లేటో తన రిపబ్లికులో పాలకవర్గానికి చెందిన తత్త్వవేత్తయైన పరిపాలకునకు సొంత ఆస్తిని నిషేధించాడు. తప్పుమార్గాలద్వారా ధనార్జనకు పూనుకొన్నపుడు తత్త్వవేత్తయైనపాలకుడు(*Philosopher-King*) శాసనాధికారాన్ని దుర్వినియోగం చేయవచ్చునే తలంపుతో సొంత ఆస్తిని నిషేధించాడు. మానవజీవిత వాస్తవపరిస్థితులను అనుభవాన్ని దృష్టిలో పెట్టుకొనక, ఆదర్శశిఖరాలకు అర్రులుచాచిన ప్లేటో వాదాన్ని అరిస్టాటిల్ త్రోసిపుచ్చాడు. సొంత ఆస్తిని కలిగి వుండాలనే మానవసహజమగు వాంఛ (*Propensity*) స్వభావంలోనే అంతర్గతంగా వుంది కలిగి వుండాలనే సహజమగువాసన (*Instinct*) మానవునికి పుట్టుకతోనే వుంది. ఈ కారణాలవల్ల అరిస్టాటిల్ ప్లేటో వాదాన్ని తిరస్కరించాడు. ఐనా అవినీతికర మార్గాలద్వారా ధనార్జనకు పూనుకొనటాన్ని పరిమితి రహితంగా ఆస్తిని కూడబెట్టడాన్ని ఈయన ఖండించాడు. అంటే మధ్యతరగతి వ్యక్తియొక్క మనస్తత్వాన్ని కలిగియుండటం రాజ్యానికి శ్రేయస్కరమని ఈయనతలంపు. అంతేగాదు. ఏ రాజ్యంలో మధ్యతరగతి అధికంగా వుంటుందో ఆరాజ్యంలోనే సంపూర్ణమగు శాంతి వర్ధిల్లుతుందని ఆయన అభిప్రాయము.

మమకారానికి, భార్యాబిడ్డలపై ప్రేమకు తావు లేకుండా చేసిననాడు పాలకులైన తత్త్వవేత్తలు ప్రభుత్వాధికారాన్ని దుర్వినియోగం చేయకుండా వుండగలరని ప్లేటో సూచించాడు. అందుచేత ప్లేటో కుటుంబాన్ని కుటుంబసంబంధాలను స్వార్థపరత్వానికి మూలమనేభావంతో నిషేధించాడు. సత్యంకోసం న్యాయంగా ధర్మచింతనతో వ్యవహరించాలని తత్త్వవేత్తయైన పాలకుని కోరాడు. కాని ఇది ఎంతవరకు సాధ్యం? కుటుంబాన్ని నిషేధించటం మానవస్వభావానికి విరుద్ధము. కుటుంబముమీద, భార్యాబిడ్డలమీదా వ్యక్తికివున్న మమకారానురాగాలను నిషేధించలేము గనుక, కుటుంబాన్ని నిషేధించలేము. అంతేగాదు. వ్యక్తిని ఉత్తమ పౌరునిగా తయారుచేసే శిక్షణ, కుటుంబములోనే తల్లితండ్రులద్వారా లభిస్తుంది. ఉత్తమపౌరసత్వశిక్షణాలయం కుటుంబసహితమగు గృహమని అరిస్టాటిల్ వాదన. అరిస్టాటిల్ బానిసను, బ్రతికివున్న సాధనమని వర్ణించాడు. మనకు, వెండి బంగారాలు, యిళ్లు వాకిళ్లు, సొంత ఆస్తిగా వుంటాయి. ఇవి ప్రాణంలేని ఆస్తి. కాని బానిస ప్రాణంవున్న ఆస్తి. ప్రకృతిలో సహజంగా రెండు తరగతులున్నవి — మేధావంతులు; సామాన్యప్రజలు. వివేక విజ్ఞానరహితులగు సామాన్యజనాన్ని మేధావంతులు పాలించాలి. ఈ పాలించే అవకాశాన్ని ప్రకృతియే కలిగిస్తోంది. కాబట్టే పాలకవర్గానికి చెందిన తత్వవేత్తలు ధర్మబుద్ధితో సామాన్యులను పాలించాలని ఈయన సూచన. అందుకనే, అరిస్టాటిల్ కాయకష్టంచేసి బ్రతికే వృత్తికారవర్గానికి (*Class of artisans*) పౌరసత్వాన్ని నిరాకరించాడు. రాత్రింబగళ్లు రెక్కలు ముక్కలుచేసుకుని బ్రతికే వృత్తికారులు, రాజ్యాంగ వ్యవహారాలలో పాల్గొనేటందుకు అవకాశం గాని, తీరిక సమయం గాని, ఆలోచించుకొనేందుకు కాలంగాని లేదు కాబట్టి వారికి పౌరసత్వ బాధ్యతలు, విధులు అప్పగించరాదు. నిరంతరము, వృత్తికారుడు, యంత్రంవద్దనే పని చేస్తాడు గాబట్టి యంత్రితుల్యుడవుతున్నాడు. వారి మనస్సులు యాంత్రికంగానే వుంటవి. యాంత్రికముగా తయారైన వ్యక్తికి పౌరసత్వబాధ్యతల నిచ్చినా, నిర్వర్తించలేడు. గనుక వానికి పౌరసత్వం నిరాకరించాలి.

అరిస్టాటిల్ ప్రకారం, ఏది ఆదర్శప్రాయమగు రాజ్యమో చూద్దాము. తత్త్వవేత్తయైన పాలకులు, వివేకంతో, మమకారానురాగాలకు దాసులవక, శాసనాధికారాన్ని దుర్వినియోగం చేయకుండా, సత్యంకోసం, ధర్మబుద్ధితో సమ్యగ్దర్శనోపాసకులై, రాజ్యాన్ని పాలించినపుడు, ఆదర్శరాజ్యము సిద్ధిస్తుందని, ప్లేటో సూచించాడు. శాసనాన్ని ఆధారం చేసికొని, ఏ రాజ్యము పరిపాలింపబడుతుందో దానిని ద్వితీయ ఉత్తమ రాజ్యంగా (*The second best state*) భావించాడు. అరిస్టాటిల్ ప్లేటో ఆదర్శ రాజ్యాన్ని తిరస్కరించి, ద్వితీయ ఉత్తమరాజ్యాన్ని అంగీకరించాడు. ఏ శాసనానికీ తలొగ్గని తత్వవేత్తయైన పాలకుడు, ఎంతటి వివేకవంతుడైనను, నియంతగానే పరిగణింపబడాలని అరిస్టాటిల్ వాదన. చట్టబద్ధ

మగు రాజ్యాంగమే ఈయన ఆదర్శప్రాయమగు రాజ్యము.

ఎంతటి ఉత్తమ రాజ్యంలోనైనా శాసనానికే అంతిమ సార్వభౌమాధికార ముండవలెను గాని, వ్యక్తికి మాత్ర ముండరాదు. మానవ స్వభావములో అంతర్గతముగా వున్న సహజచాంచల్యమును దృష్టిలో పెట్టుకొని, ఉత్తమరాజ్యముయొక్క ప్రధాన లక్షణముగా దీనిని భావించాడు.

చట్టబద్ధుడైన పాలకునకు, పాలితులకు మధ్య వుండేది, విశిష్టమగు సంబంధము ఈ పాలనలో పాలకుడు, పాలితులు, యిద్దరూ స్వతంత్రులుగానే వుండ గలరు. యజమాని తన బానిసలపై చలాయించు అధికారంవంటిది గాక, చట్టబద్ధుడగు పాలకుడు, ప్రజలపై చలాయించే అధికారము యింతకు భిన్నముగా వుంటుంది. భార్యాబిడ్డలపై కుటుంబ యజమాని చలాయించు అధికారానికి చట్టబద్ధ పాలకుడు చలాయించు అధికారానికి స్పష్టమైన భేదం వుందని గుర్తించాడు, అరిస్టాటిల్. ఈ రెండు అధికారాల మధ్యవున్న వ్యత్యాసాన్ని చూడలేకపోవటమే, ప్లేటో చేసిన తప్పు అని ఆయనభావన. ఈ వ్యత్యాసాన్ని గుర్తించి తన ఆదర్శ రాజ్యంలో ప్రజాస్వామ్య లక్షణాన్ని చొప్పించాడు. ఒక్క మాటలో చెప్పాలంటే, "సమానహోదా గలిగిన వ్యక్తులు ఉత్తమ జీవితాన్ని సాధించేందుకు ఏర్పరచుకొన్న సమాజమే" అరిస్టాటిల్ యొక్క ఆదర్శప్రాయమగు రాజ్యము.

ఈయన రాజకీయ తత్వశాస్త్రములో అతిప్రధానమగు ప్రశ్న ఒకటుంది—రాజ్యము ఉత్తమవ్యక్తిచే పరిపాలింపబడుట శ్రేయస్కరమా, లేక ఉత్తమ శాసనంద్వారా పరిపాలింపబడుట శ్రేయోదాయకమా? ఏ ప్రభుత్వము ప్రజల శ్రేయస్సుకొరకు పాటుపడ సిద్ధపడినదో, ఆ ప్రభుత్వము ఉత్తమ శాసనాన్ని ఆధారంగా చేసికొని పాలించును. శాసనంయొక్క సార్వభౌమాధికారమే, ఉత్తమ రాజ్యముయొక్క ప్రధాన లక్షణమని అరిస్టాటిల్ అభిప్రాయము. సదసద్వివేక సంపన్నుడగు తత్వవేత్తయైన పాలకుడు, ప్రజాక్షేమార్థమై నియంతగా వర్తించినప్పటికీ ఆ రాజ్యము ఉత్తమ రాజ్యముగా పరిగణింపబడజాలదు. కారణం? అంతిమ సార్వభౌమాధికారము శాసనమందు గాక, నియంతయైన వ్యక్తియందు మూర్తీభవించి యున్నది. ఉత్తమ వివేకవంతుడగు పరిపాలకునికి గూడా వుండని కేవల నిష్పక్షపాతబుద్ధి, ఒక్క శాసనానికే కలదు. అందువల్ల వివేకవంతుడగు పాలకుడైననూ, శాసనానికి దూరంగా వుండి పాలించ సాధ్యపడదు.

ఐతే, శాసనం అంటె ఈయన యిచ్చిన నిర్వచనం ఏమిటి? మానవ వాంఛలయొక్క ప్రభావాని కతీతమైన హేతువే శాసనం. ఏ రాజ్యమందు పాలితులు తమ విధులను సక్రమముగా నిర్వర్తించుదురో, దేనియందు పాలకుడు శాసనాధికారము ప్రకారము పరిపాలన సాగించునో, అట్టి రాజ్యములోనే, పాలక పాలితు లిరువురు సమానమగు ప్రతిపత్తిని (*Legal status*) కలిగియుండగలరు. పక్షపాతరహితమై, మమకారమున కతీతమైన శాసనాధికారం, న్యాయాధికారి యొక్క స్థానాన్ని అలంకరించకపోయినా, అతని న్యాయాధికారానికి, యీ శాసనాధికారము ఉత్తమమగు నైతిక పునాదిని యేర్పరచుతుంది. చట్టబద్ధమగు రాజ్యాంగమే వ్యక్తి స్వాతంత్ర్యాన్ని కాపాడగలదు. నియంతయొక్క పరిపాలనలో వ్యక్తిస్వాతంత్ర్యము గాలిలోని కర్పూరంలా హరించిపోతుంది.

ఐతే, చట్టబద్ధమగు రాజ్యాంగానికి నిర్వచనం ఏమిటి? స్వేచ్ఛగా జీవించే పౌరులయొక్క అంగీకార ముద్రతో నడిచే రాజ్యమే, చట్టబద్ధ రాజ్యాంగము. బలప్రయోగాన్ని ఆధారంగా చేసికొని ప్రజలను బానిసలుగా చేసేది, నియంతృత్వము. అరిస్టాటిల్ చట్టబద్ధమగు పరిపాలనకు మూడు ప్రధాన లక్షణా లుండవలెనని సూచించాడు. అవి యివి—

1. ఈ పరిపాలన ప్రజాక్షేమాని కనుగుణ్యంగా వుంటుంది. ఒకవర్గంయొక్క లేక వ్యక్తియొక్క ప్రయోజనముకొరకు ఈ పాలన కొనసాగింపబడదు. నిరంకుశుని దయా దాక్షిణ్యాలపై ఈ పాలన ఆధారపడదు.

2. నిరంకుశ శాసనాలవల్ల గాక ప్రజాక్షేమాని కనుగుణ్యములగు శాసనాలద్వారా ఈ పాలన జరుగుతుంది.

3. ప్రభుత్వ శాసనాలకు, కార్యకలాపాలకు తమ ఆమోదముద్రను వేయు పాలితులు ఈ పాలనలో వుంటారు. ఈ మూడులక్షణాలు, ఏ రాజ్యంలో వుంటవో దానినే చట్టబద్ధరాజ్యాంగమని పిలిచాడు.

శాసనాన్ని ఒక ఆటబొమ్మగాగాక మానవునకు నైతిక, నాగరికజీవితాన్ని ప్రసాదించే ప్రధాన సాధనమని ఆయన సూచించాడు. "మానవుడు శాసనం, న్యాయంనుండి వేరుపరచబడినపుడు అధమాధముడుగానూ, శాసనానుసర్యాంగా ప్రవర్తించునపుడు జంతువులన్నింటిలోకి ఉత్తముడుగానూ (*The Best of All Animals*) వుంటాడు" అని అంటాడు అరిస్టాటిల్.

వివేకవంతుడగు ధర్మశాస్త్రవేత్తయొక్క విజ్ఞానంకంటె మానవసమాజం శతాబ్దాల తరబడిగా సముపార్జించిన సామూహికవిజ్ఞానమే (*Collective Wisdom*) ఉత్తమోత్తమమని ఆయన అభిప్రాయము.

అభిప్రాయభేదాలెన్నో ప్లేటోతో ఏర్పడినా, వ్యక్తియొక్క నైతికజీవితాభివృద్ధినే రాజ్యం ప్రధానధ్యేయంగా యెంచవలెననే ప్లేటోయొక్క ఆదర్శానికిమాత్రం అరిస్టాటిల్ సంపూర్ణముగ అంగీకారాన్ని తెలిపాడు.

ఆనాడు గ్రీకు రాజకీయసంప్రదాయంప్రకారం రాజ్యముయొక్క జీవితమే దానియందు నివసించే పౌరులయొక్క సామాజిక జీవితంగా తలచబడేది. అంటే నాటిగ్రీకులు సమాజానికి రాజ్యానికీ మధ్య వుండే వ్యత్యాసాన్ని గుర్తించలేదు. కుటుంబానికి, మతానికిసామాజికజీవితానికి సంబంధించినప్రయోజనాలన్నీ 'సిటీస్టేట్'యొక్క ప్రయోజనాలతో ముడివడి యుండేవి స్వల్పమై స్వయంసమృద్ధముగా విలసిల్లిన నగరరాజ్యమే ప్లేటోకువలె అరిస్టాటిల్‌కుకూడా ప్రధానలక్ష్యం.

ఉత్తమ రాజకీయపరిపాలనలో యీ క్రింది మూడులక్షణాలుండాలని ఆయన సూచించాడు. 1. శాసనానికి లొంగివుండటము. 2 పాలితులకు స్వేచ్ఛ 3. పాలితులు ప్రభుత్వ కార్యకలాపములపై తమ ఆమోదముద్రను వేయుట ఇట్టి లక్షణాలున్న రాజ్యాల్ని ద్వితీయ ఉత్తమరాజ్యంగాగాక, ఆదర్శప్రాయమగు రాజ్యమని యెంచాడు. అరిస్టాటిల్ యిన్ని సూత్రాలను ప్రతిపాదించినా, ఆదర్శప్రాయమగు రాజ్యాన్నిగూర్చి గాక, రాజ్యంయొక్క ఆదర్శాలనుగూర్చియే చర్చించాడు. ఆయనయొక్క ఆలోచనా విధానానికి, ఆదర్శరాజ్య నిర్మాణము అంత అనుకూలమైన విషయం కాదు. ఆయన, స్వర్గలోకంలోనో, లేక మరే మానవాతీత లోకంలోనో వుండే ఆదర్శాలనుగూర్చి గాక, మానవుని ప్రత్యక్ష జీవితానుభవమునకు దగ్గరగా వుండేవానిని గూర్చే అధికంగా ఆలోచించాడు.

ఉత్తమ మానవుడు ఉత్తమ పౌరుడైయుండాలి, అంటాడు ఆయన రాజ్యము, పౌరుడు అవినాభావ సంబంధము కలిగియున్నవని అంటాడు. రాజ్యమునకు, సమాజమునకు మధ్య ఎట్టి వ్యత్యాసమును చూపలేదు. అంటే రాజ్యమునకు ఏది ధర్మమో, సమాజమందు నివసించు పౌరునకు కూడా అదే ధర్మమని అరిస్టాటిల్ అభిప్రాయము.

అరిస్టాటిల్ ప్రతిపాదించిన సూత్రాలన్నీ స్వయం సంపూర్ణ మనననికావు. వానిలో చాల దోషములున్నవి.

1. ఉత్తమ మానవుడు విధిగా వుత్తమ పౌరుడై యుండాలని భావించటము ఈయన చేసిన పెద్ద తప్పు. ప్లేటోకు గురువుగావుండి, విశ్వవిఖ్యాత తత్వవేత్తగా, ఉత్తమ తత్వార్థ ప్రతిపాదకుడుగా ప్రసిద్ధికెక్కిన సోక్రటీస్ యువకుల భావాలను విషపూరితం చేస్తున్నాడని నాటి "ప్రజాస్వామిక ప్రభుత్వం" ఘోరమైన శిక్షను వేసి చంపింది. ఆనాటి రాజకీయ వ్యవస్థలో సోక్రటీస్ ఉత్తమ మానవుడేకాని ఉత్తమ పౌరుడు కాడు. కారణం? శాసనానికి లోబడిన ఉత్తమ పౌరుడు కాలేదనే నాటి ప్రభుత్వం శిక్ష విధించింది.

ఐతే, ఉత్తమ పౌరుడంటే ఎవరు? రాజ్యాంగాన్ని ఏ వ్యక్తియైతే విశ్వసించి, అంగీకరించి, అనుసరిస్తాడో, పౌరబాధ్యతలను సక్రమంగా నిర్వహిస్తాడో, అతడే ఉత్తమ పౌరుడని నాడు భావించేవారు. కాని సోక్రటీస్ నూత్న తత్వార్థ ప్రతిపాదనకుద్యమించిన కారణాన, ఆయనకు విషం యిచ్చి చంపింది ప్రభుత్వం. కాబట్టి ఉత్తమ మానవుడు ఉత్తమ పౌరుడుగా కూడా వుంటాడని భావించటం పొరపాటు. అట్లే రాజ్యాంగాన్ని అంగీకరించి పౌరబాధ్యతలను నిర్వర్తించు పౌరుడు వేరొకడు వ్యక్తిగతంగా, అవినీతికరమగు జీవితాన్ని గడపుతూ దుర్మార్గుడుగా వర్తించవచ్చు. కాబట్టి, ఉత్తమ మానవుడు ఉత్తమ పౌరుడై యుండాలనే వాదన, ఉత్తమోత్తముడగు సోక్రటీస్ విషయంలోనే రుజువుగాకపోతే

సామాన్య వ్యక్తుల విషయంలో వేరే చెప్ప నక్కర లేదు. రాజ్యానికి, సమాజానికి మధ్య వుండే వ్యత్యాసాన్ని కూడా చూడలేకపోవటం అరిస్టాటిల్ చేసిన మరొక పొరపాటు.

2. రాజ్యాంగమంటే ప్రత్యేక జీవిత విధానమని ఆయన అభిప్రాయం. ఈ విధమగు దృక్పథము రాజ్యాంగమును గూర్చిన విశాల నిర్వచనాన్ని కుంటుపరచి పరిమితంచేస్తోంది. రాజ్యాంగమంటే రాజ్యంలో నివసించే పౌరుల యొక్క జీవితవిధానం మాత్రమే కాదు. ప్రభుత్వ వ్యవహారాలకు సంబంధించిన వివిధ కార్యకలాపాలు ఏవిధంగా జరుపబడవలయునో నిర్ణయించేది కూడా రాజ్యాంగమే. కాబట్టి రాజ్యమందలి ప్రభుత్వోద్యోగులు నిర్వర్తింపవలసిన విధులను నిర్వచించేది కూడా రాజ్యాంగమే. అందువల్ల ప్రభుత్వోద్యోగుల విధులను, కార్యకలాపాలను, నైతిక లక్ష్యాలనుండి విధిగా విడదీయాలి. అలా విడదీయకుండా సమ్మిశ్రితం చేశాడు అరిస్టాటిల్.

3. ఈయన ప్రకారం, ఉత్తమరాజ్యం శాసనానుగుణ్యంగా పాలింపబడాలి. శాసనాన్ని ఆధారంగా చేసికొని పాలింపబడేది ఉత్తమరాజ్యమని, భావించాలా? ఐతే, శాసనానికి అనుగుణ్యంగానే వుంటూ, శాసనాధికారాన్ని దుర్వినియోగం చేసే ప్రభుత్వంమాట ఏమిటి? (దక్షిణాఫ్రికాలోని మలాన్ ప్రభుత్వం శాసనంద్వారానే ఘోరమగు "మాలపల్లె చట్టాన్ని" ప్రవేశపెట్టి దారుణమగు జాత్యహంకారంతో ప్రవర్తిస్తోంది.) కాబట్టి శాసనానుగుణ్యంగా పాలింపబడే ప్రతి రాజ్యమూ ఉత్తమమైనదని భావించరాదు.

ఉత్తమమైన రాజ్యం 'అరిస్టోక్రటిక్' రాజ్యమని ప్లేటో తలచాడు. రాచరికము, (*Monarchy*) 'అరిస్టోక్రటిక్' రాజ్యము—ఈ రెండూ ఆదర్శప్రాయములగు రాజ్యములని అరిస్టోటిల్ సూచించాడు. ఈ రెంటిలో కూడా చట్టబద్ధమగు రాచరికమునకే (కాన్‌స్టిట్యూషనల్ మోనార్కి) ఆదర్శప్రాయమగు రాజ్యముగా విల్లసిల్లటానికి అధికంగా అవకాశాలున్నవని ఆయన తలచాడు. ప్రజాస్వామిక, ధనిక వర్గ (*Oligarchy*) రాజ్యములయొక్క పరస్పర విరుద్ధ లక్షణాలను పరిశీలించిన పిదప, ఆదర్శప్రాయమగు రాజ్యాన్ని గూర్చి విచారణకు ఆయన స్వస్తి చెప్పాడు. ఏ రాజ్యమైనా ఉత్తమ ప్రభుత్వ నిర్మాణానికి ఏయే విధానాలను అవలంబించాలి అనే విచారణలోనే అరిస్టాటిల్ తన తుది జీవితాన్ని గడిపాడు.

శాసనంయొక్క సార్వభౌమాధికారం; పౌరులకు స్వేచ్ఛాసమానత్వాలు; రాజ్యాంగబద్ధమగు పాలన; నాగరిక జీవితాన్ని గడపేందుకు వ్యక్తులకు శిక్షణ; యిత్యాది ఉత్తమ లక్షణాలను, సాధించేందుకే రాజ్యం వుండాలని, విశ్వసించాడు. దేవేంద్రలోకంలోనే వుండే ప్లేటో ఆదర్శాలవంటివి గాక, మానవమాత్రులకు సాధ్యమగు ఉత్తమ విధానాలనే స్వీకరించాలని సూచించాడు.

"అరిస్టాటిల్ దృక్పథంలో రాజకీయాలంటే ప్రభుత్వాధికారంకొరకు వర్గాలమధ్య లేక వ్యక్తుల మధ్య జరిగే పోరాటంమాత్రం కాదు. వ్యక్తి స్వేచ్ఛ కెట్టిహానీ కలుగకుండా రాజ్యంలో శాంతిభద్రతలు రక్షించటంమాత్రమే కాదు. స్వయంసమృద్ధమైన జీవితాన్ని గడపేందుకు వివిధకుటుంబాల సముదాయము తమ శ్రేయస్సుకొరకు ఏర్పరచుకొన్న సమాజమే రాజ్యము." (ఏ. డి. లిండ్సే)

ఒకవైపున నగరరాజ్యము (*City-State*) ను గూర్చి అరిస్టాటిల్ తన మేధాశక్తినంతటినీ వినియోగిస్తుంటే, మరోవైపున దిగంతవిజయయాత్రా సముపార్జితయశోధురీణుడు అలెగ్జాండర్ యొక్క సేనలు నగరరాజ్యంయొక్క ప్రాకారాలనే గాకుండా ఆ దృక్పథాన్నే మూలనుట్టం చేసివేయడం జరిగింది. సామ్రాజ్యవిస్తరణకొరకు అలెగ్జాండర్ 'సిటీస్టేట్' యొక్క పునాదులనే కదల్చివేసి ధూస్థాపితం చేస్తుంటే అరిస్టాటిల్ వంటి రాజకీయతత్వవేత్త నగరరాజ్యాన్ని నామమాత్రమగు బూటకపు స్వయంసమృద్ధితో పునరుద్ధరించాలని సుందరమగు స్వప్నం కన్నాడు. ఆ స్వప్నం వాస్తవికరూపాన్ని ధరించక పగటి కలగానే మిగిలిపోయింది. మరణించ సిద్ధంగావున్న నగరరాజ్యమనే ఈ రాజకీయసంస్థను ప్లేటో అరిస్టాటిలు లిద్దరూ జీవంపోయ యత్నించారు. ఫలితం శూన్యం.

సిటీస్టేట్‌కు దహనసంస్కారక్రియలను జరిపేందుకు ఏర్పాటుచేయబడిన ఉత్సవమును అనుసరించేవారుగానే వీరిద్దరూ చరిత్రలో మిగిలిపోయారు.

# పులి వేట

## శ్రీ యామిజాల శంకరం

దట్టమయిన, భయంకరారణ్యం. ఎత్తైన కొండలు, లోతైన లోయలు, వాగులు, వంతెలు. ఆ కీకారణ్యంలో కాలిబాట సన్నగా పోతూ ఉంటుంది; తిన్నగా కాకుండా కొన్ని పొదల్లోంచి, తుప్పల మధ్యనుంచి పోవడం కద్దు. అమావాస్య చీకట్లో అర్ధరాత్రి పోతూ ఉంటే పదిగజాల దూరంలో ఏముందో ఎలా గ్రహించలేమో, అలానే మనకు దగ్గరలో మసలే జంతువును కూడా కనిపెట్టడం కష్టం.

1952 వ సంవత్సరం నవంబరు ప్రాంతంలో సత్యం, సుందరం యీ దారివెంట వెళ్లుతున్నారు. సత్యం మంచి వేటగాడు. ముందు కోయదొర సామానుతో నడుస్తున్నాడు. వెనుక సత్యం లోడ్ చేసిన తుపాకితో నడుస్తున్నా సుందరానికి ఒక్కు ఒక్కుమంటూనే ఉంది. ఆ దారివెంట పోతూ ఉంటే అనేక దార్లు కలుస్తున్నాయి. బహుశా కోయదొరే లేకపోతే ఏదారిని పోవాలో నిర్ణయించటం చాలా కష్టం. దిట్టంగా ఉన్న దుప్పులు గుంపులు గుంపులుగా కనుపించాయి. కేరింతలు కొడుతూ కాలికొద్దీ పరుగెత్తుతున్నాయి అడవి గొర్రెలు. కొమ్ములతో తీగలను చిదిలించుకుంటూ దున్నపోతుల్లా దూసుకొని పోతున్నాయి—కణుజులు. మనుష్యుల్ని పసిగట్టి పలాయనం చిత్తగిస్తున్నాయి. మరొకనాడైతే కొన్ని హతమైయుండేవి. కాని యీ పోతున్న మనుష్యుల ఉద్దేశం వేరు

మారుమూల, కుగ్రామాల్లో, మనుష్యుల్ని చంపే పెద్దపులి (మానుపులి) విచ్చలవిడిగా విహరిస్తోంది. ఇంటికొకరో, యిద్దరో బెబ్బులి కాహుతౌతున్నారు. ఉదయం ఏడున్నర గంటలప్పుడు ఊరి దాపులోఉన్న పదేళ్ళ కుర్రాడిపై బడి, పట్టి తీసుకొనిపోతూ ఉంటే అంతా గొల్లుమన్నారు. ఈ విషయాలన్నీ తెలిసే కాబోలు ప్రభుత్వం దాన్ని చంపినవారికి బహుమతి యిస్తామని ప్రకటించింది.

అయితే బహుమతి దృష్టిలో పెట్టుకొని సత్యం బయలుదేరలేదు. కాకపోతే ఒక్క దెబ్బకే రెండు పిట్టలు రాలవచ్చు. తరుచు తను ఏ గ్రామాలకైతే వేట నిమిత్తం వెళుతూ ఉంటాడో ఆ గ్రామాల్లో యిది తిరగటం, ఇలాంటి పులిని చంపాలన్న అభిలాష...ఆ సరదాతో బయలుదేరాడు. సుందరానికి తుపాకి పట్టుకోవడంకూడా రాదు. ఇంటిదగ్గర కూర్చుని ఏవో కథలూ, గేయాలు రాసి పత్రికలకు పంపుతూ ఉంటాడు. అయితే అన్నీ తిరిగి తనవద్దకే చేరుతూ ఉంటాయి. దానికి కారణం యీ పత్రికా సంపాదకులు తను వెలిబుచ్చిన అమూల్యభావాలను గ్రహించలేకపోవడమే. అందుకని యిహ ఏపత్రికకూ పంపకూడదనుకుంటాడు. ఏదైనా కథగాని, గేయంగాని తిరిగి వచ్చినరోజున యీ ఉద్దేశ్యం ఎక్కువయి, యీ మాట పదిసార్లన్నా అనుకుంటాడు; కాని మళ్ళీ పంపుతూనే ఉంటాడు. ప్రస్తుతం ప్రకృతిమాత వొడిలో పరవశమౌదామని వద్దన్నా వినకుండా బయలుదేరాడు. తనిప్పుడు రచిస్తున్న ఖండకావ్యంలో ప్రకృతికి ప్రాధాన్యమివ్వాలని లోపలి ఉద్దేశం. బహుశా అతని మెదడులో పేజీలు నిండిఉంటాయి.

“అదేమిటి ? ... ఇక్కడ నీళ్లు జరజర పారుతున్నాయి. మరి యిందాకటి సెలయేటిలో ఎందుకు లేవు?...” పోతున్నవాడల్లా ఆగిపోయి సత్యాన్నడిగాడు.

“దీన్ని ‘తోగు’—అంటారు. దీనికి జల [ఊట] కొండపైన ఎక్కడో ఉంటుంది. ఇది మున్నూట అరవైఅయిదురోజులూ పారుతూఉంటుంది. ఇందాక మనం దాటివచ్చింది ‘వాగు’. అది వర్షపునీటికే పారుతుంది. పెద్దపెద్దవర్షాలు కురిశాయంటే చాలా ప్రమాదకరంగా ప్రవహిస్తుంది. వట్టిరోజుల్లో ఒక్క చుక్క ఉండదు.”

ఈ దృశ్యాలన్నీ చూస్తూంటే సుందరానికి ఎంతో ఆశ్చర్యంగా ఉంది. ఆ కుగ్రామాలను చూచి

విస్తుపోయాడు. ఒకేఒకయింటిలో ఓగూడెం ఉంది; దానికో పేరు. ఈ ఇళ్లుకూడా అక్కడో నాలుగు; ఇక్కడో ఎనిమిది. దానికో పేరు; దీనికో పేరు. వీళ్లు ఎట్లా ఉంటున్నారా అన్న అనుమానం పీడించిందతన్ని. 'మనుష్యులేనా!' అనుకున్నాడు కూడాను.

ఇవన్నీ చూచినతరువాత వాళ్ల ఆచారవ్యవహారాలనుగూర్చికూడా తెలిసికోవాలని బుద్ధి పుట్టింది. సత్యం చెప్పాడు: సమతలప్రదేశమే కాకుండా యీ ప్రజ కొండలమీదా, గుట్టలమీదా అక్కడక్కడచెట్లూ, పుట్టా కొట్టి, కాల్చి ఇంతస్థలం బాగుచేసి త్రవ్వి కొండజొన్న అవీ చల్లుతారట. దాన్ని 'పోడు' అంటారట. పోడు కింత శిస్తు అని కూడా ఉన్నట్టే జ్ఞాపకం.

ఆ పోళ్లను చూస్తూంటే మతులు పోతున్నాయి సుందరానికి. నట్టడివిలో పిట్టలపాలు కాకుండా డబ్బాలు మ్రోగిస్తూ, అడవిపందులు అంకురాలు తొలగించకుండా అరుస్తూ, క్రూరమైన అడవి జంతువులు విచ్చలవిడిగా తిరిగే స్థలంలో, ఆవంతయినా అధైర్య పడకుండా అదలిస్తూ, దయ్యాలకు భూతాలకు జడవకుండా, కూకమేరలో మనిషి లేకపోయినా, చూపుమేరలో యిల్లు లేకపోయినా, ఆ జొన్నమధ్య వేసిన మంచెమీద నిలచి కాచే ఆ అడవిమనిషికి—అడవి జంతువుకు, కేవలం ఆకారం, బలంలోమాత్రమే తేడా ఉంది. బ్రహ్మాండంగా పండితే రెండు బస్తాలు రాలుతాయా!

"వీళ్లూ మనుష్యులేనా!"—మరోసారనుకున్నాడు.

ఈ కొండ దాటితే వాళ్లు వెళ్లే గూడెం వస్తుంది. కాని యీ దారి కొండమధ్యగా పోతోంది. ఇక వేరే దారి లేదు. సరిగ్గా మధ్యలో రాతి నానుకొని పోతోంది దారి. కొండ ఖచ్చితంగా దిగిపోయింది. అమధ్య ఎట్లా దారిచేశారో! కోయదొర దాటిపోయాడు చాలా తేలిగ్గా. క్రిందికి చూస్తే కాలుజారితే శరీరంలో ముక్క కనుపించదు. దారి చాలా సన్నగా ఉంది. రాయి పట్టుకుంటూ గుండ్రంగా ఒక బారెడు దూరం నడవాలి. తరువాత మామూలుగా వెళ్లవచ్చు.

"వేరే దారి లేదా?...." అడిగాడు సుందరం.

"అబ్బో! ఆ దారిన పోతే అదనంగా అయిదు మైళ్ళు నడవాలి. అసలు అయిదు మైళ్ళే ఇట్లా ఉంటే, పదిమైళ్ళేమి నడుస్తాం?"

"నాకు చాలా భయంగా ఉంది."

"ఇంతేనా మరి?"

సత్యం దాటాడు కాని వళ్ళంతా ముచ్చెమట పోసింది. సుందరం మధ్యలో కెవ్వున అరచాడు, సత్యం గజ్జున వణకిపోయాడు—ప్రమాదం జరిగే ఉంటుందని.

"కళ్లు తిరుగుతున్నాయి."

"కళ్లు మూసుకో. క్రిందా, పైనా చూడకు. దారి చూచుకుంటూ వచ్చేయి. నా టార్జానుకిదోక లెఖా, భయపడకు. ఎందుకురా వణకుతావ్. అమ్మయ్యా! చుట్టుఅయినా యీ దఫా ఆదారినే పోదాం."

ఊరిబయట నిర్మించబడిన రహదారి బంగళాలో దిగారు. దిగీదిగగానే పటేలుకూతురు 'బోడి'-పరుగెత్తుకుంటూ వచ్చింది. ఒక గ్రామానికి గాని, రెంటికి గాని ఒకమునసబు ఉంటాడు. అతన్ని పటేలని పిలుస్తారిక్కడ. అతనే కులపెద్ద. అతని మాట అంతా వింటారు.

"మా సత్తెం దొరొచ్చిండు"-అంటూ చప్పట్లు కొడుతూ, సంతోషంతో గెంతుతోంది. సత్యం నవ్వాడు. బొద్దుగా గుండ్రాతికి కాళ్లు వచ్చినట్లు భూమికి జానెడెత్తున్న ఆ కోయపిల్ల అలా కేరింతలు కొడుతూఉంటే సుందరానికి చూడ ముచ్చటగా ఉంది. చిలిపిగా నవ్వాడు.

"బోడీ"—సత్యం పిలచాడు.

"ఏం దొరా..."

దీనిపేరు 'బోడి'ట. అనుకున్నాడు సుందరం. అందుకే గాబోలు నెత్తిమీద జుట్టులేదు.

"ఏమిటే విశేషాలు?"

పులివల్ల ఎన్ని యిండ్లు ఎంత శోకసముద్రంలో మునిగి ఉన్నాయో, ఎంతెంతమంది ఎలా చచ్చారో, ఈ విషయాలన్నీ చెబుతూ ఉంటే, ఆ అమాయకురాలికి దుఃఖం పొంగి పొరలింది. తన అన్న 'ఈరడు' ఎట్లా చచ్చాడో కూడా వివరించింది. దీన్ని ఎట్లాగైనా చంపమని ప్రార్థించింది. ప్రొద్దున్నా ఎండ పాకేముందు, సాయంకాలం చీకటిపడినాక ఎవరూ ఇల్లు వదలి బయట అడుగుపెట్టటం లేదట. పగలు రాదుగాని అప్పుడప్పుడు రాత్రిపూట గూడెంలోకి కూడా వస్తోందట.

బోడి జాగా అంతా చిమ్మింది. నీళ్లు చల్లి, ముగ్గులు పెట్టింది. నీళ్లు తెచ్చి; కుండలన్నీ నింపింది. ఎంతో సంతోషంతో ఆ పనులన్నీ చక్కగా, శుభ్రంగా చేసింది.

"నిన్నెవరో ఎత్తుకుపోతారు లే!..."—హాస్యం పట్టించినట్టు అన్నాడు సత్యం. బోడికింకా పెండ్లి కాలేదు; కాని అలా కనిపించదు. సంప్రదాయం ప్రకారం పెండ్లినాడు పెండ్లికొడుకు పెండ్లికూతుర్ని ఎత్తుకొని పోతాడు.

"పో దొరా!" -కిలకిల నవ్వుతూ పరుగెత్తింది.

"పిచ్చిది. పట్టి అమాయకురాలు"—అన్నాడు సత్యం.

వ్యంగ్యంగా నవ్వాడు సుందరం.

"ఎందుకలా నవ్వుతున్నావు."

చాలా సేపు గడచిపోయింది.

"అభాగ్యులు"—మెల్లిగా మొదలు పెట్టాడు సత్యం. "బోడివిషయంలో చూడు. ఇదివరకు నేను వచ్చినప్పుడు చాలా అసహ్యంగా ఉండేది. ఆరోగ్య సూత్రాలన్నీ చచ్చేటట్టు చెప్పాను. కనీసం నేను వచ్చినప్పుడైనా రెండుపూటలా స్నానం చేయమని ఉతికినగుడ్డలే కట్టుకోమని బ్రతిమాలాను. ఆఖరికి భయపెట్టాను. ఇప్పుడు కొంచెం నయం.

"చూడు! అనాకారి కాదు," అందకత్తె అసలే కాదు. నల్లటిరంగు; కాని ఆరంగులో అందం లేదు, కొట్టవచ్చినట్లుంటుంది. పెద్దకండ్లు. కాని ఆకండ్లలో చిలిపితనం లేదు, అమాయకత్వముంది. ముఖంలో లావణ్యం లేదు మొరటుతనముంది. అది వాళ్ళకందరికీ సహజంగా ఉంటుంది. దృఢమైన కండలు తిరిగినశరీరం. అందులో నువ్వు వర్ణించే వంపుసొంపులు, తళుకు బెళుకులు లేవు. అయినా బెర్నార్డుషా నాటకంలోలా తీసుకొనిపోయి, పోషణచేసి, బోధించి నేర్పి నాలుగు వస్త్రాలు తగిలించి మన సమాజంలో వదిలేస్తే... మగాళ్లు బిత్తరపోరంటావా?"

రెండు సిగరెట్టూ కాల్చబడుతున్నాయి. కొంచెంసేపు నిశ్శబ్దంగా గడచిపోయింది. దమ్ముపీల్చి, పొడిదులిపి, పొగ వదులుతూ సత్యం మళ్ళీ మొదలు పెట్టాడు:

"మనసమాజంలోలా వాళ్లల్లో యీ అనుమానాలకూ వాటికి తావులేదు. ఏకపత్నీత్వం, ఏకభర్తృత్వం వాళ్ళల్లోనూ ఉంది. భార్యచాటున భర్త, భర్తచాటున భార్య నీచానికి పాల్పడి చెడుతిరుగుళ్లు తిరగటం లేదనే చెప్పాలి. నాగరికత శిఖరాగ్రానికి చేరబోతున్న యీ రోజుల్లో మనం ఏది కావాలని చట్టాలు, కోర్టులు నిర్మించుకుంటున్నామో, ఆ విడాకులు వీళ్ళల్లో అనాదిగా వస్తున్న ఆచారం. పడనప్పుడు కులపెద్ద విధించిన కులతప్పు చెల్లించి, మరో భార్యనో, భర్తనో కుదుర్చుకునే అవకాశం వాళ్లకుంది. అంతేగాని మనలాగా ఇద్దరు మాట్లాడితే మాటలకు అపార్థాలు, పెడర్థాలు తీయటం వీళ్లల్లో లేదు. అసలలాంటి దురూహలు వాళ్ళకు కలుగవుకూడాను.

"అయితే అవకాశం ఉందికదా అని రూపాయిని నూటతొంభైరెండు పైసల్లోకి మారుస్తారనుకుంటున్నావుకదూ ... చాలా పొరపాటు. మారు మనువు (మరో పెండ్లి) అసలు లేకుండానే జీవితాలు కట్టుబడి ఉన్నవాళ్లు ఉన్నారు. చేసుకున్నా తప్పులేదు గాని, ఒకటి రెండుకంటె ఎక్కువ మారుమనువులసలు ఉండవు."

సాయంకాలం కావడంమూలాన కాఫీ వేళయింది. సత్యం తనతో తెచ్చుకున్న బిస్కట్లు, కేకులు, రొట్టెలు—కొన్ని బోడికి కూడా పెట్టాడు. కాఫీకూడా యింత పోశాడు. బోడి ఆనందానికంతు లేదు.

"బోడీ!..."

"ఏం దొరా!......"

"నువ్వు కాస్త గెంతటం తగ్గించి, నడవటం నేర్చుకో."

బోడి నడుస్తున్నా గెంతినట్లుంటుంది. ఇద్దరూ విరగబడి నవ్వారు. బోడి సిగ్గుతో బయటకు పరుగెత్తింది.

"నేను వస్తే బోడి యిల్లే మరచిపోతుందిరా సుందరం!...తియ్యతియ్యటి పదార్థాలు దానికి దొరుకుతా యక్కడ. వాళ్ళెప్పుడైనా యిలాంటివి తిన్నారా, ఏడిశారా. చింతగింజల అంబలి, మామిడి జీళ్ళ అంబలి, ఇలాంటి అసహ్యకరమైన పదార్థాలతో పొట్ట నింపుకుంటారు. ఇక ఎండాకాలం

వచ్చిందా మామిడిపండ్లరసం త్రాగి ఉంటారు. ఆ పండ్లు చాలా చిన్నవి. అందుకే 'గొజ్జిమామి' అంటారు. ఇహ కల్లు ముంతెడు ముంతెడు తాగి ఉంటారు

"నీ కింగ్ గో ఉందికదూ. మరి అదే వాళ్ళ జీవితం. కొత్తివాళ్లకిదంతా ఆశ్చర్యంగాను, అతిశయోక్తిగాను ఉంటుంది."

పులిజాడలేమైనా దొరుకుతాయేమోనని పక్కగా ఉన్న చిన్నగుట్టకు బయలుదేరారు.

ఊరిచుట్టూ చిట్టడవి. అనేక రకాల చెట్లు, తీగెలు, పూలచెట్లు, పొదరిండ్లు, పెద్దపెద్ద వల్మీకాలు చిన్నచిన్న నీటిమడుగులు. సంధ్యాకిరణాలు ప్రతి దానిమీద పడి ప్రతిబింబిస్తున్నాయి.

ఆచిన్నకొండ కొంచెం పైకి ఎక్కారు. మాటలు వినికిడివల్ల మీదపడే పులివాత తప్పించుకోవడానికి సత్యం తుపాకి లోడుచేసి దగ్గర ఉంచుకున్నాడు.

అక్కడినుంచి చూస్తే దూరదూరంగా ఉన్న రెండు గూడాలు కనిపించాయి. అల్లంత దూరంలో ఎత్తైన కొండ ఒకటి కనిపిస్తోంది. చల్లని గాలి వీస్తోంది. నువ్వు, కంది, జొన్న అక్కడక్కడా చిన్న చిన్న మళ్లలా కనిపిస్తోంది. దూరాన పశువులను మళ్ళించుకొని యిళ్లకు వస్తున్నారు—కాపరులు.

దూరాన ఎండిపోయిన వాగులో ఇసుకతిన్నె మీద, అస్తమించే అవతారమూర్తికి అంకితంచేస్తూ తన పింఛం విప్పి ఆనందోత్సవంచేస్తూంది నెమలి. ప్రక్కనే ఉన్న నెమలిపెట్ట (ఆడది) నెమలి విడిచే ఆనందబాష్పాలను అమృతబిందువుల్లా ఆస్వాదిస్తూంది. అదే వాటి సమాగమం. కవి హృదయం పులకించింది.

ఇళ్ళకు మళ్లారు.

తిరిగి వచ్చేసరికి వంటవాడు చలపతి వంటా, అన్నీ చేసి, ఆరుబయట మంచంమీద వెల్లకిలా పడుకొని, "జగమే మాయా"—సొంతరాగంలో ఆలాపిస్తున్నాడు. వీళ్లు యిట్లా వెళ్ళటం, చలపతి అట్లా వచ్చి ఉండటం జరిగింది. వంట సామానుతో చలపతి, మరో కోయదొర వెనుక దిగబడిపోయారు.

చలపతి మహా చిలిపి. తన గొంతుగురించి, పాట గురించి, ముఖ్యంగా తన్నుగురించి బ్రహ్మాండంగా కోసిఉంటాడు. అందుకనే కాబోలు బోడి నోరు తెరచుకొని వింటూ కూర్చుంది.

భోజనాలయ్యాయి. ఇంతట్లోకే బయట, డప్పుల మోతలు మొదలయ్యాయి. కెవ్వున ఉండుండి అరుస్తున్నారు.

సుందరం అడిగాడు "ఏమిటది?..."

"కొలుపు లెండి. మీకు తెలవదా?..."—చలపతి.

సత్యం అందుకున్నాడు. "రారా—చూపిస్తాను. చాలా గమ్మత్తుగా ఉంటుందిలే. వాళ్లు ఎదురుగూ ఉంటే చూచి భయపడకేం. ఏం ఫరవాలేదు.."

"ఛా! ఛ! నాకేం భయంరా."

"అల్లానే అను. తరువాత తెలుస్తుంది."

ముఖానికి యింతంత కుంకుమ పూసుకుని, చేతిలో వేపమండలు పట్టుకొని, అప్పుడప్పుడు పసుపు పైకి విరజిమ్ముతూ, కెవ్వు కెవ్వున గావుకేకలు పెడుతూ, గెంతుతున్నారు కొందరు. ఊరిమధ్య రావిచెట్టు క్రింద జరుగుతోంది కొలుపు. చుట్టూ జనం ఉన్నారు. రెండుమూడు దివిటీలు వెలుగుతున్నాయి. చేతిలో పెట్టిన పసుపు, వేపఆకులతో కలిపి, కొందరు పంచదారలా బొక్కేస్తున్నారు.

సత్యం చెప్పాడు. మాలక్ష్మమ్మ, ముద్దిరావమ్మ, వనం పోతురాజు, పీనుగుల మల్లయ్య, దండుమారి—ఓ నూటొక్క దేవరట అవి మనుష్యులమీద ఇలా ఆవేశిస్తాయట.

మట్టి ముంతలో యింత నిప్పు ఉంది. గణం పూనగానే అందులో యింత సాంబ్రాణివేస్తే, ఆ పూనిన వ్యక్తి ఆ పొగను ఎగపీల్చి వదిలేస్తున్నాడు.

చలపతి చెప్పాడు. మధ్యాహ్నందగ్గరనుంచి మొక్కుబడులన్నీ చెల్లించుకోవడం అయిపోయిందట. దున్నపోతులు, మేకలు, గొర్రెపోతులు ఎన్నో ఎగిరిపోయాయట. ఇహ కోడిపిల్లలు లెఖలేదట. ఈ విధంగా యీ కొలుపు తెల్లవార్లూ సాగుతుంది.

"వీళ్లు మనుష్యులేనా! ."—మరోసారి అనుకున్నాడు సుందరం. తిరిగివచ్చి పెడ్డింగుపరచి ముసుగు తన్ని పడుకున్నాడు.

జాతర చాలారోజులుంటుంది...కొలుపు ఒక్కరోజు.

* * * *

ఆతరువాత మూడురోజులు గడచిపోయాయి. పులిజాడ జవాబులేదు. అందువల్ల ఎక్కడ మాటు

కష్టాలలో అర్థం కావటం లేదు. కోయవాళ్లు చెప్పిన స్థలాలన్నీ వెతికారు. ఏమీ లాభం లేకపోయింది. చికాకుపుట్టింది. తెచ్చుకున్న పదార్థాలయిపోయాయి.

రాత్రి సగం జరిగింది. బ్రహ్మాండమైన కోలాహలం వినిపించింది. త్రుళ్లిపడి లేచారిద్దరూ. తుపాకి లోడు చేసుకొని, బ్యాటరీలైట్లు వేసుకొని గబగబా బయలుదేరారు. వీధుల్లో ఎక్కడా ఎవరూ లేరు. ఇళ్ళల్లోంచే గొల్లుమని గోల వినుపిస్తూంది. పరిసరాలు జాగ్రత్తగా చూచుకుంటూ అసలు యింటి ముందుకొచ్చారు—ప్రమాదం గుర్తించకుండా.

వాళ్లు చెప్పినదాన్నిబట్టి విషయమిది: ఒక పూరి పాక. చాలా చిన్నదికూడాను. ఆ పాకలో ఉన్న ఒకే ఒక వెలుగు — చలిమంట. భార్యా, భర్త, పసి — ముగ్గురే కాపురం. పెద్దపిల్లాణ్ని వెనక పులి తినేసింది.

చంటిపిల్లాడు లేచి ఏడవటం మొదలు పెట్టాడు. తల్లి పిల్లాణ్ని వళ్లో కూర్చోబెట్టుకుంది అందుకోసం గాను కాళ్లు చాచి, ఎడమకాలుమీద కుడికాలుంచి పాలిస్తూ, ఆ కుడికాలూపుతూ చలి కాగుతోంది. భర్తా, తనూ యాదాలాపంగా ఏదో మాట్లాడుకుంటు న్నారు. అయితే యీవిడ కాళ్లకు యించుమించు తగులుతూ ఉన్నట్టుగా ఉంది దడి (పాకచుట్టూ గోడమాదిరిగా తడిక అల్లినట్లు అల్లుతారు. మట్టిమేగని దాన్ని దడి అంటారు).

వీళ్ళ మాటల సవ్వడి విని ఎప్పుడు వచ్చిందో, వచ్చి దడినానుకొని కూర్చుంది—అవలప్రక్క పెద్ద పులి. ఈవిడ కాలుకు పులికి ఉన్న మధ్య దూరం అడుగు, అడుగున్నర. ఆ కాలుమీద దృష్టి నిల్పి, తదేకంగా చూస్తూ కూర్చొని ఉండిపోయిందా పులి పిల్లాడు నిద్రపోయాడు. తనూ పడుకుందామని ఆవిడ కాళ్లు ముడిచింది. ఉన్న ఒకే ఒక అవకాశం జారిపోవడంవల్ల కోపంతో గర్రుమంది.

త్వరలో కనిపెట్టగల కోయవాళ్ళు పసిగట్టి అర్చారు. దడిని రాసుకుంటూ చిట్టడవిలోకి పోయింది.

సత్యం లైటువేసి చూచాడు. రోజూ చలిమంట బూడిదనంతా పాకప్రక్క పోయటం అలవాటు. ఆ బూడిదలో కూర్చుంది. ఇంతంత పాదాల గుర్తులు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"ఎందుకిలా కూర్చుని ఉందంటావు?" అడిగాడు సుందరం.

"ఎవరైనా పొరబాటున బయటకు వస్తే పైనబడి చంపివేయటానికి. మరి దాని కవకాశం ఏది?..."

వెంటాడుదామన్నాడు సత్యం. వద్దన్నాడు సుందరం.

*   *   *   *

ఉండటమా, వెళ్ళటమా అన్న సందిగ్ధంలో పడ్డారు. దానికితోడు ఇవ్వాళ వాళ్లు అన్నం లేక చిక్కుడుగింజలు ఉడకబెట్టుకొని తినవలసివచ్చింది. దగ్గరలో పట్నం లేదు. అయిదారు మైళ్ళు నడచి, ఎనిమిది మైళ్ళు బండిమీద వెళితేగాని రాదు. మనిషిని పంపినా రెండు రోజులు పడుతుంది.

నాలుగైదు రోజుల్లో తిరిగివచ్చే నిర్ణయం చేసుకొని సామాను లెత్తించారు.

బోడి కనబడలేదు. ప్రొద్దున్నా తుడిచి, నీళ్లు చల్లి ముగ్గులు పెట్టి వెళ్ళిపోయింది. మళ్ళీ రాలేదు. బోడికి ఏదైనా యిచ్చి వెడదామని సత్యం అనుకున్నాడు. "రాకపోతుందా, వెళ్ళేలోపల—" అనుకున్నాడు. తుపాకి లోడుచేసుకొని, ఇన్ని తూటాలు దగ్గర పెట్టుకున్నాడు.

ప్రొద్దున్న ఎనిమిది గంటలు కాబోతుంది. సామాను లెత్తబోతున్నారు. ఉన్నట్టుండి "సత్తెం దొరా!"—అంటూ కేకలతో వచ్చిపడ్డారు జనం. సుట్టుప్రక్క చేలో కందిచేను కోస్తున్న కోయలమీద పడిందట పులి. ఇహ కడమ వివరాలడగకుండా యిద్దరూ పరుగెత్తారు.

చేలో జనం హడలుతున్నారు. రక్తం చారలు అక్కడక్కడ కనుపిస్తున్నాయి.

"పశేలు కూతుర్ని పట్టకపోయిందె......" అన్నాడో కోయ.

"బోడినా!" — ఇద్దరి ముఖాలు ఒక్కసారి వివర్ణమయ్యాయి ఆశ్చర్యంతో. ఏదో తెలియని భయంతో అడిగారు. కాళ్లు తడబడ్డాయి.

నిశ్చేష్టులై నిలుచుండిపోయారు. రైలు పెట్టెల్లా, తెరమీది దృశ్యంలా ఏదో కంట్లోనుండు దొర్లిపోతోంది. కిలకిలా నవ్వుతోంది బోడి. అమాయకురాలు. ఇన్ని రోజులనుంచీ ఏ వ్యక్తిని వేళాకోళం పట్టిస్తూ,

# పులి వేట

పరిహాసాలాడుకుంటూ, కాలం వెళ్ళబుచ్చారో, ఆ వ్య లేదు. బోడిమీద యిద్దరికీ అభిమానం ఎక్కువ.

ఏదో అపురూపమైంది పోయింది. ఒక వ్యక్తి గాని, ఒక సంఘటనకాని మనస్సుకు నచ్చుతుంది. హృదయంలో చాలా దగ్గర స్థానం ఏర్పరచుకుంటుంది. అప్పుడా వ్యక్తిమీద విపరీతమైన అభిమానం ఏర్పడుతుంది.

సత్యంకండ్లల్లో రౌద్రం తాండవించింది. మాటైనా లేకుండా ముందుకు సాగిపోతున్నాడు.

"ఎక్కడికిరా?" అడిగాడు సుందరం.

"రా రా" అంతే. రెండో మాట లేదు. సుందరం చేసేదిలేక తనూ వెంటపడాల్సి వచ్చింది.

సత్యమయితే వెళ్ళిపోతున్నాడు — దూసుకుంటూ. అతనిదగ్గర ఆయుధముంది. తనదగ్గర లేమీ లేదు. ఉన్నా పేల్చటం రాదు. నట్టడవిలో ప్రవేశించినప్పుడు, నలుమూలలా అతి జాగ్రత్తగా చూసేమని సత్యం చెప్పాడొకనాడు. మాట్లాడకూడదు. కనీసం చప్పుడయేటట్టుగా కూడా నడవకూడదు. సమస్త భారం సత్యంమీద వేసి బయల్దేరాడు సుందరం.

హృదయమంతా బిక్కు బిక్కుమని కొట్టుకుంటోంది. ఎప్పుడు, ఎక్కడ, ఎట్లా మృత్యువు ఎదురౌతుందో చెప్పటం కష్టం. చాలా దూరం రానే వచ్చేశాడు. అయినా తనకీ వేట ఏమిటి? సరదా పుట్టి తను వచ్చాడే అనుకో! ఏమీ తెలియని అమాయకుడిని యిట్లా తన వెంట తీసుకొని పోతున్నాడే.

నేలమీద రక్తపుచార నానవాలు చేసుకుని సత్యం నడుస్తున్నాడు. ఆగిపోయాడు—ఒకచోట. నేలమీద చూచాడు సుందరం. ఇంత రక్తం పోసినట్లుగా ఉంది. నేలంతా అరంగుళం లోతున తడిసి ఉంది. బహుశా అక్కడ పులి మొదటిపట్టు వదిలి, మరో ఘట్టి పట్టు పట్టి ఉంటుం దనుకున్నాడు.

ఆపైన సత్యం చాలా జాగ్రత్తగా పరిసరాలు, నేల చూస్తూ నడుస్తున్నాడు. తన కేమీ అర్థం కావడంలేదు. అయినా తనూ చూస్తున్నాడు. ఎక్కడ, ఎంతదూరంలో, ఎలాంటి శబ్దమయినా, గుండె ఝల్లుమని, వళ్ళంతా దిగచెమటలు కక్కుతోంది. "ఈవాళ నా జీవితానికి ఆఖరి రోజు"— ఈమాట తనిప్పటికి ఎన్నోసార్లనుకున్నాడు.

నేలమీద దేన్నో యీడ్చుకొనిపోయినట్టుగా అక్కడక్కడ చారలు కనుపించాయి. తన కేం అర్థం కావడంలేదు. ఇంకొంత దూరం పోయారు. గట్టి నేల—ఆచారలూ లేవు. సత్యం పెదవి విరిచాడు.

చుట్టూ దట్టమైన అడవి కీర్రుమంటోంది. పక్షులన్నీ తెగ గోల చేస్తున్నాయి. ఎక్కడినుంచి వచ్చారో, ఎక్కడికి పోవాలో, ఎట్లా పోతే మళ్ళీ యథాస్థానానికి చేరుకుంటారో—సుందరానికంతా అగమ్యగోచరంగా ఉంది. ఇంకా చేరుకోవడమేమిటి? బయటపడటం అసంభవంగా భావించాడు. పొరపాటున బయటపడటమంటూ జరిగితే పునర్జన్మ ఎత్తినట్లే. అయినా యింటిదగ్గర కూర్చుని ఏవో కథలు, గేయాలు రాసుకునేవాడికి తనకీ వేట ఏమిటి?

"ఇవ్వాళ ఆఖరురోజు" — ఈమాట తలపుకొచ్చినప్పుడల్లా గజ్జున వణుకుతూ, మనిషి తల్లడిల్లి పోతున్నాడు.

వంగి క్రింద ఓ గాజుముక్క పైకి తీశాడు. కాసేపాలోచించి అవతల పారేశాడు. సుందరం ఆ అమ్మాయిగాజు ఒకటి ఇక్కడే పగిలిఉంటుందని ఊహించగలిగాడు.

ఇంకొంచెం ముందు రాతి నేల; అన్నీ చిన్న చిన్న గుబురులు. ఆ పొదల్లో ఎక్కడుందో?

ఏంపసిగట్టాడో తెలియదుగాని, ఎదురుగుండా ఉన్న ఓ నిలువెడెత్తురాయి చాటుకు చటున సత్యం తప్పుకొని కొంచెం వంగి చూస్తున్నాడు. తనూ సత్యం ప్రక్కగా వరిగాడు. శరీరమంతా కంపమెత్తిపోతోంది. కొలువులో దేవతలు ఆవేశించిన మనుష్యులు జ్ఞాపకానికొచ్చారు. నాలుక పిడచగట్టింది. లాలాజలం నాస్తి. వద్దనుకున్నా దుఃఖం ఆగటంలేదు. అరుద్దామంటే గొంతు రాదు. సర్వావయవాలు స్వాధీనం తప్పాయి.

సత్యం వ్రేళ్లు మీటమీద ఉన్నాయి. జోడుగుండ్లతుపాకి. ఏమాత్రం అవకాశంచిక్కినా సత్యం వదలుకునేటట్లు లేడు.

కాసేపట్లా కూర్చున్న సత్యం మళ్ళా లేచాడు. తనూ లేచాడు. ముందుకు పోతున్నాడు సత్యం. తనకు గుండె ఆగినంతపనయింది. ఏదో అనుమానం తగలబట్టే కదూ సత్యం కూర్చుంది. చుట్టుప్రక్కల ఎక్క

డయినాఉంటే తమపనేం కావాలి. తనకు వేరే దిక్కేమీ లేదు. గబగబ పాకుదామన్నా దగ్గరలో మంచి చెట్టే లేదు. తను సొంతం సత్యంమీద ఆధార పడ్డాడు.

ఇంతలో ఓ చిన్న పొదనుంచి యింత వెంట్రుకల తుట్టె బయటకు తీశాడు సత్యం. చేత్తో 'ఇల్లా పోయింది' అన్నట్టు సైగచేశాడు. తను తల వూపు కున్నాడు. బహుశా ఆ పొదలోంచి శవాన్ని లాక్కు పోయి ఉంటుంది. అందుకే వెంట్రుకలు వాటికి పట్టాయి.

సత్యం ఆ తుప్పలు దాటిపోతూ ఉంటే, అతని మొండిసాహసానికి తనకి చిరాకెత్తింది. అమాంతం ఎగిరి పులిలా మెడపట్టి పిసి పారేద్దామన్నంతకోపం కూడా వచ్చింది. కాని...

గరువు నేల; తను మొట్టమొదట ఏ చారలైతే నేలమీద చూచాడో, అలానే ఏదో యీడ్చినట్లు చార కనుపిస్తోంది. సత్యం గబగబ నడచాడు. తనూ నడిచాడు.

సత్యం యింతకుముందు యింత వేగంగా నడవ లేదు. బహుశా అతను చెప్పినవిషయం అతన్నే మరచిపోయి ఉంటాడు. మనుష్యునికంటె మృగం చాలా తెలివైంది. మన్ని ఎవరైనా చప్పట్లు చరిచి పిలిస్తే అసలు దిక్కు వదిలి, పదిదిక్కులు చూస్తాం. మృగాలట్లా కాదు. అసహజమైన శబ్దం ఏదన్నా వచ్చిందా, ఏదిక్కునుంచి వచ్చిందో, ఆ దిక్కుకు అన్నీ ఒక్కసారిగా తిరిగి చూస్తాయి.

కొంచె దిగిపోయింది. మూడు దార్లు కలిశాయి. అక్కడో చిన్న చెట్టుంది. ఇంకొస్త పయిన వాగు. మధ్య రాళ్ళగుట్ట. చుట్టూ జిన్నెపొద. అందులో ఉంది శవం. పులి లేదు.

పొట్ట బాగా ఉబ్బింది. లోపల కూడుకున్న గాలి అప్పుడప్పుడు 'గస్'న నోటిద్వారా వెళ్ళిపోతోంది. ఉండి, ఉండి ముక్కుగుండా నల్లని రక్తపు బుడగలు తేలి 'టప్పు'న బ్రద్దలవుతున్నాయి. సర్వావయవాలు కొట్టుకొనిపోయి, కొన్ని చోట్ల ఎముకలు కూడా బయటబడ్డాయి. బట్టలు పేలికలైపోయాయి. నిశ్చే ష్టులై కూలబడిపోయారు. బోడి ఊరికి రెండుమైళ్ళ దూరాన, వాగు తుప్పలో, ఆనవాలు పట్టలేనంతగా అయి, చచ్చి పడిఉంది.

మెత్తనిగుండెగల సుందరం, అంతా మరచి పోయి, పైకే అనేశాడు: "ఇంతేనా జీవితం...."

చాలాసేపు ప్రశాంతంగా గడచిపోయింది.

"మాటుకు అనువుగా ఉన్న చెట్టు అదొక్కటే" అతి మెల్లగా సుందరం చెవిలో చెప్పాడు సత్యం. మూడుదార్లు కలసేచోటుకు కొంచెం ప్రక్కగా ఉంది. వాగులోంచిగాని, ఎదురుదారినగాని పులి వచ్చిందా, ఫరవాలేదు. వెనుక గుట్టమీది దారిని వచ్చిందా దాని గుప్పిట్లో ఉంటారు. కొంచె సరిగ్గా వాగులోకి దిగి పోయింది.

సత్యం దారితీశాడు. కొండపైదారి ఎక్కి అట్లా మలుపుతిరిగి నడిచారు. ఒకమైలుదూరంలో నే రేకి రాగలిగారు.

"ధైర్యస్థుడివేరా. భయపడి అరిచేస్తావేమో ననుకున్నాను...."అంటూ సముదాయించాడు సత్యం.

తన కామాత్రం ధైర్యముందని సత్యం ఒప్పు కున్నందుకు సుందరం నవ్వాడు—కొంచెం గర్వం గానే.

ఊరంతా తిరిగి దొరికిన ఒక ముసలి ఎద్దును, ఒక మేకను తెప్పించాడు సత్యం: "ఏరా! మాటుకు వస్తావా...." అడిగాడు.

అడవిలో అలా నడవగా లేంది, మాటులో కూర్చుంటే తనకేం ప్రమాదం. వస్తానని ఒప్పుకు న్నాడు.

ఎదురుగుండా ఉన్నదారిలో మేకను కట్టిం చాడు. వెనుకదారిలో ముసలిఎద్దు. వాగులో శవం ఉండనే ఉంది. నాలుగుగంటలకే చెట్టెక్కి కూర్చు న్నారు. చలికాలం కావడం మూలాన రగ్గులుకూడా తెచ్చుకున్నారు.

నిర్మానుష్యమైన యీ భీకరారణ్యంలో సత్యంతోపాటు మొండి ధైర్యంచేసి తనూ కూర్చు న్నాడు. ఇక్కడ తనకేం ప్రమాదం సంభవించినా జాడా జవాబూ తెలుపటానికి కనీసం రెండు మూడు రోజులు పడుతుంది.

చూస్తూనే ఉన్నాడు సుందరం. కాని ఎప్పుడు ప్రొద్దు కూకింది, ఎప్పుడు చంద్రోదయమై వెన్నె లొచ్చింది, అరణ్యంలో కూర్చున్న తనేం గుర్తుపట్ట లేకపోయాడు. పిట్టలరొద పలువిధాలుగా ఉంది. గూళ్ళకు చేరుతూ నోళ్ళు తెరచి తెగ అరుస్తున్నాయి.

వెన్నెల బాగా వచ్చింది. చలిగాలి ముళ్ళింది. రగ్గు కప్పుకున్నాడు. రాత్రిపూట అరిచే పిట్టలు... బహుశా చక్రవాకాలు అవి... ..విపరీతంగా గోలచేస్తున్నాయి. 'కంయ్‌ం'—మంటూ ఏదో పక్షి గొంతు చిగబట్టింది. ఆ వెన్నెల్లో ఆ కొండలు...... వాగు... చెట్లు... గుబుర్లు......అన్నీ చేతులు చాచిన జీబూతాల్లా భయపెడుతున్నాయి. కీచురాళ్ళ శబ్దం. సత్యం ఉన్నా ఒంటరితనమే బాధించి, భయపెడుతోంది.

తప్పకుండా పులి తిరిగివస్తుంది. తను దాచుకున్న శవందగ్గరకు వచ్చి తృప్తిదీరా తింటుంది అంటాడు సత్యం

అబ్బ! చలి...చలి...

మస్యమస్య గాస్ బయటకు వస్తోంది కాబోలు- వాసన భరించటం కష్టంగా ఉంది. ఉండి ఉండి గాలి యీవైపు మళ్ళితే వాసన నాసికారంధ్రాలు బ్రద్దలయ్యేటట్లు వస్తోంది. ముక్కుమీదుగా జేబురుమాలు కట్టాడు.

నిండా ముసుగువేసుకొని సిగరెట్టు కాల్చాడు. మంట బయటకు కనుపించకూడదన్నాడు సత్యం. సిగరెట్టు లోపలనే ఉంచి పొగపీల్చి, గుండెనిండుగా లాక్కొని వదలేస్తున్నాడు. కొంచెం వెచ్చగా ఉంది.

ఎక్కడినుంచో గట్టిగా ఏదో బూరా ఊదారు. గేదెకొమ్ము అయివుంటుంది. కొమ్ము రెండు ప్రక్కలా నరికి ఊదితే మంచినాదం వస్తుంది. చలిలో మ్రోగే మాదిగ డప్పుల్లా, గుడ్డకప్పి బాదినట్లు ఏదో శబ్దం వినవస్తోంది. గొడ్లదగ్గర, దొడ్లవద్ద కాపలా పడుకున్నవారు నిద్రపోయేముందు వాయిస్తున్నట్లున్నారు.

బోడి గుర్తుకు వచ్చింది సుందరానికి. ఏదో ఒక విలువైన వస్తువు పోగొట్టుకున్నట్లుగా ఉంది. ఒక్కసారి ఆత్మవిమర్శ చేసుకున్నాడు. బోడిని తను ప్రేమించలేదు; కామించలేదు. తనకా కోరిక ఏ మూలనన్నా ఉందా? లేదు మరి. బోడికీ తనకు మధ్య చాలా మెట్లున్నాయి. తనీ మెట్లన్నీ దిగి బోడిని కలుసుకోలేడు. బోడి కూడా ఈ మెట్లన్నీ ఎక్కి యీ అందనిపండుకోసం అర్రులు చాచే రకం కాదు. కాని తనెందుకు చేతనో బోడి అంటే, ఎందుకో యింత ఆపేక్ష చూపిస్తున్నాడు.

విచిత్రవసువులా ఉంది. సత్యాన్ని తప్పుబట్టాడు గాని, తనలాగే అభిమానిస్తూ ఉండాలి.

చీకటి రొద: కీచురాళ్ళ ధ్వని: ఎముకలు కొరికే చలి.

ఆకాశంమీద నక్షత్రాలు మిలమిలా మెరుస్తున్నాయి. వాటిని చూస్తూంటే, మేడపై అంతస్థుమీద పండు వెన్నెట్లో, ప్రణయ సల్లాపాలాడుతూ భార్యతో గడిపినదృశ్యం గుర్తొచ్చింది. చంటిపిల్లాడితో యీ అర్ధరాత్రి ఆ అమాయకురాలు పడుకొని ఉంటుంది. తను లేనిలోటు తప్పకుండా అనుభవించే ఉంటుంది. "ఎందుకీ పాడు వేట— చెబితే వింటారా!" బహుశా పిచ్చిప్రేమలో హృదయంలో అలా కసురుకునే ఉంటుంది. అర్ధరాత్రి కదూ! పిల్లాడు లేచి పాలకోసం ఏడుస్తూ ఉండాలి. చిలిపిచేష్టల వాడి చేతులు, కాళ్లు క్షణం ఊరుకోవు. ముక్కు మొహం పీకిపెడతాడు—ఎత్తుకుంటే. ఇంట్లో అడుగు పెట్టగానే కాళ్ళలోపడి పాకుతూ బోసినోటితో నవ్వుతాడు. తనెత్తుకోక ఒకడుగు ముందుకు వేసేవాడు. వాడు గబగబ పాకేవాడు. ఇంకా ఎత్తుకోకపోతే ఏడ్చేవాడు. ఇది చూచి తన భార్య పక్కున నవ్వేది. దాని ఉద్దేశం తను ఓడిపోయాడని, వాడు గెలిచాడని.

నిజంగా యీఅర్ధరాత్రి తనకేమైనా జరిగితే వాళ్ళగతేమిటి?...వళ్ళు గగుర్పొడిచింది.

దాసీదాన్ని యింటిదగ్గర పడుకోమని, గట్టిగానే చెప్పివచ్చాడు. వెంకడిని కూడా పడుకోమన్నాడు. వాళ్ళు రాలేదేమో! బితుకు, బితుకుమంటూ ఒక్కతే పడుకుందేమో!....వచ్చే ఉంటారు! అయినా ఏమిటీ గ్యారెంటీ!

తీతువపిట్ట అరచింది. అది జంతువునంటి పెట్టుకొని అరుస్తూ ముందువస్తుంది. పులికి తప్పకుండా ముందుంటుంది.

చెట్టుక్రింద చూచాడు. ఏదో జంతువు పాకిపోతోంది. [illegible] చూచికూడా ఊరుకున్నాడు. చాలా సేపటికి గాని దాన్ని పోల్చుకోలేకపోయాడు — దుమ్ములగొండి. పులిచారలుంటాయి... పులికాదు. కుక్కమూతి ... కుక్క కాదు. జల్లితోక ... కాని

నక్క కాదు. ముందు కాళ్ళు పొడుగు; వెనుక కాళ్ళు పొట్టి. వికారంగా నడుస్తుంది. క్రూరమైనజంతువ కాదు కాని, చిన్న చిన్న పిల్లలనయితే చంపేస్తుంది. పరుగెత్తలేదు. స్వయంగా జంతువును చంపలేదు; కాని చచ్చిన జంతువులను తింటుంది—నక్కలలో చేరి. పంట్లు చాలాగట్టివి. ఎంతలావు దుమ్ము(ఎముక) నైనా పటపట నమిలేస్తుంది. దానిది కూడా ఒక జీవితమేమరి. శవం దగ్గరకు, నక్కలను తోసుకుంటూ చేరింది.

అబ్బ! విషపుగాలి. శవంమీదనుంచి వస్తోంది.

సత్యంకేసి చూచాడు. బహుశా సత్యంకూడా తనకులాగే ఏదో ఆలోచిస్తూ ఉంటాడు. వేటగురించి అయి ఉంటుంది. వేటంటే గుర్తొచ్చింది. వచ్చే టప్పుడు వేటకు సంబంధించిన పుస్తకాలిన్ని కొని, తెచ్చుకొని, చదివాడు. ఎందరెందరో ప్రముఖ వేటకాళ్లు, మానుపులవల్ల ఎలా చంపబడ్డది కూడా చదివాడు. మానుపులులు మహా తెలివిగా ఉంటాయట.

మంత్రాలు నేర్చుకొని, మనుష్యరక్తం చవి చూచి, దాహం తీరక, కొందరు కోయలు యిలా మానుపులు లవుతారట. సగం మనిషి, సగం పులిగా ఉంటారు. తుపాకిగుండు వాళ్లే నేమీ చేయదట. చిత్రవిచిత్రాలు చేస్తారట.

ఈ చెట్టుమీద ఎన్ని పాములున్నాయో! చెట్టు రుకు పాములు చెట్ల ఆకుల్లో కలసిపోయిఉంటాయట. అవి పగకూడా పడతాయట. చాలా ప్రమాదమట కూడాను.

"ఇదంతా ఎందుకు. తనకీ వేళ ఆఖరురోజు"— మరోసారి జ్ఞాపకానికి రాగానే, గజ్జున వణకిపో యాడు.

ఎక్కడా పులిజాడ లేదు.

సిగరెట్టు కాల్చుకుందామని ముసుగు వేసు కున్నాడు. అగ్గిపుల్ల గీశాడు. తీతువు తెగ అరిచింది. మేక అరిచింది. ముసుగు జారిపోయింది. భయోత్పాతం వల్ల జుట్టంతా నిక్కబొడుచుకుంది. ఒళ్ళంతా సూదులు గుచ్చినట్లుగా ఉంది. మేక యింకొంగట్టిగా అరచింది. రగ్గు జారిపోయింది. గుండె దిగజారిపోయింది. అంత చలిలోకూడా ముచ్చెమటలు పోశాయి.

సత్యం వేళ్ళు మీటమీద సిద్ధం అంటున్నాయి కంట్లు గబగబా వెతుకుతున్నాయి.

సమయం గడచిపోతోంది. పులి జాడ లేదు. అనుమానపడితే మళ్లీ రాదన్నాడు సత్యం. అందుకే మాటు కట్టటానికి అక్కడివి చెట్టుగాని, పుట్టగాని కొట్టటానికి వీల్లేదన్నాడు. సహజత్వానికి ఏమాత్రం భిన్నం మెచ్చినా పులి కనిపెడుతుందట.

మేక పడుకుంది. పులి రాలేదా! మరి మేక ఎందుకలా అరచింది. నల్లగా చీకట్లో పడుకుంది. ఎద్దుకేసి చూచాడు. నిశ్చింతగా పడుకొని నెమరు వేస్తోంది.

అప్పుడు ఆ నిశ్శబ్ద నిశీథ వాతావరణాన్ని చీల్చుకుంటూ, కర్ణానందంగా, ఎక్కడినుంచో, మధుర మంజులగానం వినిపిస్తోంది, సుందరానికి. ఎత్తైన కొండమీదనుంచి పడుతూ, లేస్తూ, పరు గెత్తుతూ, ప్రవహిస్తూ వచ్చే సెలయేరులా ఆరోహణ, అవరోహణలతో అతి గంభీరంగా ఉంది. ఒంటరిగా ఉండలేక జంటకోసం విలపించే కోకిల కూజితంలా మృదువుగా ఉంది.

ఎవరీ కమనీయ గాత్రి!

ఒకవేళ యిదే హిమవత్పర్వత సానువు లనుకొని ప్రవరాఖ్యునికోసం అలపిస్తున్నదా— వరూధిని భువికి దిగి. లేక కలస్వనంతో ఏడుస్తున్నదా— విరహం భరించలేక. గాంధర్వ కన్యకల ఏడుపుకూడా కమ్మగా ఉంటుందట. అంత తియ్యగా ఉంది మరి.

ఎక్కడ దీ కమ్మని కంఠం.

ఇంత అర్ధరాత్రి యీ మారుమూల, కుగ్రా మాల్లో, యీ పూరిపాకల్లో యింత కమ్మగా, తియ్యగా పాడే దెవరీ వరవర్ణిని. ఎక్కడినుంచి వచ్చి యిక్కడ స్థావరం ఏర్పరచుకుందో యీ వరారోహ!

అహా! ఎంత తియ్యని గొంతు.

కవి కుమారుని హృదయం కళవళపడుతోంది.

అదే రాగం...అదే గొంతు...వీనుల విందుగా వినిపిస్తోంది. మనస్సు నుయ్యాల లూపిస్తున్నది. మైమరపిస్తోంది. ఆ గానమాధుర్యానికి పరవశుడై పోతున్నాడు సుందరం. భావంగాని..కూర్పుగాని... ఏమీ వినిపించటంలేదు. హృదయాన్ని జోకొట్టే ఆలాపన.

# పులి వేట

అబ్బ! ఎక్కడిది మధుర మంజులగానం.

అర్ధరాత్రి లేచిన ముద్దుబిడ్డకు పాలిచ్చి జోకొట్టే మాతృమూర్తి ప్రేమపూరితమైన జోలపాటా!...చిరునవ్వు వెన్నెలలు చిందిస్తూ, చిటుకులు వేస్తూంటే చిరుగజ్జెలు ఘల్లు, ఘల్లుమంటూంటే కుమారుని ముద్దు చేష్టలకు బోసినవ్వుల కానందపరవశురాలై తనివితీర, కౌగలించుకొని, తీయతీయని ముద్దులవర్షం కురిపిస్తూ, ముగ్ధురాలైన ప్రేమస్వరూపిణి హృదయతంత్రులన్నీ జల్లుమని ఆలాపిస్తున్నాయా! ...... ధన్యమయింది స్త్రీజన్మ.

తనిప్పు డొక దివ్యస్వప్నం కంటున్నట్లుగా ఉంది. ప్రేయసి వలపులు క్రుమ్మరిస్తూ, ఒక చేతి వేళ్లు వంచి, వయ్యారంగా, హృదయపూర్వకంగా, అర్ధనిమీలిత నేత్రయై, పరవశయై, క్రీగంటితో, "ఒకసారి ఇట్లా రావూ!...." సైగతో పిలచినట్లుగా ఉంది. పులకరింపు పుడుతోంది.

భళ్లున తెల్లవారింది.

ఆ గాంధర్వ గాత్రి ఎవరో తెలుసుకోవాలన్న కోరిక తీవ్రంగా బాధిస్తోంది. ఆ కంఠమాధుర్యాన్ని బట్టి ఆవిడ తప్పకుండా అప్సరస అయివుండాలి. అన్నమంతా పట్టి చూడనక్కరలేదు. అపురూప సౌందర్యవతి అయివుంటుంది. అందులో సందేహం కూడానా! ఇద్దరూ ఇళ్లకు మళ్లారు.

ఉద్రేకంతో అడిగాడు సుందరం: "పాట విన్నావా?..."

"ఏంపాట?" అనుమానంతో అడిగాడు సత్యం.

"అరె! మరి రాత్రి వినిపించినపాట నువు వినలేదన్నమాట."

"అదా!...అది పాటకాదురా!....ఏడుపు...."

"ఆఁ..." -కుప్పగా కూలిపోయాడు సుందరం.

* * * *

కోయవాళ్లు ఏడుస్తూవుంటే, దూరంగావున్న క్రొత్తవాళ్లకి ఎంతో కమ్మగా పాడినట్లు వినిపిస్తుంది. మన ఏడుపులా ఉండదు. ఇది అనుభవంమీదకాని తెలియదు.

సుందరానికి అనుమానంతీరక ఆరాతీస్తే ఆ సాయంత్రమే వచ్చిన బోడిఅక్క అర్ధరాత్రి దుఃఖం పట్టలేక భోరుభోరున ఏడ్చిందట.

# నన్నయ శకుంతలోపాఖ్యానము

డి. ఆర్. కె. సంగమేశ్వరరావు

**భా**రతి జూన్ నెల సంచికయందు కొడవగంటి శంకరనరసింహ బ్రహ్మంగారు 'కలహూరగంప' నన్నయ శకుంతలోపాఖ్యానమును మూలమునందలి కథతో సరిపోల్చి వ్రాసిన 'విమర్శ' యాశ్చర్యజనకమును కేవలము నన్నయను జోగను వారినిగూర్చి వ్రాసినకోప సహితఖండనము వలెను, దోచుచున్నది. కాని మూలమునందలికథ నాద్యంతము పరిశీలించి నిష్పాక్షికముగా తత్త్వైకనిర్ణయదృష్టితో వ్రాసిన వ్యాసమువలె గన్పట్టుట లేదు. మూలమును సావధానముగా జదువనివారి కది నిక్కువముగనే తోచును, కాని విమర్శకులు మూలమునందలి తన వాదమును నిరాకరించు ముఖ్యమైనశ్లోకములను జూడ నిరాకరించి, కొండొకచో నేయొక్క శ్లోకపాదము తన యభిప్రాయమును ఖండించునో, దానిని విడచి మిగతశ్లోకములను మాత్రమే పాఠకులకు చూపించినారు. ఆయన కయ్యది సబబుగా దోచియుండవచ్చు లేక పొరపాటుబడియుండవచ్చును.

కథయా మహాభారతము. ప్రస్తుత ఘట్టమా, ఏ మహానుభావుని నామధేయమున భారతకథ వర్తిల్లుచున్నదో, ఎవని రాజ్యము పేరున ననేక శతాబ్దుల యనంతరముగూడ మనమహాదేశము పిలువబడుచున్నదో యట్టి భరతచక్రవర్తి జననీజనకుల ప్రణయ, విరహ, సమాగమసంబంధియైనది. మూలకారుడా యనేకపురాణముల వ్రాసినవాడును, లౌకిక వైదికాచారంబుల నెరింగినప్రోడయు, నుపనిషత్సారంబులగు భగవద్గీతల నాలాపించినవాడును, సరససుందరంబులును గంభీరధ్వనిగుంభితములును, వేదమంత్రార్థవివరణప్రాయములును నగు ఘట్టముల వ్రాయుటం దిట్టయు మహర్షిజన్ముండును నగు వ్యాసభట్టారకుడు. తెనిగించిన కవియా, మహారాజసన్మానపాత్రుడు, రాజాస్థానాంతరబహిష్కార్య వేత్తృత్వస్థానమం దున్నవాడును, అతిబహుళమై, సరసార్థదాయిని యైనను పండితచ్ఛాందసుల, కగమ్యమై రసవహోచ్ఛిన్నమైన మహాభారతచంద్రికను మొట్టమొదటగా తేటదెనుంగునకు చేర్చి యాదికవినా బరగు మహానుభావుడు నన్నయ. మహాపండితుల కైనను తప్పులు గల్గుట సహజమే. ప్రతియారంభమును దోషముచె నావరింపబడియే యుండును. మనము పురాణకాలమందలి యాచార వ్యవహారముల నెఱింగి కదా, యప్పటివ్యక్తుల తప్పొప్పుల నెన్నబూనుట. వానిని తెలిసికొనుటకు సంస్కృతభారత మొక ముఖ్యాధారముకదా. అట్టియెడ నయ్యాచారవ్యవహారాదుల నతిస్వల్పముగా మార్చుచు, భాషాంతరీకరణమువలన ననివార్యము లగు కొన్ని తెనుంగు సంప్రదాయముల నందిముడ్చుచు మూలమునందలి సొగసులు చెడకుండగ వ్రాయుటకు యత్నించుట నన్నయగారి విధి. ఆపనియందు ప్రస్తుతఘట్టమం దాతడు చాలవరకు కృతకృత్యు డయ్యె నని భావింతును.

రాజరాజు నన్నయం గోరినది 'మహాభారతబద్ధ నిరూపితార్థ మేర్పడ తెనుగున రచియింపుము' ని. కాని ఆ రచనలో ధ్వనిగర్భితము లగు వానిని వ్రాయకుమని సూచింపలేదే. నన్నయ కూడ 'సారమతిని లో నారసి కవీంద్రులు మేలన' భారతరచన సేయుదు నని చెప్పినాడే! ఇంత యేల భారతమే మనముందున్నది కదా! ఈ విషయ మతి సుగ్రాహ్యముగను ప్రత్యక్షముగను యున్నపుడందలి తత్త్వము భారతసమగ్రపరీక్షా సిద్ధము గాని 'నిరూపితార్థము నేర్పడ రచియింపు' మనుయొక్క వాక్యమువలన, నేమి సిద్ధించును? ఒక్క పదమువలన నెదురుగా గన్పట్టు నన్నయ భారతార్థము మారిపోవుట సంభవింపదుగదా! ఇంకొక సంగతి. నన్నయ యాదికవియా కాడా యను విమర్శ యప్రస్తుతము. ఆదికవియైనంతమాత్రమున సరసకవిత్వ రచన చేయు నని సిద్ధాంత మెచట యున్నది? ఆదికవి కానప్పుడే రసవత్తర కావ్యరచన కవకాశ మెక్కుడు కదా! పూర్వకవుల లోపముల దిద్దుకొనవచ్చును. వారిరచనలయందలి మంచిపొకడలను భాషా సంప్ర

# నన్నయ శకుంతలోపాఖ్యానము

దాయములను దా నుపయోగించుకొనవచ్చును. అటులని యాదికవు లుత్కృష్ట కవులు కాజాలరని గాని, యుత్కృష్టరచనానంతర ముత్కృష్టతరరచనా సంభవము కాదని గాని నిర్ధారింపతగదుగదా! కొన్ని వందల యేండ్లయినను భారతకవుల రచన కెడగు గ్రంథము లెన్ని వెలసినవి? కాన యీ యాదికవిత్వ పునారణ మెల్లపుడును స్పష్టమైన యాధారములు దొరుకనంతవరకును యనవసరప్రసంగమే యగును. అది కేవలము చారిత్ర విమర్శకులకే యుపయుక్తము. ఇక కథకు వత్తము.

వ్యాసుడు 'శకుంతలా యాం భరతో దౌష్యంతి రభవ ద్నృపః' అని యారంభించినాడు. నన్నయ శకుంతలా భరతుల నామధేయముల నెత్తకయే వారిని సూచించినట్లున్నది. 'విపమాటవీనలితి కేసరి శార్దూల శరభముల దన బాలత్వమునంప యెగచిబట్టుచు' అని సర్వదమనుని తండ్రికిని వర్ణించి మూలమున భరతుని గూర్చి వ్యాసుడు వ్రాసిన విశేషములను దుష్యంతునికి, 'ఆత్మావై పుత్రనామాసి' యను వాక్యసార్థక్యముగా వాడినట్లున్నది. మూలమున 'స చాద్భుత మహాకీర్త్యో వజ్రసంహననో యువా' అని దుష్యంతునికి వాడిన విశేషణములనే, ముందు ముందు భరతుని వర్ణించునపుడు నన్నయ 'సింహసంహననుడు దీర్ఘ బాహుడు ననంత జవసత్త్వసంపన్నుడు' అని యనుకరించినాడు. ఈ మార్పు యుచితముగనే యున్నది. తరువాత 'సమీర దుర్గమ మహోగ్రారణ్య దేశాళితో నాదిక్షత్రచరిత్ర నెలే' యని క్షత్రపదము వలన ధైర్యశాలిని యగు శకుంతలను సూచించి 'కదినేలే' యని సమాగమ సూచకముగా వాడినాడు. ఈ ద్వ్యర్థపదమందలి ధ్వని యుచితముగనే తోచునుగదా! ఈ యర్థమును నన్నయ యుద్దేశించినాడా లేదా యనునది మనకనవసరము. చాలచోటుల నిట్టిసొగసు లమరినవి, యనునదే మనకు గావలసినది. నన్నయ యభిప్రాయములు దెలిసికొనుట, కాతని వ్రాతలు తక్క మరొండు యాధారము మనకు లేదు కదా!

మూలమున దుష్యంతుని వర్ణనమం దొక్క సొగసున్నది. నాలుగు శ్లోకములలో యౌవనవంతుడైన దుష్యంతుని వర్ణించుచు 'బలే విష్ణుసమః, తేజసా భాస్కరోపమః, అక్షోభ్యత్వే అర్ణవసమః సహిష్ణుత్వే ధరాసమః' అని మొదలగు వానిని వ్రాసినాడు గాని శృంగార సంబంధమైన పదము నెచ్చటను వాడలేదు. కామప్రవృత్తి శకుంతలతోడనే ప్రారంభమయ్యె నేమో! నన్నయ గూడ దీనిని పాటించినాడు. నన్నయ్య 'క్షత్ర చరిత్ర నేలె' 'ధర్మచరిత వెరుగుచు నుండె' ననుటలో దుష్యంతుడు రాజు జనియు, సామంతక్షత్రియులు ధర్మమును పాలించి పెంపొందింపజేయుచున్నారనియు సూచించినట్లున్నది.

మూలమున దుష్యంతుడు వేటకు వెడలినపుడు 'నిర్జలం నిర్మనుష్యం, బహుయోజన మాయతం' అని యడవిని వర్ణించి 'ఉష్ట్రాం చాపి నదీం గత్వా జలనైరాశ్య కర్శితః। క్షుత్పిపాసా పరీతాశ్చ శ్రాంతాశ్చ పతితా భువి' అని జంతువులను వర్ణించి 'కైశ్చిత్తత్ర నరవ్యాఘ్రైః అభక్ష్యంత బుభుక్షితైః' అని పదాతుల గూర్చి చెప్పినాడు. 'బిల్వార్క ఖదిరాకీర్ణం కపిత్థ ధవసంకులం' అని క్షుద్రాహారవిరహిత మగు నరణ్యము నింకొకచోట సూచించినాడు. పైయర్థముల నొక్క పదములో 'క్షుత్పిపాసా పరవశులై' పదాతు లయ్యయిప్రదేశంబుల విశ్రమించిరి' అని నన్నయ వ్రాసినాడు. దగ్గర పల్లెలు గాని జనము గాని యుండిన యెడల పదాతులకు క్షుత్పిపాసా పరవశత్వము కలుగదు గదా. క్షుధార్తులగువారు సులభముగ నక్కాలమున లభ్యములైన వన్యమృగముల జంపి తినుటకు విశ్రమింతురు. మూలమున గల స్వభావోక్తులును, 'నరవ్యాఘ్రైః' అను మొదలగు నెంతయు తగియున్న పదముల సొగసును నన్నయ్య కవిత్వమునందు గన్పట్టుట కవకాశము లేదు. బహుళమైన భారతము నాతడు సంకుచించి వ్రాయవలసి వచ్చినపుడు మొత్తము భావమును వీలైనంత తక్కువ పదజాలముతో సూచింపవలెను. పదాతులే రథము ననుగమింపలేక వెనుకనుండి పోయి రనుటలో రథతురగాదుల ముఖ్యపరిజనము రాజు ననుసరించిరని స్పష్టముగా ద్యోతించునుగదా!

నన్నయ్య వ్రాసిన 'అమరపతి ఖాండవమునకును వైశ్రవణు చైత్రరథమునకును సమానముగా కమలజాతు దీనిని భూలోకమునకు రచియించెనొ గాబోలు' నను భావము బాగు నున్నట్లు తోచదు. మూలమున యీవనమునకే 'నందనప్రఖ్యం' 'చైత్రరథప్రఖ్యం' అను పదముల వాడినాడు. కాని దేవేంద్రుని నందన మనుటకు మారుగ ఖాండవ మనుట చేసి, ఖాండవము నింద్రుడు నందనము కన్న సుందర

ముగా భావించి యుండవచ్చును గాన యీవనము నందనముకన్న సుందరతర మని ద్యోతించు భావమే మనకు గమ్యమనుకొంద మన్నను యష్టమాశ్వాసమున 'తత్తకుం డను పన్నగేంద్రు డింద్రున కిష్టసఖుడయి ఖాండవమునం దుండుటం జేసి దీని నమృతము రక్షించు న ట్లతిప్రయత్నంబున నింద్రుడు రక్షించుకొని యుండునది' అని అగ్ని చెప్పినటుల నన్నయయే వ్రాసినాడు గాన యీ రెండవ సరసభావంబు కూడ వ్యతిరేకింపబడుచున్నట్లున్నది. ఖాండవ మనగనే ఖాండవ దహనమే మనకు జ్ఞప్తికివచ్చును. అంతియ గాక ఖాండవము భూమిపైనున్నది. 'దీనిని భూభాగ మునకు రచియించె నొక్కొ' యనుట, పైరెండు వన ములును భూమిపై లేనప్పుడే సార్థకమగును. గాన నెటుచూసినను 'ఖాండవ' పద ముచితప్రయోగము గానట్లు దోచుచున్నది.

నన్నయవ్రాసిన లతాలలనలుచేయు పుష్ప వృష్టినిగూర్చిన పద్య మెంతేని సుందరముగను మూలము నందలి భావమునకు సరిపోవునట్లును యున్నది. 'అతి రుచిరాగతుండయిన యాతనికిన్ హృదయప్రమోది మాతతముగ నవ్వనంబున లతాలలనల్ మృదులానిలాప వర్జిత కుసుమాక్షతావళులు సేసలు వెట్టినయట్లైరెరి సంపతదళిసినినాదమృదుభాషల దీవెన లొప్ప నిచ్చుచున్'. ఇందలినయార్థ స్ఫోరక మగున దేదియును లేదు. ఇట్టివిమర్శకులై మూలము నుదహరించుచు శ్రీ బ్రహ్మం గారు తను వాదమును వ్యతిరేకించునట్లున్న యాఖరు పాదమును మాత్రము విడచి మిగతాపాదములను వ్రాసి నారు.

'చారుతాకలితా స్తత్ర ద్రుమాః కుసుమ శోభితాః ।
పుష్పవృష్టిం విచిత్రాంతు వ్యసృజం స్తే పునఃపునః ।
దివస్పృక్శోభసంఘుష్టాః పక్షిభి ర్మధురస్వనైః ।
విరేజుః పాదపా స్తత్ర విచిత్రకుసుమాంబరాః ॥'

'బ్రహ్మంగారు 'స్త్రీజన మిరుగెలంకుల నున్నతిస్థానములనుండి విభ్రమముతో బరికించి లాజలు జల్లుటకది నగరవిశేషము' గాదన్నారు. మన మేదేని క్షేత్రప్రదేశమునకు వెడలునపుడు దాని రామణీయకతను మన కితఃపూర్వ మనుభవవేద్యమగు నొక రమణీయ ప్రదేశముతో బోల్చుట యవినయమా? ఋషివాటిక లైనను బట్టణభోగముల జ్ఞప్తికి దెచ్చునటుల గౌరవించుట యవినయమా? దుష్యంతున కట్లు దోచుట యస్వాభావికమా? మూలమును గూర్చి బ్రహ్మంగారు 'ద్విజాశీర్వాదముతో జేతులెత్తి పూలుజల్లి యభ్యాగతుని సత్కరించు నీతి చెట్లును ఎట్లు నేర్చెనో యని పించిన కణ్వాశ్రమవాసప్రభావము సూచింపబడుట యుదాత్తరమ్యముగా' నున్నదనినారు. దీనిని బట్టి యీయనపద్యమును శ్లోకములను సరిగ జదువ లేదనియో, చదివినను వ్యాసునియందలి స్వాభిమాన పూరితభ్రమ యీతనిని నన్నయయందలి సరసార్థము జూడనీయలేదో తెలియరాదు. నన్నయ పద్యమును గూర్చి వ్రాయునపుడు 'అక్షతలు' దీవన లొప్పనిచ్చుచున్' అని యున్నపదముల జూడుట మానుటయు, వ్యాసునిశ్లోకమునందు 'ద్విజాశీర్వాదముతో జేతులెత్తి యభ్యాగతుని సత్కరించురీతి' అనిస్వకపోల కల్పిత ధ్వన్యర్థము నే స్వీకరించి 'విచిత్ర కుసుమాంబరాః' అనుపదమును దాటివేయ జూచుటయు, పితృదుహితృపదములయౌచితిని గూర్చి రమారమి యొక పుట వ్రాసినవారికి దగనిపని యని భావించెద. రాజు వేటకు బయలుదేరునపుడు 'ప్రాసాదవరశృంగస్థాః స్త్రియః తం దదృశుః' అనియు 'ససృజుః' పుష్పవృష్టీః 'ససృజుః తస్యమూర్ధని' అనియు నాగర స్త్రీ చేష్టితంబుల వర్ణించినాడు. ఆనందకరము యువజన మనోహ్లాదము నగు నాదృశ్యమే. 'ఇరుగెలంకుల నాకాశము నంటు వృక్షములపై విచిత్రకుసుమాంబరములు ధరించిన వనస్త్రీలు పుష్పవృష్టి నాతని శిరస్సుపై జారవిడచిన ట్లాతనికి భాసింపజేసినది. ఆశ్రమ స్త్రీలు విచిత్రాంబరముల ధరింతురేమో తెలియదు! ఈఘట్టము శృంగారరసప్రధానము. ఇందెక్కువగ దద్రసోద్దీపనములగు శ్లోకములనే వ్యాసుడు వ్రాసినాడుగాని తాపసజనోచితములగు వర్ణనములను గావింపలేదు. రాబోవుఘట్టమునకు సూచనముగా 'లతాగృహాపరిక్షిప్తాన్ మనసః ప్రీతివర్ధనాన్' 'పరస్పరాశ్లిష్టశిఖై రంఘ్రిపైః కుసుమాంచితైః సేవితం వన మత్యర్థం మత్తవానర కిన్నరైః' 'సుఖశీత స్సుగంధశ్చ... అనిలః పరిక్రామన్ వనే వృక్షా నుపైతి చ రిరంసయా' అని యీ మొదలగు వర్ణనల గావించినాడు. ఈ సందర్భమున గల రమారమి పదునారుశ్లోకములలోను, నైదారుపాదములలో మాత్రమే తాపసవృత్తికనుగుణంబులగు భావములను సూచించినాడు. అందే 'ఘృణ్యస్వాధ్యాయ

# నన్నయ శకుంతలోపాఖ్యానము

సంఘుష్టాం నియమవ్రతచారిణాం' 'మత్తవారణ శార్దూల భుజగేంద్రనిషేవితాం' అను శ్లోకమున, సంఘుష్టపదమును, కొంతవపాదమును తిలకించిన, నా ప్రశాంతములగు ద్విజకులఘోషము శార్దూలాదిమృగముల యరపులవలెనే దుష్యంతునికి దోచిన దని సూచించినట్లున్నది. ఇంతయేల ద్విజపదమును గాని ఆశీర్వాదపదమును గాని (నన్నయ్య పద్యములోని దీవెనము) మూలమున లేనే లేవన్నచో, మరియొక సరసతరార్థ ముపపన్నమగుచున్నపుడును దూరాన్వయ మగు ధ్వన్యర్థమే దాని కర్థ మని జెప్పి స్పష్టముగగల పదముల యర్థమును జూచి నిరాకరించుట దోషావహ మని భావింతును. విశ్వనాథవారు 'పురుషోత్తమ' పదమునకు నారాయణార్థము జెప్పి తద్భవముగా నన్నయ సూచింపబడినా డనునటులనే 'పక్షి' శబ్దంబునకు 'ద్విజ' శబ్ద మర్థముం జెప్పి, దానికి మరల ధ్వన్యర్థమును బట్టించుటయగును.

అస లింతకును నన్నయపద్యమునకు బ్రహ్మంగారు చెప్పిన యర్థమే ధ్వన్యర్థము. అంతకన్నను రసవంతమై, సులభితరసిద్ధమైన మరియొకభావము స్పష్టముగా గోచరించును. 'మూర్తీభవించిన వనదేవతా స్త్రీలవలె నున్న లతాలలనలు, రాజైన దుష్యంతుని శిరముపై కుసుమాక్షతావళుల జల్లి యళినినాదమృదుభాషల దీవెన లిచ్చిరి' నుట యెంతయు దగియున్నది కదా! నాగరికస్త్రీలు 'అక్షతలను' జల్లి 'దీవెన' లిత్తురా? పద్యము జదివిన తోడనే నాగరస్త్రీలే బ్రహ్మంగారి మనంబునకు దోచుటయు, బోనిం డట్లుదోచినను, నాభావము విరస మని యాభాసోపపత్తిం గల్పింప జూచుటయు నెట్లు సంభవించెనో పండితులకే యెరుక.

'పరితాపముదీరగ జైవిచె నన్నదీపవనంబుల్' అని చెప్పి వెంటనే నన్నయ 'ఏచి తనర్చి...' యను మాలినీవృత్త మారంభించినాడు. మూలమున నా నది పేరు మాలిని యనియున్నది. ఇది రమ్యముగా నున్నది గదా! 'చని చని ముందట నాజ్యహావిర్ధృత సౌరభ ధూమలతాతతులం, బెనగిన మ్రాకులకొమ్మలమీద నపేత లతాంతములైనను, బా యని మధుపప్రకరంబుల జూచి జనాధిపు డంత నెఱింగి దపో, వన మిది యల్లదె దివ్యమునీంద్రుని వాసము దానగు నంచు నెడన్' అను నన్నయపద్యమునకు మూలమున నాధారములేదు. సాధారణముగా బొగ పెట్టినచో తేనెటీగలు పట్టును వీడి వెడలిపోవును గదా. అట్టియెడ బొగయున్నది. పూవులు లేవు కాని మధుపంబులు చెట్లకొమ్మలమీద నున్నవి. ఇచ్చట మధుప శబ్ద మెంతయు దగియున్నది. ఆ దివ్యహోమధూమ సౌరభభ్రాంతములై మధుపము లుండెనోపు నని గోచరించుచున్నది. ఆ ధూమమును బట్టి తపోవన మిది యని యెరింగి(నల్లనిలజూచి) 'అదిగో దూరముగా నల్లచ్చట నాముని నివాసము గావలయు' నని దుష్యంతు డనుకొనినాడు. 'అల్లదె-యెడన్' అనుట. 'అదిగో నల్లచ్చట' యను తెనుంగు నుడుకను జూపుచున్నది.

నన్నయ కణ్వాశ్రమ సమీపమున సహజ వైరి వర్గముల మైత్రిని సూచింపుచు నాడిన 'సహవాస' పద మెంతయు దగియున్నది. కాని 'ఒక్కటఁ గలసియాడు' అని యదే యర్థముల నిచ్చు పదముల మరలవాడుట బాగుగాలేదు. మూలమున 'ఆసనాని విచిత్రాణి పుష్పవంతి మహీపతిః ప్రయత్నోపహితాని స్మ దృష్ట్వా విస్మయ మాగమత్' అని యున్నందున మునులు రాజున కా[illegible] మీఁదు లేదను ప్రశ్నయే యుత్పన్నము గాదు. శ్రీ బ్రహ్మంగారు దుష్యంతుని కణ్వాశ్రమ ప్రవేశమును గూర్చి మరియొక యాభాస విరసార్థమును కష్టపడి సాధించిరి. మూలమున 'సోఽపశ్యమానస్తం ఋషిం శూన్యం దృష్ట్వా తదాశ్రమం। ఉవాచ క ఇహేత్యుచ్చైః వనం సన్నాదయన్నివ' అని యున్నది. ఇది సహజమే. నన్నయ 'ఒక్కరుండ చని తన్వి పయోజదళాక్షి...గనియె దమ్మునివల్లభ మందిరంబునన్' అని వ్రాసినాడు. కాని దుష్యంతుడు పిలువకయే లోనికి వెడలినాడని వ్రాయలేదే! 'రాజమ్మునిఇంటికిన్ జనుచు ద్రోవ నెడ నెడ మునుల నడుగుచు నయ్యాశ్రమ ద్వారమును సమీపించి పాదరక్షల బయట విడిచి...' అని మొదలుగా ప్రతికార్యమును వ్రాసిన యెడల స్వభావసుందరముగా నుండును నా! సాధారణాచార వ్యవహారముల యౌచిత్యమును రాజు పాటించినాడని గాని, లేదని కాని వ్రాయకపోవుట దోషావహము గాదే! 'అమ్మునివల్లభ మందిరంబునన్' అనుటలో, మందిరము బయట నంతేవాసు లెవరును లేక శూన్యం బయియున్నది గాన యూర్ధ్వరేతస్కుడైన కణ్వుని కుటీరమున స్త్రీజన మెవ్వ రుండు రను నిబ్బరము చేతను, సహజ రాజస్వభావము చేతను

లోనికి దుష్యంతుడు వెడలినాడని గాని, రాజు ముందిరము బయట నిలువబడి లోనగల శకుంతలను గనినాడని గాని యూహించుట యసంగతము కానేరదే! అవి కుటీరములే కాని సువిశాల హర్మ్యంబులు కావే. 'తొంగికాని తలుపుద్రోచికాని లోనివారలం జూచుట ధర్మము' అని బ్రహ్మంగారన్నారు. నన్నయ 'రాజు దని...మందిరంబునన్' అనినాడు. కావున 'అగస్మాత్తుగా నొక్కయడుగువేసి, సముద్రంబును హనుమంతుడుం బోలె కణ్వాశ్రమాభ్యంతరమునకు రాజు గెంతినాడాయేమి?' అను యనౌచితిని నన్నయ కాయన ఏల నంటగట్టలేనో దుర్గ్రాహ్యమే. అంతే గాదు 'తన్వి పయోజదళాక్షి సంకుల మిళిత...కోమల కుంతల' అను పదములలో ప్రత్యంగ వర్ణన మాయనకు దోచుట శోచనీయమే. మూలమున శకుంతలను జూచినప్పుడు 'శ్రీ రివ రూపధారిణీ' అనియే గాక 'దృష్ట్వా సర్వానవద్యాంగీం' అనియు వ్యాసుడు వాడినాడే! నన్నయయం దీ ప్రత్యంగ వర్ణనము దురదృష్టముగా నాయనకు దోచినను నది యమూలకముగానే! అంతేకాదు కణ్వుడు లేడని తెలియువరకును 'పుష్కరలోచనే' 'శోభనే' అని దుష్యంతుడు శకుంతలను సంబోధించి, (అపశ్యమానస్తం ఋషిం తాంవరారోహాం, శ్రీమతీం, చారుహాసినీం) ఋషి లేడని తెలియగానే వరారోహను, చారుహాసినిని 'సుశ్రోణి, నాగనాసోరు, మత్తకాశిని, కలభాషిణి' అని సంబోధించినాడే దానిని గూర్చి 'ఋషి లేకపోవుటతోడనే బరితెగించి హృదయమందలి శంకా భయంబుల వీడి సరసంబులకు దిగినాడు' అనువిరసార్థమును బ్రహ్మంగారేల చూడలేనో తత్కారణము మనోతీతముగానున్నది. నన్నయ పైపద్యమునందు కొంచెము దూరాన్వయమైనను నొకసొగసున్నట్లు గోచరించుచున్నది. మూలమున 'స్వాగతం తే ఇతి క్షిప్రం ఉవాచ ప్రతిపూజ్యచ, ఆసనే నార్చ్యయిత్వాథ...' అని శకుంతల గూర్చి చెప్పుటయును 'విద్యుత్ ఘనాంతరాత్ యథా' అని ఆమెను వర్ణించుటవలనను, రాజునకు స్వాగతముం జెప్పి వెంటనే వెనుతిరిగిన దని(అర్చనాది సామగ్రికొరకు) యూహింపవచ్చును. యీవిషయమునే నన్నయ పైవిశేషణముల జూపినాడనీ తోచుచున్నది. శకుంతలను జూడగనే ఆమె సుకుమారాంగి (తన్వి) యని దుష్యంతుడు గ్రహించినాడు. శకుంతల దుష్యంతుని దగ్గరకు వచ్చి యాతనిని చూడగనే (సా తం దృష్ట్వైవ రాజానం దుష్యంతి ముసితేక్షణా—మరియూలను) యామెను పయోజదళాక్షిగా నెఱిగినాడు. స్వాగతము చెప్పి వెనుతిరుగగనే 'సంకులమిళితాళి...కుంతల'గా జూచినాడు. ఆత్రుటిలోనే దుష్యంతున కీలక్షణము లామెయందు గోచరించినవి. ఇది దూరాన్వయమే కాని సార్థకసంబోధనలను నన్నయ చాలచోట్ల వాడినాడు గావున, సిద్ధించుచున్న యీ స్వవ్యర్థమునంవలి యుచితానుచితములకు సహృదయులగు పాఠకులే సాక్షి. వ్యాసభారతమునం దొక శ్లోకమును చదివి వెంటనే యా భావము నన్నయ పద్యమునందు రసమును గోల్పోయినదే యని యూ వేదనపడరాదు. ఆ మూలాగ్రము చదివి ప్రతిపదవిమర్శనము జేసిన తరువాతనే బాగోగుల నెన్నుట యుచితమని చెప్పుటకే యీ యన్వయమును వ్రాసినాను.

'పరబాలికను చూడగనే ప్రత్యంగ సౌందర్యైక లగ్నమైన దృష్టి' యనియు ఐశ్వర్య మత్తతచే గల్గు వికారమనియు 'తత్కాలజృంభిత కామాపేక్ష' యనియు మొదలగు నెవరికి దోచిన పదముల వారు వాడుట చాల సులభము. దాని కాలోచన యవసరము లేదు. అది తత్కాలజనితావేశమునే తెలియచేయును. కాని వానిని సకారణముగా గాదని నిరూపించుటకు యత్నించువారికి మాత్రము జాగ్రత్తగా నన్నయను, మూలమును జదివి సాకల్యముగా నాకళించుకొనుట తప్పనిసరి. పై పైన జూచి స్వమనోప్రవృత్తి కనుగుణముగా వ్రాసుకొనిపోవుటకు వారికి కుదురదు. యీవిధముగా నైనను బ్రహ్మంగారా యవకాశమును పాఠకులకు గల్పించి కృతకృత్యులైనారని భావించెదను. ఆ దుష్యంతుని మనఃప్రవృత్తినే, సనాతనము, భగవత్స్వరూపము, ధర్మావిరుద్ధము నగు కామమని వర్ణించుట యుచితతరంబుగా నుండునుగదా. దుష్యంతు డాశ్రమ ప్రవేశమును జేయుటతోడనే యాతని మనంబున శృంగారభావంబు లుద్భవించి, శకుంతలం జూడగనే నామెయం దాతని మనము లగ్నమైనది. మూలమున 'దర్శనా దేవ హే శుభే త్వయా మేఽపహృతం మనః' అని యున్నది. మూలమున మహర్షి లేడని తెలియువరకును సామాన్యముగనే శకుంతలను సంబోధించి తరువాత కామావేశపరవశు డగుటం

గూర్చి: 'గాంధర్వవివాహోచిత స్థల కాలంబు లుపపన్నము లైనవి గాన తదనుసరణభావంబులే రాజునందు గల్గినవి కాని యవి తుచ్ఛములుగావు. అనపేత ధర్మ్యంబులు' అని చెప్పుట 'శకుంతలను జూచిన తోడనే కామమోహితుడై తండ్రి లేదనినతోడనే తమకము హెచ్చి పైపైకి వచ్చినాడ'ని చెప్పుటకన్న ఎంత యుచితముగా నుండును. కణ్వుడు కూడ 'ధర్మిష్ఠతాం మత్వా' 'ధర్మే చాస్ఖలితం మనః' అనియు 'సకామాయా స్సకామేన నిమన్త్రః శ్రేష్ఠ ఉచ్యతే' అనియు జెప్పినాడు. ఈ విషయమునే సంచలితహృదయుడైన దుష్యంతుని స్వగతమున 'ఇది మునికన్యయేని ఏల నా హృదయంబు దీని యందు దవిలె, సత్పురుషులు వమ్మ నేరన'ని నన్నయ ద్యోతింపజేసినాడు. ధర్మావిరుద్ధ కామము కల్గదని దన దృఢమైన నమ్మక మగుటంజేసి, వాని హృదయ సంచలనమును మూలమున కవిరోధముగా సమర్థించినాడు. మూలమున 'న మేఽన్యత్ర క్షత్రియాయాం మనో జాతు ప్రవర్తతే' అని చెప్పించి 'భక్తం భజ' 'భుంక్ష్వ రాజ్యం విశాలాక్షి' యనిపించినాడు.

దుష్యంతుని భావమున కనుకూలముగనే శకుంతల భావము కూడ ప్రవర్తించినది. వాని ననంత విలాసంబున జయంతుని పోల్కి కలవానిగా జూచినది. చూడగనే యాతని సౌందర్య మామె నాకర్షించినది. అంతమాత్రముననే 'కనువేదురుగల బాల' యనీ మహాద్యశోవిప్రస్థానకారణుండైన భరతుని జననిని గూర్చి వాకొనుట సాహసోపేతమై నన్నయ యందలి ద్వేషభావమునే సూచించును. వీరి ప్రేమ దివ్యమైనది. కారణజన్మ ప్రభవమూలకమై యకస్మాదుద్భవమైనది. మూలమున విద్యుత్తువలె దుష్యంతునికి దర్శన మిచ్చి యాతిథ్యార్థకాలముననే (మూలమున 'దృష్ట్వైవ') దుష్యంతుని 'సింహస్కంధునిగా, దీర్ఘబాహునిగా, ఆయత పద్మాక్షునిగా వ్యూఢోరస్కునిగా సుసంహతునిగా' వేయేల 'సర్వలక్షణ పూజితుని'గా నెఱింగినదే! పూజించి లజ్జావనత వదనయై స్మయమానయై 'కిం కార్యం మయా క్రియతాం' అని యడిగినదే! ఈ సాత్త్వికభావజాత మానస్కయైన శకుంతలను శ్రీ బ్రహ్మంగారెంత దిండింతురో తెలియరాదు.

దుష్యంతుడు తన్ను వివాహము జేసికొను మని కోరిన తరువాత 'ఏకాకీ త మాశ్రమే హసతీ వాక్యం సుమధురాక్షర మువాచ' అని శకుంతలను ధైర్యోపేతయైన శృంగారనాయికగా సూచించి 'నీ యర్థమును మా తండ్రియగు కణ్వ నడుగు మని' యనిపించిన తరువాత దుష్యంతునకు సందేహ ముదయింపగా 'నీ వెవ్వని కూతురవని' యడిగినట్లు మూలమున వ్యాసుడు వ్రాసినాడు. అట్లుగాక నన్నయ కొలది భిన్నంబుగా, 'కణ్వమహాముని యెందేగి రని' దుష్యంతు డడుగ బంట్లు తేర నేగి రని శకుంతలచే జెప్పించి 'నీ వెవ్వని కూతురవను ప్రశ్నకు శకుంతలచే స్వవృత్తాంతమును జెప్పించి దానిని వినిన దుష్యంతు డామెను పాణిగ్రహణము జేయు మని కోరినట్లు వ్రాసినాడు. మూలమునందువలె, శకుంతల యెవరో తెలియకయే తన మనంబునే ఏకైక సాక్షిగా దీసికొని యామె క్షత్రియకన్యకయై తీరవలయు నని నిశ్చయించి యామెను 'పెండ్లియగు'మని యడిగినట్లు నన్నయ వ్రాయక దుష్యంతుని యందు కొంచెము జాగ్రత్త సూచించుచు యామెను క్షత్రియగా నెఱింగిన తరువాతనే పెండ్లాడు మని కోరినట్లు చిత్రించుట కొంచెము మెఱుగుగా గన్పట్టుచున్నదని భావింతును. కాని చూడగనే పరస్పర లగ్నమనస్కులను విషయమున రెండును నభిన్నాభిప్రాయములే.

'దృష్ట్వైవ చ తాం ధీమాన్ చకమే చారుదర్శనాం' అని పరాశరుడు సత్యవతిని జూచునప్పుడును "తాందృష్ట్వాహృష్టరోమా భూత్ దర్శనా దేవ శంతనుః పిబన్నివ చ నేత్రాభ్యాం నాతృప్యత నరాధిపః" అని శంతను గూర్చియు వ్రాయుటవలన, పరాశరుని తుచ్ఛకామావేశఫలితంబు వ్యాసుడగుననియు శంతనుని యైశ్వర్యనుత్తతావికారుని పుత్రుడు భీష్ముండనుటయు జెల్లునే! కొన్ని యలౌకికవిషయములను భారతకథయందు తప్పక నొప్పుకొనవలయును. కానియెడల మూలభారతమునందలి చాలకథను తీసి పారవైవవలసివచ్చును.

మూలమున దుష్యంతుని సింహసంహననుడైన యువకునిగా చూచినంతనే స్వాగతమును జెప్పి యర్ఘ్యపాద్యాదు లిచ్చి 'పప్రచ్ఛానామయం రాజన్ కుశలం చ నరాధిపం' అని చెప్పుటలో రాజలక్షణములను పలక్షించుటవలననే రాజని గ్రహించినది, కాని

ధర్మప్రత్యయార్థము మరల 'నీవెవ రని' యడిగిన దని యూహించుకొనవచ్చును. నన్నయ 'దుష్యంతు నెఱింగి' యనినాడు గాని దుష్యంతునిగా నెఱింగి యనలేదు గాన యీయెఱుంకట దుష్యంతుని నోటి నుండియే గావచ్చును లేక రాజలక్షణములనైనను గావచ్చు. ఇందు రెండవయభిప్రాయమే మూలము నందు సూచిత మగుటంబట్టి సమంజస మగు నని దోచుచున్నది. 'మాడగనే రాజని యెఱిగిన దట' అను శ్రీ బ్రహ్మంగారి యీ సడింప సమగ్రపరీక్షాఫలిత మని జెప్పవచ్చునేమో! మూలమున విస్తారముగా హావభావాది సూచితమైన యుద్దేశము నే నన్నయ యొక్క పదములో ప్రస్తుతశృంగారప్రాదుర్భావసూచకంబుగా 'అనంతవిలాసంబున జయంతుని పోలిన'అని సూచించినాడు.

నన్నయ 'కణ్వమహామునీంద్రు నాత్మజను' అని శకుంతలచే జెప్పించినాడు. దానిని వినినంతనే 'యీ పలుకు నమ్మనేర నని' దుష్యంతు డనుకొనినాడు. మూలమున 'దుహితరం మాం విద్ధి' 'సుతా మేవం మాం విద్ధి' అనియు శకుంతల బల్కినది. కణ్వునకు బుట్టక పోయినను వారిసంబంధము జన్యజనక సంబంధము వంటిదే. వారిభావములు గూడ నట్టివే. కణ్వుడు 'శకుంతలా చ పితరం మన్యతే మాం' అనుటయు శకుంతల 'కణ్వం వా పితరం మన్యే పితరం స్వ మజానతీ' అనుటయు జూడ నీ సందర్భముల యందు 'జనక'శబ్ద ముచితమైనను 'పా ధాత్వర్థకమైన పితృశబ్దము నే వ్యాసుడు వ్రాసినా డేల' యని సందేహ ముదయించును. ఆ పదములను 'తండ్రి' 'కూతురు' అను పదములవలెనే ప్రయోగించినా డనిపించుచున్నది. ఆత్మజార్థము నిచ్చు 'సుతాం' అను పదమును గూడ వ్యాసుడు వాడినాడే! పై జెప్పిన సందర్భములయందు వ్యాసుడుగూడ శ్రీ బ్రహ్మంగారివలన 'నయథార్థము నపలపించినాడను' నపయశము నార్జించుకొనవలసినవాడే కదా! వ్యాసుని పితృ దుహితృ శబ్దములకు ధ్వనిసంయోగ మున్నది. నిజమే. అంతమాత్రమున 'ప్రాదుర్భావార్థక జనిధాతు సంబంధములైన యాత్మజ జనక శబ్దంబుల నుపయోగించి యౌచిత్యమును భ్రష్ట మొనర్చినాడు. అవివేక లానవధానతాకారణంబుగా ననాదృతములైనవి. మూల మౌచిత్యసుభగపద సమన్వితము' అని యనుట చాల యనాలోచితమును నతత్త్వైకనిర్ణయబుద్ధిద్యోతకమును వలె దోచుచున్నది. ఆ పదముల నుపయోగించిన యౌచితి యేల చెడినదో సకారణముగా వివరింపలేదు. శకుంతల కణ్వుని యాత్మజ అను భావము దుష్యంతునకు కలిగినగాని 'యూర్ధ్వరేతస్కుడైన కణ్వునికి నీ వెట్లు కూతురవైతివి?' యను ప్రశ్న యుదయించును. స్వజనకుని వలెనే కణ్వుని భావించుచున్న శకుంతల 'జనక' పద ముపయోగించుట. అయథార్థప్రలాప మెన్నడును గాజాలదు. మూలమున జనకపద మెచ్చటను సాధారణముగ గానరాదు. 100 కి 99 పదముల స్వజనకునికి గూడ పితృపదమే గానవచ్చును. ఓపికగలవా రాది పర్వమును పరిశీలించి నిర్ధారించుకొనవచ్చును. మూలమున దుష్యంతుని ప్రశ్న 'దుహితా కథం సంభూతా' యనునది గూడ బ్రహ్మంగారివాదమున సార్థకము గానేరదు. వివాహవిషయమున కన్యాప్రదాత యగు తండ్రిని గూర్చి 'మదీయజనకులు సను దెంతురు. వారు నీ కిచ్చిరేని....'యని నన్నయ యనుటలో జనకపద మనౌచితిగా నేరదనుకొందును. నన్నయ 'నయథార్థప్రలాపి యనియు' వ్యాసుని 'పిశునవకను బియ్యంబు నకును నొక మంత్రమే చదువు బ్రాహ్మణు'డనియు 'ననుటకంటె' 'తండ్రి' 'కూతురు' అను యర్థము నిచ్చు పదముల వాడినారని యుభయపక్షంబులయందును సౌహార్దత్వమును జూపుట యుచిత మని భావింతును. ఒక్క పదమును గూర్చి దీర్ఘవిమర్శ జేయు నప్పుడు పూర్వాపరముల జాలవరకు నాలోచించి పనికి గడంగవలయును. నన్నయ చాలచోట్ల సంబోధనలను విశేషణములను అర్థయుక్తముగా వాడినాడు. కొన్నిచోట్ల నవి యౌచిత్యము నెక్కుడు చేయునవిగా గూడ నున్నవి. వాని నన్నింటిని యొకపట్టికగా వ్రాయుట ప్రస్తుతము సాధ్యము గానిపని గావున, కుతూహలురు, పై జెప్పిన పితృపదము విషయమై వ్యాసుని నన్నయ కవితల పరిపోల్చి చూచి యౌచిత్య అనౌచిత్య విచారణ చేయుదురుగాక యని గోరుచున్నాను. 'ప్రమాదో ధీమతా మపి' యన్నట్లు నన్నయ గూడ తప్పటడుగులు వేయవచ్చును. కాని ప్రస్తుతఘట్టమందలి జనక, యాత్మజ పదము లా తప్పటడుగులలో జేర వని నా యభిప్రాయము. వ్యాసుడు పితృపదమును జనకపద నిర్విశేషముగా వాడినాడు.

# నన్నయ శకుంతలోపాఖ్యానము

కణ్వుని యొక బుషి 'ఊర్ధ్వరేతా యథాసి త్వం, పుత్రీ త్వత్తః కథంజాతా, సత్యం మే బ్రూహి' అని యడుగుట యుచితముగా నున్నట్లు కన్పట్టును. కణ్వుడు ప్రఖ్యాతబ్రహ్మచారి గదా. అట్టివానిని 'శకుంతల యెక్కడిది. దీని జన్మవిధం బెట్టిది' అని యొక పై యాశ్రమపు ముని యడిగినటుల నన్నయ్య వ్రాసినదే, బాగుగ నున్నట్లు తోచుచున్నది. కణ్వుని యూర్ధ్వరేతస్కత్వము విదితము గావున శకుంతల యాతని కూతురు గానేరదు అని నిశ్చయించి యడుగుట బాగుగ నున్నదికదా!

దేవేంద్రుడు మేనకను పంపునపుడు, మూలమున విశ్వామిత్రునిగూర్చి మేనక ఇంద్రునకు జెప్పినదానిని చాలవఱకు దగ్గించి నన్నయ శకుంతలనోటనే దానిని బల్కించినాడు. మూలమున మేనకచే నంత విపులముగా విశ్వామిత్రుని ప్రభావమును వర్ణింపజేయుట యామె భయాందోళనముల వ్యక్తము జేయుచు బాగుగనే యున్నది. కాని రాజైన దేవేంద్రునివద్ద విదితములైన తద్విషయముల నన్నిటిని మేనక చెప్పుట రాజమర్యాదా విలక్షణమని భావించి నన్నయ ఇట్లు మార్చినా డనుకొనవచ్చును. యీ సంభాషణమందంతటను నన్నయ రాజసేవకభావము, వ్యాసుడు రాజవేశ్యాభావమును బ్రకటించినారు. 'మూలమునగల' 'తేజసా నిర్దహేల్లోకాన్ చాలయే ద్ధరణీం తథా... తాదృశం తపసాయుక్తం ప్రదీప్తమివ పావకం. కథమస్మద్విధా బాలా జితేంద్రియ మభిస్పృశేత్' అను శ్లోకములు చిన్నచిన్న వాక్యములతో గూడి భయోచితములుగ నున్నవి. నన్నయవ్రాసిన 'అమ్మౌని యల్గి చూచుడును నాక్షణమాత్రన గోత్రధారుణీధ్రమ్ములు.. యనుపద్యము సందర్భోచితముగ నున్నట్లు గన్పట్టదు. 'కోపపరు పాలికి భూములు వోవ నోడరే' యనుటకన్న 'ప్రదీప్తం పావక మివ కథ మస్మద్విధా బాలా తమభిస్పృశేత్' అనుట మెరుగుగా నున్నట్లున్నది.

మూలమున మేనక 'భవేచ్చ మే మన్మథః తత్ర కార్యే' అనియు 'కామం తు మారుత స్తత్ర మే వాసః ప్రక్రీడితాయా వివృణోతు' అనియును జెప్పుటను నన్నయ 'అమ్మునివరుచిత్తంబు మెత్తనచిత్తజాయత్తంబగునట్లుగా చేసెద నని వాసవు వీడ్కొని మందమలయానిలంబుతోడుగా' అని మార్చినాడు. 'వాయువు నాబట్ట విప్పివేయుగాక' అని దేవవేశ్య రాజుతో నన్నదని, తొలిసమావేశమునందే దుష్యంతునితో వయసువచ్చిన బాలిక శకుంతల యనుటలో ననౌచిత్య కల్పనను శ్రీ బ్రహ్మంగా రేల చూడలేదో తెలియుటలేదు. దేవవిహితమైన యీవసనానావరణమునుగూర్చి ముందుగా మేనకయడిగినట్లు వాచ్యముచేయక నన్నయ ధ్వనిగర్భితముగా 'మంద మలయానిలమును దోడ్కొని వెడలినది.' అని జెప్పి తరువాత 'గాలి యామె బట్టం దొలగించిన దని చెప్పి, మన్మథుని సహాయమును గూడఁ చిత్తజాయత్తంబు చేసెద' ననుటలో సూచించినాడు.

నన్నయ 'చల్లని దక్షిణ మారుత మల్లన వీతెంచె దగిలి లలనాధమ్మిల్ల ... సుగంధి యగుచు మునివరు మీఁదన్' అని చక్కని పద్యము వ్రాసినాడు. ముని ప్రాఙ్ముఖుడై తపంబునకు గూర్చుండునుగదా. మేనక ముని కెదురుగా ప్రవేశించిన దక్షిణానిల మామె ధమ్మిల్ల కుసుమ సుగంధియై మునిమీద ప్రసరింపదు గదా! ఆ మునివరునకు కుడిప్రక్క వాటుగా మెలమెల్లన భయాక్రాంతయై ప్రవేసించి మునిని ముందటం గనినది. (వనకేళిలాలస విలాసగతిం జనుదెంచి ముందటం గనియె...కౌశిక చిత్తభీతి సంజనన...చిత్తు నిరస్త చిత్తజున్) తరువాత నామె వసనంబు తొలగగా విశ్వామిత్రు డామె యంగములయందు దన దృష్టి నాటు డామెను జేరదీసినాడు. ఇచ్చట వ్యాసుడు 'అపోవాహ చ వాసోఽస్యాః' అనియు 'అనిర్దేశ్య వయోరూపాం అపశ్య ద్వివృతాం' అనియును వ్రాసినాడు. నన్నయ వ్రాసిన 'అలసతి యొప్పగా దరుణి...' అను పద్యము విషయమై వల్లకుచంబులయు గక్షయుగ్మంబులయు ప్రశంస, వయసువచ్చిన బాలిక, బుషివాటికం బెరిగిన తపస్విని జగతీవల్లభునితో నప్రస్తుతముగా గావించుట దగదనియు, నవ్యక్తమధురభావము తెలుగున లాలిత్యముం గోలుపోయి యమూలకమైన యనౌచిత్య కల్పనగా భాసించినదని శ్రీ బ్రహ్మంగారన్నారు. మూలమును సావధానముగ బరికించినను, నన్నయయందలి యసౌహృదిత్వమాయనకీ విధముగ యనౌచితి నందాయనకు గన్పట్టకుండ జేసియుండవచ్చును. 'వసనమును వాయుదేవుడు తొలగజేయగా వాసార్ధమును చేతితో పట్టుకొని త్వరితముగా వంగి నగ్నయై యనిర్దేశ్య వయో

రూపవయైన యామెను జూచి కామార్తుడయ్యెను' అని యర్థ మిచ్చు మూలమునందలి శ్లోకము లప్రస్తుతములు గావా? శృంగారవిషయములందు పరిచయము లేని తపస్విని యీ శృంగారచేష్టలను వర్ణించుట, అందును రాజామెను బెండ్లాడ మని కోరిన తరువాత, నెంత యుచితముగా నున్నది? 'సాగచ్ఛ త్త్వరితా భూమిం......' అను బైయర్థము నిచ్చు శ్లోకమును బ్రహ్మంగారేల సరిగా జూడలేవో తెలియలేదు. నిష్కపటముగా కక్షకుచప్రశంస జేయుటయే మునివాటిక బెరిగిన కన్యకు అనుమాన రాహిత్యతను అమాయికతను వెల్లడిచేయును గాని సరసశృంగార చేష్టావర్ణనములు నాగరక స్త్రీ లక్షణముల వ్యక్తము జేయును. మొగమాట మెరుగని మునికన్యకల లక్షణము లిందు గానరావు. నన్నయ భారతమున యీ సందర్భమున దుష్యంతుడింకను శకుంతలను బెండ్లియాడెదనని గోరలేదు. మూలమున బెండ్లి మాటల తరువాతనే యీ నగ్నసౌందర్యానిర్దేశ్యరూపసంపదాప్రశంస వచ్చినది. యీ పై వాక్యములను, ఇతఃపూర్వ మిటువంటి మరికొన్ని విమర్శనములను బ్రహ్మంగారి పాక్షికతను జూపుటకు వ్రాసితిని గాని వ్యాసుని యనౌచితి నెన్నుటకు గాదు. వ్యాసుని శ్లోకములగూడ దగు దృష్టితో చూచిన సరసార్థ యుక్తభావము గోచరించును.

అస లింత విపులముగా నీ కథను వ్యాసుడు జెప్పించుట యెందులకు? నన్నయ్య వ్రాసినదానికైదారురెట్లున్నదే! ఇది యప్రస్తుతము కాదా? అను ప్రశ్న వేసుకొని మరియు నన్నయయందలి యప్రస్తుతి నెన్నవలయును. అ దెయ్యదియో జెప్పక నన్నయ్య వ్రాసిన రెండు పదముల స్వీకరించి స్తనశల్య పరీక్ష కారంభించుట యుక్తము కాదు. ఆ రెండుపదములును అప్రస్తుతములుగను, లాలిత్య రహితముగను గన్పట్టును. నిజమే. అట్టియెడ వ్యాసుని యింత విపుల కథయు శృంగారవర్ణనమును ప్రస్తుతములు, లలితములును గాజాలవే! దీనికి సమాధాన మాకాలమందు పల్లియలలో శృంగారచేష్టావర్ణన మనౌచితి గాదని భావించుటయే తప్ప వేరొండు గత్యంతరము లేనట్లు దోచుచున్నది. మనమునందలి యుద్దేశముల చాలవరకు వ్యక్తము చేయుటయే వారికి సాధారణ విషయమై యుండనోపును.

పెద్దకాలము కామోపభోగముల రమించి పుత్రికంగన్న విశ్వామిత్రుడు తపోభ్రష్టుడైనాడని వాచ్యమొనర్చుట యనవసర మని భావించి, మూలమున విస్తరముగా వ్రాయబడిన యీ విషయమును నన్నయ వదలివేసి యుండవచ్చును.

'ఇది మునినాధకన్యక యని నిస్పృహావృత్తి నున్న...' అని దుష్యంతునిచే నన్నయ యనిపించుట మూలముకన్న బాగున్నట్లు తోచుచున్నది. మానవుడెన్నడైనను పొరబడుట సహజము గాన దుష్యంతుడు మూలమునందువలె తనయూహనే యాధారము చేసికొని శకుంతల ఎవరో తెలియకయే యామెను బెండ్లాడు మని యడుగుటకంటె నన్నయ వ్రాసినది దుష్యంతుని యుచితజ్ఞతను తెలియజేయును. మూలమున మణిమయాద్యాభరణముల నిచ్చెదనని దుష్యంతుడు భోగాశ చూపినాడు. కాని నన్నయ దానిని వదలి వేసినాడు. ఆ కోమలియందనురాగ ముపలక్షించి, ఆమె జన్మవృత్తాంతమును వినినతరువాతనే రాజభోగముల ననుభవింపు మని ఆమెను ప్రోత్సహించినాడు. ఇదియు దుష్యంతునిపాత్రను పోషించునదిగా యున్నది. ఈ విషయమున శ్రీ బ్రహ్మంగారి యుద్ధేశములు వినదగినవి! 'తుచ్ఛకామాపేక్షను ఆ యమాయకురాలిని గాంధర్వము శాస్త్రీయ మని నమ్మించి, కామావేశంబును నిలువరించుకొనలేక కక్కుర్తిపడి యా సాధ్వి నంటుగావించి కణ్వుడు వచ్చునంతవరకును నిల్చు ధైర్యములేక పారిపోయినాడు?' ఈ విషయమున ఎక్కువగా మొదటనుండియు నిలువరించుకొనలేని కామమును వ్యక్తము చేసినవాడు వ్యాసుడు చిత్రించిన దుష్యంతుడు. నన్నయ చిత్రించినవాడు 'మునికన్యక'యని నిస్పృహవృత్తి నున్నవాడు, గాంధర్వ మశాస్త్రీయ మని బ్రహ్మంగారి యుద్దేశమా? ఉత్తమక్షత్రియుల, మహాపురుష జన్మకారణభూతులైన వారి కలయిక విషయమై భర్త భార్యను కక్కుర్తిపడి యంటుగావించె నని వాడుదురేమో పండితులకే యెరుక! శకుంతల యమాయిక గాదే! నాకొడుకును రాజును జేసినయెడలనే నే నీపని కొప్పుకొందు నని రాజును ధైర్యముగా నడిగినదే! రాజమహిషియు రాజమాతయు గావలె నన్న కోరికగలదే!

మూలమున 'సకాముని కి సకామ వపుము' అని ధర్మయుక్తముగా దుష్యంతు డడిగినాడు. కాని నన్నయ 'పరస్పర ప్రేమంబు కాముడు పెంపఁ బొడగా' ననుట శకుంతలయందలి శృంగారభావంబును పోల్చుట కనుకుణంబుగా నున్నది. శకుంతలయం దీవరకే సాత్త్వికభావము లుత్పన్నమైనట్లు సూచింపబడినది కదా. మూలమున 'మమ జాయతే యః పుత్రః' అని శకుంతల యన్నట్లున్నది. కాని భర్తృప్రధాన సూచకముగను సాధ్వీ లక్షణయుక్తముగను నుండునట్లు నన్నయ 'నీ ప్రసాదంబున నా కుదయించిన నందనున్' అని శకుంతలచే ననిపించుట మెఱుఁగుగా నున్నట్లు దోచుచున్నది.

మూలమునందు శకుంతల జాల జాగ్రత్త కలది. యువరాజత్వము నడుగుటయే గాక 'రాజా త్వదనంతరం కర్తవ్యః' అని కూడ చేర్చినది. అంతేగాదు 'సత్యం మే ప్రతిజానీహి యద్వాహ వక్ష్యహం రహః' 'బ్రాహ్మం మే ప్రతిజానీహి ప్రతిజ్ఞాం రాజసత్తమ' అని గట్టిగా ప్రమాణమును ప్రత్యయార్థము గోరినది. తదనంతరము, గాంధర్వమున గొప్పకొనిన యామె, రాజా నీ కిం కేమి కావలె నని యడుగుటయే తడవుగా, దుష్యంతుని నమ్మనిదై 'రహో వివాహమైన గాంధర్వముకన్న బ్రాహ్మవివాహమే మంచిదనియు, లోకాపవాదశాంత్యర్థమనియు' యుక్తులం బల్కి 'పురోహిత సాక్షిగా వివాహము గావలె'నని గోరినది. 'రాజాలోచింపకయే (అవిచార్యైవ) దాని కొప్పుకొనినాడు.' అని యనుటలో తరువాత నాలోచించి శకుంతల యపనమ్మకమున కామెపై గోపగించియో, మరే కారణముచేతననో శకుంతల నాహ్వానింపలేదని సూచించినట్లున్నది. లేక యా పదము కామాతురత నైనను సూచింపవచ్చును. శాస్త్రీయ క్రియా వివాహానంతరము ఆమెను దుష్యంతుడు గూడి తరువాత పిలువకపోవుట యపరాధతరంబుగా నుండు నని దుష్యంతుని పాత్రపోషణమున కీ వివాహప్రశంసయే నన్నయ ఎత్తలే దని దోచుచున్నది. గాంధర్వ వివాహమును మాత్రము సూచించుట యుక్తముగా గన్పట్టుచున్నది.

దుష్యంతుడు 'నిన్నెన్నో రాజలాంఛనములతో తీసుకొని వెళ్ళెదను' అని మూలమున నాలాంఛనములను భోగములను మఱి మఱియు వర్ణించి 'సత్యం కరోమి' 'శపేయం సుకృతేనైవ' అనియు ప్రమాణము చేసి మరియు మోసగించినట్లు మూలమున నున్నది. దుష్యంతునకు భయము గలిగిన నాశ్రమము నుండి పారిపో నవసర మేమున్నది? మహర్షికి కోపము వచ్చినయెడల పరోక్షముందైనను దానిని జూపలేడేమి? లోకాపవాదభీతి శాస్త్రీయ వివాహమువలన దొలగిపోయినది కదా! 'శకుంతల ఎటులనూ యీ విషయమును కణ్వునకు తెలియజేయును. లేకపోయినను అతడు దివ్యదృష్టివలన దెలిసికొనగలడు' అని దుష్యంతుడు భావించి కణ్వునకు క్షమాపణ జెప్పి శకుంతల నేలుకొనుటవలన కణ్వుని శాంతింపవచ్చును గాని, శకుంతలను పుట్టినంటనే వదలి వేయుట ధర్మజ్ఞుడైన కణ్వుడు హర్షింపడను విషయము లోకజ్ఞుడైన దుష్యంతునికి తెలియదా? కణ్వునివలన భయంబును నన్నయ దుష్యంతునకు చూపలేదు. ఆఖరున నరాధిపుడు లోకాపవాదభీతిని బ్రకటించినాడని మాత్రము చెప్పినాడు. దుష్యంతునిభయమును గూర్చిగాని మనః ప్రవృత్తినిగూర్చి గాని నన్నయ ఏమియు వ్రాయక పాఠకుల యూహకే వదలినాడు.

పుట్టినదాదిగా బెంచి పెద్దచేసిన తండ్రి యను మతి లేకుండ, స్వయందానము చేసికొనిన శకుంతల, లోకజ్ఞానము లేనిదియు, బేలయు గాదు కావున తండ్రిని చూసి భయపడుట సహజమే. మూలమున గూడ నట్లే యున్నది. 'తస్మాత్స్వ ధర్మాత్ స్ఖలితా భీతా సా భరతర్షభ। అభవద్దోషదర్శిత్వాత్ బ్రహ్మచారిణ్యయంత్రితా' అని మూలమున శకుంతలనుగూర్చి వ్రాసిన శ్లోకము బ్రహ్మంగారెటుల జూడ మరచి 'శకుంతల భయపడిన దని నన్నయ వ్రాయుట బాగులేదని' ఏమో వ్రాయుటవలన ప్రయోజన మెద్దియో గన్పట్టలేదు. మూలమున శకుంతలను దుష్యంతుడు వీడ్కొనునప్పుడు శకుంతలయొక్క మనోవేదనను వ్యాసు డెంతయో కరుణాపూరితముగా సహజముగా చిత్రించినాడు. నన్నయ దానిని వదలి వేసినాడు.

శకుంతల మొదటగా కణ్వునకు తన వివాహముసంగతి జెప్పినటులను తరువాత దివ్యదృష్టివలన కణ్వుడు నీకు మహాత్ముడైన కుమారుడు గలుగు నని యన్నట్లును వ్యాసుడు వ్రాసినాడు. యీవిషయమున 'సగద్గదం, సవ్రీడా శుచిస్మితా

కృచ్ఛాఙ్ఛి దువాచ' అని శకుంతలమనః ప్రవృత్తిని చక్కగా చిత్రించినాడు. నన్నయ, మొదటనే కణ్వుడు దివ్యజ్ఞానమువలన వృత్తాంతము నంతను గ్రహించినా డని వ్రాయుట నాతని మహత్త్వము తెలియబడునుగదా! కణ్వుడు(మూలమున) 'రంభోరు' అనియు 'సకామాయాః సకామేన నిమంత్రః' అనియు దుష్యంతుడు పూర్వము శకుంతలతో ననిన పదములనే వాడుటలో దివ్యజ్ఞానమును సూచించియుండవచ్చును. శకుంతల కణ్వునితో 'రాజా తాతా జగామ హ... తస్య తాత ప్రసీదస్వ' అని యనుటలో తన పాతివ్రత్యమును వ్యక్తీకరించినది. 'నన్ను క్షమింపు' మని యడుగలేదు. కణ్వుడు 'అభ్యాగచ్ఛత్ పతి ర్యస్త్వాం భజమానాం' అనుటలో శకుంతల పూర్వమే దుష్యంతుని గూర్చి విని వరించియుండవచ్చునను ధ్వని యున్నది కాని 'ఋతవో బహవ స్తే హై గతాః వ్యర్థాః' సార్థకం సాంప్రతం హ్యేతత్' అని కూతురైన శకుంతలతో ననుట వెగటుగా దోచునట్లున్నది.

కణ్వునివలని వరంబుగా, మూలమున, శకుంతల సచివుడైన దుష్యంతుని కనుగ్రహము చేయు మని గోరినది. తెనుగుభారతమున 'నాకుద్భవిల్లెడు పుత్రుడు దీర్ఘాయురైశ్వర్య బలసమన్వితు డగు గాక' యని పుత్రప్రేమనే జూపుచు వ్రాయుటకంటె మూలమే యుదాత్తముగాను పాతివ్రత్యసూచకముగను యున్నది. కాని 'ధర్మువు నందే నాచిత్తం బెప్పుడు దగిలియుండుగాక' యని కోరుటచే పతిప్రేమను తండ్రియొద్ద వ్యక్తముచేయుటకు సిగ్గుపడి, సతీధర్మము తనయందు నిల్చుగాక యని కోరుకున్న దనుకొన వచ్చును.

దుష్యంతుడు రాకపోవుటగూర్చి శకుంతల మనఃప్రవృత్తిని దుఃఖమును గూర్చి కొంతయైనను మూలమునందువలె, నన్నయ వ్రాయకపోవుట లోపమేమో యనిపించుచున్నది. మూలమున దుష్యంతుని గూర్చి 'ఋషే ర్భయాత్తు దుష్యంతః స్మర న్నైవాహ్వయత్' 'గతే కాలే తు మహతి నసస్మార తపోధనాం, స్త్రీషు చాన్యా సూపభోగసక్తః' అని వ్రాయుటవలన శకుంతలా విషయమును చాల యల్పమైనదానిగా భావించినాడు దుష్యంతు డని యాతని శీలమును చెడగొట్టునదిగా యున్నది. నన్నయ యైనను దానిని మార్చి దుష్యంతుని శీలమును పోషించుటకు యత్నింపక మూలమునే యాథాతథ్యముగా చిత్రించినాడు. దీనినిబట్టి రాజున కిట్టి వివాహములు పరిపాటి యనియు బహుభార్యాత్వము ధర్మసహితమనియు స్త్రీలకే కట్టుబా ట్లేర్పడ్డనియు జెప్ప వాద మాభాస కల్పన గాదని తేలుచున్నది. శకుంతలకే ప్రాధాన్యము భారతమునం దీయబడినది. దుష్యంతుడు వెనుకకు ద్రోయబడినాడు.

పదునైదు సంవత్సరములు కణ్వు డూరకొనుటకు కారణము గన్పట్టదు. 'పుట్టిన యింటను పెద్దకాల ముండుట సతులకు దగదని' నన్నయయు 'నీవు నీ భర్తవద్దకు వెళ్ళవలయును' అని వ్యాసుడును కణ్వ వాక్యములుగా వ్రాసినారు. అర్థ మొక్కటే యైనను తండ్రియగు కణ్వుని వాక్యము నన్నయదే బాగునట్లున్నది. మూలమున సర్వదమనుడు 'శకుంతలా భర్తృకామా స్వయం యాతు యథేప్సితః' 'కృత్వా వాక్యం కిం కరోషి, గంతవ్యం భర్తృప్రీతిః తవాస్తిచేత్' అని యనుట విడ్డూరముగ నున్నది. వాడప్పుడే స్వాధ్యాయము జేయుచున్నవాడు కదా. తల్లిని గూర్చి యట్లనుట బాగుగ నున్నట్లు తోచదు. బహుశః రాజసభుణంబును, యువరాజగు తాను పిలువనిదే రాజు నొద్దకు బోవుట కాత్మాభిమానము దోచి తండ్రిపైగల కోపమును తల్లిపై ప్రసరింపజేయుటను, పై వాక్యములు వ్యక్తము చేయునేమో! కణ్వు డొప్పించిన తరువాత 'కిం చిరాయసి మాతః త్వం గమిష్యామో నృపాలయం' అని తల్లిని ప్రతిపూజించి నృపాలుడైన తండ్రియొద్దకు తెగవు తీర్చుటకో యన బయలుదేరినాడు. మూలమునగల కణ్వ శకుంతలా శాకుంతలుల సంభాషణములలోను, మరియు నచ్చటచ్చటను సర్వదమనుని శీలము, స్వభావము వ్యక్తము చేయబడినవి. నన్నయ వానినిగూర్చి యొక్క పదమైనను వ్రాయకపోవుట లోపమేమో యనిపించుచున్నది.

దుష్యంతుని సభలో శకుంతల 'మఱచిన దలపింపగ నదు నెఱుగనినాడెల్లపాట...' అనిన వాక్యము 'అజ్ఞః సుఖ మారాధ్యః......' అను భర్తృహరి శ్లోకమును జ్ఞప్తికి దెచ్చుచున్నది. రాజు నిరసన వాక్యములను వినిన తరువాత శకుంతల యందలి కోపాది భావములను యథామూలకముగా నన్నయ చిత్రించినాడు. 'తిర్యగైక్షత' అను భావమును 'కటాక్షించుచు' అని ద్వ్యర్థముగా రాజునం దనుకంపను గూడ సూచించుచు

తెనిగించినాడు. 'కెందమ్మి కలువ రేకులఁబోను 'శకుంతల' కోపారుణ నయనంబుల'కును సామ్యము బాగుగ నేయున్నది కాని కోపారుణితను వాచ్యముచేయక వదలి వేసిన బాగుండునని దోచుచున్నది. మూలమున శకుంతల 'నా వచనంబుల సేయ వేని నీ తల నూరు వ్రయ్యలగు' ననియు 'నీవు పిపీలికకంటెను, కాకికంటెనుగూడ మూర్ఖుఁడ'వనియువర్ధమిచ్చు వాక్యముల' దుష్యంతునితో పలికినది. అంతటి కోపావేశము నన్నయగారి శకుంతల కున్నట్లు గన్పట్టదు.

శకుంతల రాజును జూడగనే 'తలపఁగ నాఁడు వల్కినవిధం బెడదప్పఁగ జూచె నొక్కొ, చూడ్కులు విరసంబులై కరము క్రూరములైన...' యీ మొదలగు స్వాగతవాక్యము లమూలకములైనను సహజములుగనే గన్పట్టుచున్నవి. మూలమున గల 'ఏష పుత్రో హే తే రాజన్ మయ్యుత్పన్నః' అను శకుంతలా వాక్యము కన్న 'నీ యిచ్చినవరము దలంపవలయు చిత్తంబులోన' అని రాజునకు జ్ఞాపకముచేయుట మృదువుగానున్నది. మూలమునందలి శకుంతల కుండబ్రద్దలు గొట్టినట్లు మాట్లాడుస్వభావముగలదిగా గన్పట్టుచున్నది.

'ఏ నెఱుఁగ నిన్ను నెక్కడిదానవు మిన్నకయ యనుచితంబులు పలుకంగా నేల యరుగు మంబుజహానన, అని దుష్యంతు డనుటలో నేను నిన్నెఱుఁగను, ఎఱుఁగను అను రెండర్థములు గోచరించును. 'నేను నిన్నెఱుఁగుదును. ఐనను మిన్నకుంటిని. నీ వనుచితంబులు పలుకగా నేల?' అను యన్వయము గూడ సిద్ధించుచున్నది. మూలమునగూడ 'త్వయా సహ సమాగమం నస్మరామి' అనినాడు గాని నీవు నాభార్యవు కావు అని అనలేదు. మూలమున 'పూర్వప్రేతం తు భర్తారం పశ్చాత్సాప్యనుగచ్ఛతి' అని శకుంతలావాక్యము గలదు. నన్నయ 'పురుషుకు మున్న పరేతుండైన పదంపడి దానును బరేతయై' అని స్త్రీవిషయమున 'పదంపడి' యను పదమును మెఱుఁగుగా వాడినాడు. మూలమున 'ధరణీరేణుకుంఠితుడైన పుత్రుని యాలింగనము సంతోషదాయకము. సర్వదమనుడు సాభిలాషముగా మనస్వియై వచ్చినపుత్రుడు' అనువాక్యమందలి సొగసు నన్నయ వ్రాసిన పుత్రస్పర్శజ సుఖవర్ణన మందు రాదు, మూలమున శకుంతల దుష్యంతుని నిరసనంబును తిరస్కరించి నిస్పృహావృత్తిని 'కుమారుని మాత్రము నీవు వదలివేయ దగదు. నే నాశ్రమమునకు బోదును' అని యన్న తరువాత దుష్యంతుడు 'న పుత్ర మభిజానామి త్వయి జాతం శకుంతలే, అశ్రద్ధేయ మిదం వాక్యం కథయంతీ న లజ్జసే' అని శకుంతల శీలమును శంకించుచు మాట్లాడినాడు. కాని నా భార్యవు నీవు కావని స్థైర్యముగా ననలేదు. 'నీ వృత్తము సందేహాస్పదము' అని మాత్రము సూచించినట్లున్నది. నన్నయ 'ఇట్టి లోకవిరుద్ధంబుల కే మోడుదు'మని ధ్వనిమాత్ర సూచన గావించి వదలివేసినాడు. మూలమున 'మేనకా నిరనుక్రోశా వర్ధకీ, విశ్వామిత్రః లుబ్ధః కామపరాయణః' అని దుష్యంతు డని, వెంటనే 'మేనకా అప్సరసాం శ్రేష్ఠా మహర్షిశ్చాపి తే పితా' అనుటలో సంగతి మేమియు గోచరింపదు.

'సువర్ణమణిముక్తాద్యాభరణంబుల నీకు గావలసినవానిని భోగార్థము తీసికొనుము' అని మూలమున దుష్యంతు డనుట యనుచితం బనిపించుచున్నది. భార్య కానిచో దండింపవలెను గాని భరణమిచ్చి పంపుట న్యాయమా? దానివలన వ్యక్తముగా సభలో శకుంతలయందు దనకు గల యనురాగము గన్పట్టును. ఇచ్చో వ్యాసుడు సభాసదుల మనఃప్రవృత్తిని గూర్చి మౌనముగా నుండుట గమనార్హము. 'అశ్రద్ధేయ మిదం వాక్యం' అని రాజనుటలో నీకు సాక్ష్యమెవ్వరును లేరు అని సూచించినాడు. నన్నయ మూలమునందలి దుష్యంతుని దూషణ భూషణాదులను వదలివేసినాడు. మూలమున శకుంతల తన నడువడియొక్క అయుక్తతను గూర్చి రాజు మాట్లాడినాడని గ్రహించినది. కావుననే 'రాజన్ సర్షపమాత్రాణి మ య్యఘాని ప్రపశ్యసి। ఆత్మనో మేరుమాత్రాణి పశ్యన్నపి న పశ్యసి॥' అని యారంభించి 'వర్ధకీ పుత్రిక వీవు' అన్నందులకు 'నీ పూర్వపితామహు డూర్వశీ సంజాతు డని' జెంపపెట్టు పెట్టినది.

మూలమున దుష్యంతునిచే నాఖరుసారిగా తిరస్కరింపబడిన శకుంతల మహాక్రోధాగ్ని దందహ్యమానయైనది. నన్నయగారి శకుంతల 'బోరన' దొరగు కన్నీటిం దుడుచుకొన్నది. ఇందేది యుచితతరమో చెప్పుట సాధ్యము గాదు. మూలమునందలి శకుంతల పతివ్రతయు ననురాగపూరితయు నైనను భావావేశమునందు తీవ్రతం జూపుచు పురుషునికి కోపమున దీసిపోనట్లు గన్పట్టుచున్నది. నన్నయగారి

శకుంతల పతివ్రతయు, కించిత్స్వార్థపరయు సహజ మాతృగుణ ప్రధానముగా గన్పట్టుచున్నది. బీజప్రాధాన్యమున క్షత్రియుయు నంగును పరమకోపనుండైన విశ్వామిత్రుని కూతురును, అన్యాయముగా భర్తృతిరస్కృత యైనప్పుడు కోపానల దందహ్యమాన యగుట సహజమే. మహాసాధ్వియు పతివ్రతయు నగుటచే, చింతాక్రాంతయై భగవంతునిపై భారము నైచుటయు గూడ స్త్రీజనోచితమే.

మూలమున 'సన్నియమ్యాత్మనోంగేషు తతః క్రోధాగ్ని మాత్మజం' అనుటలో నాత్మజపదము భరతునికి గూడ నన్వయమై వాని కోపావేశమును జూపుచు యుక్తముగా నున్నది. ఆకాశవాణి పలికిన తరువాత దుష్యంతుడు మూలమున శకుంతలను సాంత్వపూర్వకముగా ననునయించి క్షమాపణ గోరుకొనినాడు. తన మూకీభావమునకు గారణము నామెకే సభలో జెప్పినాడు. అది యెంతయు తగియున్నది. నన్నయ 'అతి ప్రణయ గౌరవంబున సంభావించి' అనినాడు. కాని చిరకాలానంతరము రాజలక్షణ సమన్వితుడైన కుమారునితో వచ్చిన శకుంతలను రాజసభలో నవమానించినందుల కామెకు క్షమాపణ చెప్పుట రాజోచితమును భర్తృకర్తవ్యము గూడను. దానిని నన్నయ వదలివేయుట ముఖ్యపాత్ర పోషణకు లోటుగల్గిన దని జెప్పవచ్చును. దానినిగూడ యూహించుకొనవచ్చును గాని అది వ్యక్తము జేయదగిన విషయము. పాత్రపోషణ శోభస్కరము నని జెప్పవచ్చును. మూలమున 'పతికృతే నార్యః క్షాంత్యా పాతివ్రత్యం వ్రజంతి' అని గురుసుగా మాట్లాడినందులకు శకుంతలను రాజు మెల్లగా మందలించుటయు బాగుగనే యున్నది.

మొత్తమున తేలిన విషయము లివియని దోచుచున్నది. మూలమున నున్న సొగసులను, సహజ సౌందర్యవర్ణనములను, స్వభావోక్తులను కొన్నిచోట్ల నన్నయ వదలివేసినను చాలవఱకు మూలము ననుసరించి కథాప్రాధాన్యత చెడకుండ వ్రాసినాడనుట న్యాయమని తలంతును. 'బెక్కడల నసావధానుడయ్యె ననుట' సువిమర్శనము గాజాలదు. నన్నయ మూలమును ప్రత్యక్షరము నతివిమర్శనాపూర్వకముగా చదివియే తెనిగించుటకు బూనుకొనినాడు. అతని కవితయందలి సొగసు లనేకములు మూలమునందలివే. సాధ్యమగునంతవరకు మూలమునందలి సొగసుల తెనుగునకు దేర్చినాడు. కథను సంక్షిప్తము చేయవలయును గాన కొన్నింటిని వదలివేసినాడు. మరి కొన్నింటిని ధ్వనిగర్భితముగా జూపినాడు. కథను సుప్రసన్నము చేయుటకై కొన్నిమార్పులను దెచ్చినాడు. పై వ్యాసమునందలి యుచితానుచిత విమర్శనకు సహృదయులగు పాఠకులే దగుదురు.

# నల్లంచుల తెల్లచీర

కావ్యశ్రీ

తెల్లజామి పండు వర్ణంలో వున్న ఆ అమ్మాయి వంటికి ఆ నల్లంచుల తెల్లచీర మరింత అందాన్ని— వింత చందాన్ని— చేకూరుస్తూవుంది. అంతవరకు హిమవంతంలాగ నిశ్చలంగా కూర్చున్న రాజన్ ఆ అమ్మాయిని—కాదు—ఆ నల్లంచుల తెల్లచీరను— చూడగానే— నయాగరా జలపాతంలాగా పాతాళానికి కృంగిపోయాడు— తుఫాను చెలరేగిన హిందూ మహాసముద్రంలా కల్లోలపడి పోయాడు. అదిగో— అదే— నల్లంచుల తెల్లచీర— తాను ప్రాణంతో సమానంగా ప్రేమించి— పోగొట్టుకొన్న తన ప్రభకు— మిక్కిలి ముచ్చటైనచీర— అదే— నల్లంచుల తెల్లచీర— తనముందు సజీవంగా నడిచి వెళ్ళిపోతూవుంటే—రాజన్ అనుకోకుండా మనసులో ఒక సంవత్సరం వెనకకు జరిగాడు.

ప్రభను రాజన్ తన కళాదేవతగా— కరుణామయిగా— ప్రేమించాడు— లాలించాడు— ఆరాధించాడు. ఆమె వంపులుతిరిగిన కనుబొమ్మల సొంపులు చూస్తూ— కళాకాంత మధురమంజుల కలస్వనాన్ని— కావ్యశ్రేణి కరుణ కవితాగీతాన్ని— ఆలకించేవాడు. ఆమె పాలనవ్వుల పండువెన్నెలలో— వంప వందనవనాల సౌందర్య సంపదనూ— వేయి గులాబీల గుబాళింపు పరిమళాన్నీ— చవిచూచేవాడు. ప్రభకు నల్లంచుల తెల్లచీర అంటే— షాజహానుకు 'తాజమహలంత— యిష్టం! అత నెప్పటికీ మరిచిపోలేడు— ఆనాడు- . తనను అన్యాయంగా— అన్యాయంచేసి- ఒంటరిగా వదలిపోయే ముందురోజు— పట్టుబట్టి కారులో తనతోబాటు బజారంతా తిరిగి తిరిగి మరీ కొనితెచ్చుకొంది ప్రభ ఆ నల్లంచుల తెల్లచీరను. కుందనపుబొమ్మలా— సంపంగిపూవులా— మిసమిసలాడే ఆమె నవయౌవ్వన సువర్ణదేహానికి ఆ నల్లంచుల తెల్లచీర— అందాలబీచికి అరుణారుణ సంధ్యారాగములా— యెంతో అందంగా వుండేది. అతనికి బాగాజ్ఞాపకం— ప్రభ చనిపోయేటప్పటికి ఆ చీరతోనేవుంది. తన జీవితాన్ని—తన భావిచరిత్రను తారుమారుచేసిన నల్లంచుల తెల్లచీరను—తన గుండెలలో గుబాళించే సుందర స్వర్గాన్ని పెకలించి—శాశ్వతంగా—రగులుకొనే ఫ్యూజియామా అగ్నిపర్వతాన్ని నెలకొల్పిపోయిన— ఆ నల్లంచుల తెల్లచీరను రాజన్ యెలా మరిచిపోగలుగుతాడు?

అదిగో— అదే— నల్లంచుల తెల్లచీర—కట్టుకొని ఆ అమ్మాయి బీచ్‌లో తనముందునుంచే నడచి వెళ్ళిపోతూవుంటే— అతనికి— మరిచిపోలేని మధుర స్వప్నంలా— గడచిపోయిన కమ్మనిజీవితం- మనసులో మెరిసింది. కూర్చున్నచోటనే—ఆ ఇసుకలోనే—లోతుగా లోలోతుగా దించుకుపోతున్నట్లు బాధపడుతున్నాడు రాజన్. ఇంతలో మరొక యువదంపతుల కలకల నవ్వులకు యీలోకానికి వచ్చిన రాజన్ ముఖం పైకెత్తాడు. ఆ నల్లంచుల తెల్లచీర— దూరంగా— మలుపుదాటి వెళ్ళిపోయింది. అంతకు ముందురోజే యెంతో సరదాపడి కొని కట్టుకొన్న ఆ నల్లంచుల తెల్లచీర అంచయినా మాయకముందే— తాను చిత్రిస్తూ వున్న ఆమె చిత్రములో ఆ వంపులు తిరిగిన కనుబొమ్మల సొంపులు— ఇంపుగా దిద్దకముందే— తనను మాయచేసి— మనసును మసిచేసి- మాసిపోయిన ప్రభను తలచుకొంటూ అలాగేకూర్చుండిపోయాడు రాజన్.

అరగంట తర్వాత ఆ నల్లంచుల తెల్లచీర అమ్మాయి తిరిగి తనముందునుంచే వెళ్ళిపోతూవుంటే అప్రయత్నంగా అత నామె ముఖంలోకి చూశాడు. "ఎంత ఆశ్చర్యం! సంవత్సరం క్రింతం తనను దగాచేసి పోయిన ప్రభ— అస్తమించిన సూర్యుడు ఉదయించినట్లుగా— మళ్లా బ్రతికివచ్చిందా? అదే ముఖం— అదే నవ్వు ముఖం— ఆ వంపులు తిరిగిన కనుబొమ్మల సొంపులు అచ్చంగా అవే! చూస్తూ చూస్తూ కాదని యెలా అనుకోవటం?" అనుకొంటూ

వుండగానే— ఆ అమ్మాయి— ఆ వంపులు తిరిగిన కను బొమ్మల సొంపులు గల అమ్మాయి— ఆ నల్లంచుల తెల్లచీర గల అమ్మాయి— మసక చీకటిలో— మబ్బులోని మెరపులా మెరిసి మాయమయ్యింది. మరో అరగంట నిద్రలేని కలలతో గడిపి రాజన్ తేలు కుట్టిన వాడిలా త్రుళ్ళిపడి లేచాడు. ఏదో ఉద్రేకం- ఏదో ఉద్వేగం — సముద్రపు కెరటాలులాగ— ముంచుకువచ్చింది. "ప్రభా! పూర్తికాకుండా వుండిపోయిన నీ చిత్రాన్ని పూర్తిచేస్తాను ప్రభా! నీ నల్లంచుల తెల్లచీర — నీ వంపులు తిరిగిన కనుబొమ్మల సొంపులు ఈసారి యథాతథంగా చిత్రిస్తాను ప్రభా!" అని గట్టిగా అరిచాడు. కాని యెవరికీ వినిపించలేదు. అసలా మాట లతని పెదవులుదాటి బయటకు రానే లేదు. ఆ అర్థంకాని ఆరాటంతోనే రాజన్ కారు తీసుకొని బయలుదేరాడు. అంతకంతకు కారు వేగం హెచ్చిపోతూవుంది. కారు—మనసు—పోటీపడి— ఒకదాన్నిమించి మరొకటి ముందు కురుకుతున్నాయి. ఆ వంపులు తిరిగిన కనుబొమ్మల సొంపులు—ఆ నల్లంచుల తెల్లచీర తప్ప అతనికి మరో వస్తువే కనిపించటం లేదు. ఆ! ఆ!! ఆ!!!—"అమ్మా" అంటూ కళ్ళు మూసి— స్పృహ తప్పి పడిపోయాడు రాజన్.

మరునాడు రాజన్ కళ్లు తెరిచి చూచేటప్పటికి వాతావరణమంతా విచిత్రంగా వుంది. ఏదో మందుల కంపు. కార్తీక మాసంలో తెల్లవారు ఝామున గోదావరి స్నానానికి బయలుదేరిన బ్రాహ్మణ వితంతువులు చదివే అర్థంకాని మంత్రాలులాగ యేదో తెలియని గొనగొన ధ్వని. ప్రక్కమంచంమీద నెవరో మూలుగుతున్న చప్పుడు. అప్పటికి గ్రహించాడు రాజన్ తానున్నది హాస్పిటలని. అరే! తనకుకూడా చేతులకు తలకు కట్లుకట్టారే! అక్కడకు తానెలా వచ్చాడు? ఎందుకు వచ్చాడు? అనే అర్థంకావటంలేదు. ఇంతలో టక టకమని బూటు చప్పుడు. అటు చూశాడు. గుండెలు ఝల్లుమన్నాయి. తనదగ్గరగా వస్తున్న ఆమె ముఖం చూచి — ఆ వంపులు తిరిగిన కనుబొమ్మల సొంపులు చూచి "ప్రభా—ప్రభా" అంటూనే కళ్ళుమూశాడు రాజన్.

"ప్రభ కాదండీ — నాపేరు చంద్రాబాయి" వయ్యారం ఒలకబోస్తూ — చిరునవ్వులు కురిపిస్తూ కలుకుతూ పలికింది ఆ నర్సు—స్టెతస్కోపు సవరించుకొంటూ.

"మీ—రు— మీ—రు" కళ్ళు తెరకుండానే నసిగేడు.

"అవును. నేనే! నిన్న బీచ్‌లో చూశారుగా- ఓహో యీ నర్సు వేషంలో పోల్చుకోలేక పోతున్నారా?" అంటూ ఆమె థర్మామీటరు తీసింది.

"నర్సు— చంద్రాబాయి" అని తనలో తాను గొణుక్కొంటూ నెమ్మదిగా కళ్లు తెరిచి వారగా ఆ వంపులు తిరిగిన కనుబొమ్మల సొంపులు చూస్తూ "నే నిక్కడకు ఎలావచ్చాను" అన్నాడు.

"ఏమయిందో మీకు తెలియనే తెలియదా" ఆశ్చర్యాన్ని సూచిస్తూ కళ్లు మిటకరిస్తూ "మీ కారు లైటు స్తంభానికి ఢీకొంది. గాయాలు బలంగా తగిలి స్పృహతప్పి పడిపోతే యెవరో మిమ్మల్ని యిక్కడకు చేర్చారు." అంటూ థర్మామీటరు నోటికందించింది, యిక మాట్లాడవద్దన్నట్లుగా. ఆమె చూపులలో యేదోమత్తుమందు—మేదో నిషానుణం—వుంది. కాని ప్రభ చూపులలోని ప్రశాంతత ప్రసన్నత యీామె చూపులలో లేవు అనుకొంటున్నాడు రాజన్.

రాజన్ హాస్పటల్లోనున్న పదహారురోజుల ల్లోను వారిద్దరి హృదయాలు వీలయినంత దగ్గరపడ్డాయి. ఆ వంపులు తిరిగిన కనుబొమ్మల సొంపులు చూస్తూ ప్రభను చూచినట్లే తృప్తిపడేవాడు రాజన్. తన తళుకు బెళుకులకు లొంగిపోయాడు కదా అని మురిసేది చంద్రాబాయి. కాని అతని సాన్నిధ్యంలో తనకు తెలియకుండానే యేదో అవ్యక్తమైన ఆనంద రసానుభూతిని పొందేది. ఆవేళ రాజన్ రిలీవయి వెళ్ళిపోతున్నాడు. మేడమెట్లు దగ్గరకువచ్చి "చంద్రా సెలవా" అంటూ ఆ వంపులు తిరిగిన కనుబొమ్మల సొంపులు చూస్తూ వెనుదిరిగి నడుస్తున్నాడు.

"ముందుకు చూచి మరీ నడవండి — పడితే మళ్లా తగలగలవు గాయాలు" పరిహాసంగా నవ్వింది చంద్రాబాయి.

"మానిపోయే గాయాలు యెన్ని తగిలినా ఫరవాలేదు చంద్రా! నీ అమృతహస్తంతో ఆరోగ్యము యిట్టే చేకూరుతుంది. మానని గాయమంటావా అది

నా హృదయానికి తగిలేవుంది. అంతకన్న పెద్దగాయం తగలనూ తగలదు. అది మానరూ మానదు. కాని నీసాన్నిధ్యంలో దాన్ని మరిచి పోగలుగుతున్నాను చంద్రా"

ఆ మాట కెందుకో చంద్రాబాయికి ఆశతోబాటు ఆ వేదన కూడా కలిగింది. అడిగింది. "మీ యిల్లెక్కడ రాజన్"

అదిగో యీ వీధి చివరకనిపించే పెద్దమేడే మా నివాసం! వీలయినప్పుడల్లా రావచ్చు. కాని ఒక నియమం చంద్రా! నీ వెప్పుడువచ్చినా ఆ నల్లంచుల తెల్ల చీర మాత్రమే కట్టుకు రావాలి"

"ఏం—ఆ చీరలో బావున్నానా?"

"ఆ చీరంటే నాకు చాలాయిష్టం" ఆమె గిన ప్రశ్న వేరు. అతను చెప్పిన సమాధానము వేరు. "అలాగే వస్తాను రాజన్" అంటూవుండగానే అతను చకచకా మెట్లుదిగి వెళ్ళిపోయాడు. కృష్ణవేణి వచ్చి "ఏమిటి చంద్రా: పేషెంటు వెళ్ళిపోతే ప్రియుడే వెళ్ళిపోయినట్టుగా బాధపడుతున్నావు" అని వీపు చరిచే వరకూ ఆమె అలాగే వుండిపోయింది నిశ్చల నిర్నిమేష నేత్రాలతో. "పేషెంటు ప్రియుడు కాకూడదా—ప్రియుడే పేషెంటు కాకూడదా" యీ మాటలు చంద్రాబాయి హృదయంలో యెవరో వినిపించీ వినిపించనట్టుగా పలికేరు.

*　　*　　*

"అబ్బా! యింత మేడలో యేకాంతంగా యెలా వుంటున్నావు రాజన్" కనురెప్పలల్లాల్చింది.

"వంటరి జీవితానికి యేకాంతంగాక మరేముంటుంది చంద్రా" వంటరి జీవితం అనేటప్పటికి జపాను పెరల్ హార్బరుపై విరుచుకు పడినప్పుడు హిట్లరు సంతోషించినంత — సంతోషం కలిగింది చంద్రాబాయికి! ఆనాడు హాస్పటల్లో పలవరించినప్పటి నుంచి "ప్రభ" ఎవరని అడుగుదామనుకొంటూనే అడిగే ధైర్యంచాలక—యెలాగో తెనకు తోచినట్లుగా అర్థం చెప్పుకొని సమాధానపడుతూ గడుపుకొని వచ్చిన చంద్రాబాయి యిక అడగకుండా వుండలేకపోయింది.

"రాజన్......ప్రభ యెవరు?"

"ప్రభ—యెవరని చెప్పమంటావు చంద్రా! నా ఆరాధ్య దేవత. నా జీవిత పరమావధి. నా కళా సామ్రాజ్య రాజరాజేశ్వరి. నాయేకైక పెన్నిధానం చంద్రా! ప్రభ నా జీవిత సహచారిణి. అగ్నిసాక్షిగా పెళ్ళాడిన నా అర్ధాంగి" అతనికళ్ళు చెమర్చాయి. చంద్రాబాయి మనసు కూడా అదోలా అయిపోయింది'

"రాజన్—ఏమయ్యింది ప్రభ?"......

"ఏమని చెప్పను చంద్రా! నా హృదయానికే హృదయమైన నా ప్రభ సంవత్సరం ముందు పాము కరిచి చనిపోయింది" శ్రావణమాసపు కారు మేఘాలు క్రమ్మిన ఆకాశంలాగ వున్న విచారరేఖా ఛాయలు గ్రమ్మిన అతని ముఖం చూడగానే చంద్రాబాయికి కూడా కళ్ళనీరు క్రమ్మాయి.

"చంద్రా— ఈ నీ నల్లంచుల తెల్లచీరతో— వంపులు తిరిగిన కనుబొమ్మల సొంపులతో మానని నా హృదయ గాయాన్ని మరిపిస్తున్నావు చంద్రా" ఆవేశంతో నిట్టూర్చాడు రాజన్. చంద్రాబాయి ఆ మేడమీది గదులన్నీ తిరిగిచూచి "రాజన్! నువ్వింత గొప్ప చిత్రకారుడివై యుండీకూడా యెప్పుడూ మాటమట్టుకైనా చెప్పలేదే" ఆశ్చర్యంగా అడిగింది.

"ఏమని చెప్పకోమంటావు చంద్రా! మరిచి పోలేని నా హృదయంలోని గాయాన్ని మానుపలేని కళలు నాకున్నాయని చెప్పకోమంటావా?"అతనిమాట లోని ఆవేదనంతా ఆమె నిట్టూర్పుల్లో పెల్లుబికింది. కొంతసేపటికి తేరుకొని అడిగింది. "నీ మనసు నంతగా గాయపరిచిన దేమిటి రాజన్?" రాజన్‌కు ఒక్కుమ్మడిగా దుఃఖం ముంచుకువచ్చింది. బొంగురుపోయిన గొంతుకతో గట్టిగా అరిచాడు. "అదే చంద్రా-అదే-నువ్వుకట్టిన ఆ నల్లంచుల తెల్లచీర— ఆ వంపులు తిరిగిన కనుబొమ్మల సొంపులతో కళకళలాడే ఆ నీ నవ్వు ముఖం" దుఃఖాన్ని ఆపుకోలేక ముఖం చాటుగా త్రిప్పుకొన్నాడు. తన సౌందర్య వర్ణన రాగానే చంద్రాబాయి కన్నులు మెరిసేయి. పోగొట్టుకొన్న మహా పెన్నిధానం దొరికిన దానిలా మొగమంతా కన్నులు చేసికొని చూస్తూవుంది అతనివంక. రాజన్ దుఃఖాన్ని దిగమ్రింగుకొని అన్నాడు "చంద్రా! నాప్రభకూడా అచ్చంగా నీలాగే వుండేది. అవంపులు తిరిగిన కనుబొమ్మల సొంపులు — ఆ యింద్రనీలాలు

లాంటి కనురెప్పల కాటుక రేఖలు— అచ్చంగా అవే చంద్రా? ప్రభకువలే నీకుకూడా నల్లంచుల తెల్లచీర అంటే ఇష్టంకదూ; అందుకని నిన్ను చూస్తూవుంటే ప్రభను చూచినట్లుగానే వుంటుంది చంద్రా! ఆతృప్తితోనే యింతకాలం నిన్ను చూస్తూవున్నాను. అంతకన్న నాకు మరోవుద్దేశ్యం లేదు చంద్రా" అంటూనే అతను ముఖం చేతులలో కప్పుకొని గబగబా లోనికి వెళ్ళి తలుపులు బిగించుకొన్నాడు. తన అసభ్యప్రవర్తనకు ఎదుటివాళ్లు ఏమనుకొంటారో అన్న ఆలోచన కూడా లేకపోయిందతనికి! ఆమె గాలిలో కట్టుకొన్న ఆశాసౌధాలు నేలమట్ట మయ్యాయి. అంతవరకు రాజులాగ దైవంలాగ పూజించిన ప్రజలే— అకస్మాత్తుగా వ్యతిరేకించి తనను లోనికిరావద్దని పారిస్ కోటగుమ్మం తలుపులు బిగించినప్పుడు నెపోలియన్ కూడా యిప్పుడు చంద్రాబాయి పొందుతూవున్నంత మనోవ్యధ పొంది వుండడు. ఇక మాట్లాడేది లేక — మాట్లాడలేక — రాజన్‌ను పిలవకుండానే గుండెలు చేతితో పట్టుకొని వెళ్లిపోయింది చంద్రాబాయి.

ఆరాత్రి చంద్రాబాయికి నిద్రపట్టలేదు అసలు " ప్రభ " అనటంతోనే తనకెందుకో—యేదో—యే మూలనుంచో- హృదయంలో కలుక్కుమంది. ఒకవేళ యీ ప్రభ తన అక్కగారే కాదుకదా! అదెలా సంభవమవుతుంది. రాజన్ ఆంధ్రుడు. తామో— కన్నడులు. ఇద్దరకూ పెళ్ళి యెలా పొసగుతుంది. పైగా ఆరువందల మైళ్ళ దూరంలోనా? మరి రాజన్ అల్లా అన్నాడేం?—ప్రభ అచ్చంగా తనలా వుండేదా? "కనుబొమ్మలు, ముఖం— అచ్చంగా నావేనా— నాకులాగే ప్రభకుకూడా నల్లంచుల తెల్లచీర అంటే ఇష్టమా — నన్నుచూస్తే ప్రభను చూచినట్లుగానే వుంటుందా" ఈ మాటలు మాటిమాటికీ జ్ఞాపకం వస్తున్నాయి చంద్రాబాయికి. అవునుమరి తన అక్క పేరు కూడా 'ప్రభ' కావటం— ఆమె అచ్చంగా తనలా వుండటం— ఆమె అనుమానానికి దోహదం చేశాయి. నాలుగేళ్ళ క్రితం తమయింటి డాక్టర్ తన అక్కకు మందిస్తూ — తనను — తన అక్క అని పొరపడి యెలావుందని అడగటం చంద్రాబాయికి బాగా జ్ఞాపకం! దానితో రాజన్ ప్రభ తనప్రభ యేమో నన్న అనుమానం మరింత దృఢంకాజొచ్చింది. అయితే అది యెలాసాధ్యం అని శంక— యేమో యెందుకు కాకూడదూ— తాను ఇల్లు విడిచి వచ్చిన యీ మూడేళ్ళలోను ఎటువంటి మార్పులు జరిగాయో అన్న సమాధానం! ఈ ఆలోచనతో రాత్రంతా జాగరణ చేసి చంద్రాబాయి తెల్లవారుఝామున నిద్రపోయింది.

తరువాత మూడురోజులకు వచ్చిన ఆదివారం సాయంకాలం చంద్ర, రాజన్ బీచిలో కూర్చుని వున్నారు. మాట్లాడకుండానే వచ్చారు. వచ్చి మాట్లాడకుండానే కూర్చున్నారు. ఆ మౌనం — ప్రళయంలా— భయంకర స్వప్నంలా— వారికే బాధాకరంగా వుంది. ఆ మౌనాన్ని భగ్నపరుస్తూ ఎలాగైతే నెమ్మదిగా చంద్రాబాయి మాట్లాడింది.

"రాజన్! ఎప్పటి కప్పుడు అడుగుదా మనుకొంటూ అడగలేక పోతున్నాను. ప్రభ పుట్టిల్లు యే వూరు?"

"తిరువాన్కూరు దగ్గర— ఎర్నాకులం."

చంద్ర ఉలిక్కిపడింది. "ఆ! ఎర్నాకులమా!"

"అవును. అలా అడుగుతున్నావేం?"

"మరేంలేదు. మాదికూడా ఆ వూరే కదూ— అందుకని." సంబాళించుకోబోతూవుంది. కాని హృదయారాటం మాటిమాటికి మీరిపోతూనే వుంది. "రాజన్! ప్రభ తండ్రి యెవరు? పేరుతెలుసా?" సమాధానం కోసం గుండెలు బిగపట్టుకొని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఆపుచేసి మరీ యెదురుచూస్తూ వుంది చంద్రాబాయి.

"ప్రభ తండ్రిపేరు గోవింద కన్నప్ప— పెద్ద పేరుపొందిన వకీలు— లక్షాధికారి—"

ఇక వినలేకపోయింది ప్రభ. నాభి తిన్నవాగ్ని నాలుకలా ఆమె నాలుక పిడచకట్టుకు పోయింది. ఆమె సూక్ష్మదేహం యెక్కడెక్కడికో— అలా అలా— తేలితేలి పోతూవున్నట్లుగా అనిపించిందామెకు —ఎగురుతూ ఎగురుతూ వున్న విమానం రెక్కలు విరిగి నేలకూలినట్లుగా అయిందామె మనస్సు.

"ఏం చంద్రా అలావున్నావేం! ఆయన్నెరుగుదువా?"

"ఆయన మాతండ్రేకదూ" అనబోయి ఆగిపోయి "ఆయన మాతండ్రి స్నేహితుడే కదూ" అనేసింది.

రాజన్ అడగకుండానే చెప్పటం ప్రారంభించాడు.

"ప్రభ అంటే నాకు ప్రాణం! ప్రభకు నల్లంచుల తెల్లచీర అంటే ప్రాణతుల్యం! మనసుపడి ఆ చీర కొనుక్కొన్న మరునాడే ప్రభ పాముకరచి చనిపోయింది. చంద్రా! చనిపోయింది ప్రభకాదు—నా హృదయం. చనిపోవటానికి ప్రభ మానవకాంతకాదు చంద్రా దేవతాస్త్రీ! కాకపోతే అమృత తుల్యమైన ఆ చిరునవ్వుల తెరిపివెన్నెలలు—కళాకాంత క్రమ కళానైపుణ్య చిహ్నాలు అయిన ఆ సొంపుల వంపు కనుబొమ్మలు—ఆమెకెలా వస్తాయి చంద్రా! ఆమె మనసుపడి కట్టుకొన్న ఆ నల్లంచుల తెల్లచీర అంచయినా మాయకముందే — ఆ వంపులు తిరిగిన కనుబొమ్మల సొంపులక్రింది కాటుకరేఖ రవ్వంతయినా కందకముందే — నా జీవన ప్రభాతానికి మబ్బులు క్రమ్మి గాఢాంధకారమయ్యింది చంద్రా! ఏదుర్ముహూర్తపు ఘడియలలో తెల్లవారిందో కాని—అంతకుముందు గడిచిన రోజులులాకాక — ఆ రోజు యెంత కాలకూటం విరజిమ్మిందనుకొన్నావు చంద్రా!—"

చంద్రాబాయి కివేవీ వినిపించటంలేదు. "ఈ ప్రభ మున్ముందటికీ 'అక్క' అయితీరాలి. ఏమిటీ విచిత్ర సంఘటన? నిజంగా యీమె తన అక్కే అయితే తాను చేయవలసిన దేమిటి? తానామె స్థానం ఆక్రమించి రాజన్ హృదయానికి శాంతి చేకూర్చటమా? అసంభవం! తనకా హక్కెది? ప్రభకు వున్న దేహసౌందర్యం వుంది కాని మనోసౌందర్యం తనకేది! కళంకపడిన తాను రాజన్‌ను కూడా కళంకపరచటమా? ప్రభ హృదయానికి అది చిచ్చుపెట్టినట్లే అవుతుందిసుమా" అనుకొంటూవుండగా రాజన్‌చేయి భుజం మీదపడింది. దానితో చంద్రాబాయి తృళ్ళిపడి యీ లోకంలోకి వచ్చి—సంబాళించుకొని అడిగింది—

"రాజన్! ప్రభకు నీకూ ప్రథమదర్శనం ఎలాకుదిరింది ఏ విధంగా చూచినా మీకిద్దరకూ కలిసే అవకాశం లేదుకదా?"

"దైవనిర్ణయానికి — కాలదూరాలు — జాతిమతాలు అడ్డువస్తాయా? రెండుసంవత్సరాలక్రితం నేను తిరువాన్కూరులో యేర్పాటుచేసిన నా ఆర్టుఎగ్జిబిషను చూడటానికి ప్రభ తండ్రితో కలసి వచ్చింది, కాని ఆమె చూచింది నా ఆర్టునుకాదు నన్ను — ఆ విషయం గ్రహించి గోవిందకన్నప్పగారు మాకిద్దరకూ వివాహం చేశారు. అప్పటినుంచి ప్రభ నానీడలో నీడై నాలో కలిసిపోయింది."

బీచిలో మసకచీకట్లు క్రమ్ముకుంటున్నాయి. చంద్రాబాయి తన భుజంమీద వేసిన రాజన్ చేతిని మెల్లిగా తన చేతులలోనికి తీసికొని మృదువుగా స్పృశిస్తూవుంది.

"నా ప్రభ రూపంలో మళ్లా నువ్వు కనిపించావు చంద్రా—నిన్ను చూస్తూ మానని నా హృదయగాయాని మరిచిపోగలుగుతున్నాను చంద్రా" అంటూ అతడామెను దగ్గరకు తీసికొని గుండెలకద్దుకొని ఆమె విశాల లలాటఫలకంమీద ముద్దుపెట్టుకొన్నాడు. ముంగురులు సవరించాడు. ఏమిటీ జీవన్మరణ సమస్య! ఏమిటీ అర్థంకాని ఆరాటం — ఏమూలలో మిణుకుమిణుకు మంటూవున్న వాంఛాదీపాంకురం అఖండంగా వెలుగసాగింది చంద్రాబాయి హృదయంలో. ఏమిటిది? ఆశా? నిరాశా? రెండూనా? రెండూకావా? అమృతము విషము ఒకేసారి త్రాగిన మనోవికారమా! ఇది పగలా? రాత్రా?

రాజన్! ప్రభ తన పుట్టింటి సంగతులేమన్నా చెప్పిందా నీకు—?"

"ఏ విషయంలో—"

"ప్రభకు ఒక చెల్లెలుండేది—"

"అవును. ఆమె యెవరికీ చెప్పకుండా ఒక డాక్టరుతో లేచిపోయింది—ఆమెకోసం బెంగపెట్టుకొని తల్లి చనిపోయింది—అందుకే గోవిందకన్నప్ప తన పెద్దకూతురు కోర్కెను కాదనకుండా మా యిద్దరకూ పెళ్ళిచేశాడు—ఈ సంగతులన్నీ నీకు తెలుసునన్నమాట—" అంటూ ఆమెముఖంలోకి చూశాడు. అప్పటికే ఆమె యేడుస్తూ వుంది. రాజన్ కంగారుపడి—"అదేమిటి చంద్రా! నువ్వేడుస్తావెందుకు—చంద్రా—?" అంటూ కళ్ళుతుడవబోయాడు. అతని చేయిత్రోసేసి లేచి నిలుచుంది. "చంద్రా!" అంటూ చేయిపట్టుకున్నాడు. విదలించుకొని "రాజన్ క్షమించు! నన్ను ముట్టుకోకు" అనేసి అతనంటున్న మాటనైనా వినిపించుకోకుండా విసవిసా నడిచి వెళ్లిపోయింది చంద్రాబాయి. పెనుచీకట్లు క్రమంగా నలుదిక్కులా గాఢంగా క్రమ్ముకొన్నాయి.

"ప్రతిసాయంత్రం తప్పక దర్శనమిచ్చే చంద్రాబాయి నిన్నను రాలేదేమా" అనుకొంటూ రాజన్ చంద్రాబాయి ఇంటికే బయలుదేరాడు. కాని యిల్లు తాళంవేసివుంది. నిరాశతో తిరిగివచ్చేస్తుంటే ప్రక్కయింటి కాలేజీ స్టూడెంటు చెప్పాడు. "చంద్రాబాయికి నిన్న మధ్యాహ్నం అకస్మాత్తుగా జబ్బు చేసింది— హాస్పిటల్లోవుంది" అని.

"ఎలావుంది చంద్రా" అన్న రాజన్ గొంతుకు విని భారంగా కనురెప్పలు పైకెత్తి ఒక్కసారి రాజన్ వంక చూచి మళ్లా కళ్లుమూసుకొనే చేయిచాపింది చంద్ర! అత డామెచేయి పట్టుకొని "ఎలావుంది చంద్రా!" మళ్లా అడిగేడు. ఆమె కళ్లు తెరవకుండానే నీరసంగా అడిగింది.

"రాజన్ — నన్ను చూచి ప్రభ చిత్రాన్ని వ్రాస్తున్నానన్నావు— అది పూర్తయిందా?"

"వ్రాస్తున్నాను చంద్రా! రేపటికి పూర్తవుతుంది."

"రేపటికి తప్పక పూర్తికావాలి రాజన్."

ఇంతలో మరొక నర్సువచ్చి అధికంగామాట్లాడవద్దని వారించటంవల్ల రాజన్ విధిలేక వచ్చేయవలసి వచ్చింది. ఇవతలకు వచ్చి నెమ్మదిగా అడిగేడు రాజన్.

"సిస్టర్! అసలు చంద్రాబాయికి జబ్బేమిటి?"

"జబ్బేమీ లేదు - ఎందుకో తెలియదుగానీ— ఆమె విషం తీసుకొంది."

"ఆ! విషం—" కంగారుపడ్డాడు రాజన్.

"అవును. విషం తీసుకొంది. వెంటనే కక్కించేశాం. అయినా గుండెలు పట్టేసింది. ప్రస్తుతము ప్రమాదపరిస్థితే అని చెప్పాలి"

"ఇంతకూ యెలావుంటుందంటావు సిస్టర్."

"ఏం చెప్పగలం? యీరాత్రి గడిస్తే బ్రతికినట్లే."

రాజన్‌కు అకస్మాత్తుగా స్ఫురించింది. సంవత్సరం క్రితం సరిగా యీరోజు రాత్రేకదూ ప్రభ చనిపోయింది. ఆమాట జ్ఞాపకం రాగానే మలేరియా జ్వరం వచ్చినవాడిలా గడగడలాడిపోయాడు. సిపాయీల తిరుగుబాటులాగ శరీరంలోని ఒక అంగం మరొక అంగంతో సంబంధం లేకుండా సంకల్పవికల్పాలకు అతీతంగా— ఇచ్ఛా అనిచ్ఛలకులోను కాకుండా పనిచేయటం ప్రారంభించాయి. భావాభావ శూన్యుడై రాజన్ స్తంభించి పోయాడు. "తనంటే ప్రాణం యిస్తున్న చంద్ర నిష్కారణంగా విషం యెందుకు తీసుకొంది? తాను చేసిన నేరమేమిటి? ఆదివారంనాటి సాయంత్రం బీచిలో తన అనుమతిలేకుండా ముద్దు పెట్టుకొన్నందుకు బాధపడిందా! అయితేమాత్రం — ఎదుటివాళ్లు చేసిన తప్పిదానికి తానే శిక్షఅనుభవిస్తుందా! పోనీ అప్పుడే ముఖాముఖి యెందుకు చెప్పకూడదు?" యీ ప్రశ్నలన్నీ రాజన్ మనసులో మసకమసకగా నీడల్లా కదిలాయి. కాని వాటిని రాజన్ స్పష్టంగా గుర్తించలేక పోయాడు. కొంతసేపటికి బాగా తెలివివచ్చాక ఒక్కసంగతి మాత్రం మనసుకు తట్టింది. "ప్రభలాగే వున్న చంద్ర ప్రభలాగే తనను నరకంలో వదలి వెళ్ళిపోతుందా?" ఆమాట జ్ఞాపకం రాగానే అతనికి చెమటలు పట్టాయి. "మాని పోతుందన్న నా హృదయంలోని గాయాన్ని మళ్లా రేపుతావా భగవాన్" అని బరువుగా నిట్టూర్చి వెళ్ళిపోయాడు రాజన్. అగస్టు విప్లవంలాంటి మహా భయంకర సంక్షోభము గుండెలలో దాచుకొని కళ్లుమూసికొని పడుకొనివున్న చంద్రాబాయి వారిమాటలు విని ఏ భగవంతుడికో కేలుమోడ్చింది. "అక్కా! నీ ప్రేమారాధకుని— నీ ప్రణయ పూజారిని నేను మైలపరచ దలచుకో లేదు. ఆ పవిత్రమూర్తిని పవిత్రంగా వుంచుదాం! నీదేవుడిని కళంకపరచి నీ హృదయానికి చిచ్చుపెట్టలేను. ఇంతవరకు మీ కందరకు చేసిన ద్రోహానికే— చింతిస్తూ— ప్రాయశ్చిత్తం అనుభవిస్తున్నాను. తెలియక నీకు తలపెట్టిన యెగ్గుకు మన్నించు అక్కా" ఆమాటలామె యెండిన పెదవులు దాటి బయటకు రాలేక పోయాయి. మూసిన కన్నులనుండే రెండు వేడికన్నీటి కణాలు జారి తలగడ మీద పడి యింకిపోయాయి. జాడలుమాత్రం మిగిలేయి.

మరునాడు రాజన్ తాను చిత్రించిన ప్రభ చిత్రాన్ని పట్టుకొనివచ్చాడు. సరాసరి చంద్రాబాయి మంచం దగ్గరకే వచ్చాడు. కాని ఆ మంచంమీద చంద్రాబాయికి బదులు మరొకస్త్రీ పడుకొని వుంది. రాజన్ నిర్ఘాంతపడి — నిశ్చల — నిర్నిమేష నేత్రాలతో — అలాగే చూస్తూ నిలుచుండి పోయాడు. ఇంతలో కృష్ణవేణి అనే నర్సువచ్చి అడిగింది. "బ్రదర్! మీ పేరు రాజన్ కదూ"

"అవును—చంద్రాబాయి యెక్కడ?"

"ఆమెను మీరింక చూడలేరు. ఆమె యీ లోకాన్నే విడిచివెళ్లింది. ఇదిగో యీ కవరు మీ కోసం విడిచివెళ్లింది" అంటూ ఒక కవరు అందించిందామె. రాజన్ మాటలు తాత్కాలికంగా మరిచిపోయాడు. యాంత్రికంగా ఆ కవరు నందుకొని తాను వ్రాసి తెచ్చిన ప్రభ చిత్రాన్ని అక్కడే వదలి పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ గబగబా వెళ్లిపోయాడు. అతని గుండె బండబారి పోయింది. ఇక విచారానికి లెక్క చేయడు అతడు సర్వగుణాలకు అతీతుడై పోయాడు. కవరు చించి చదవటం ప్రారంభించాడు.

"రాజన్! డాక్టరుతో లేచిపోయిన ప్రభ చెల్లెల్ని నేనే! నీకు భార్య అయిన ప్రభ స్వయానా నాతో బుట్టవు. నేనొక కులటను. వ్యభిచారిణిని. వెర్రిమోహంలోపడి డాక్టరుతో లేచిపోయి—తర్వాత మరొకడితో కూడిపోయి—ఇలా భ్రష్టురాలనయ్యాను. ఇక యింటికి వెళ్ళటానికి మనస్కరించక నా కాలేజీ చదువును వినియోగించుకొని నర్సు ట్రెయినింగయి కడ కీలకంగా నిన్ను కలుసుకొన్నాను. నేను పారిపోయివచ్చి మూడు సంవత్సరాలయింది. అందుకే మీ పెళ్ళి సంగతి నాకు తెలియలేదు.

రాజన్ నిన్ను నేను ప్రేమించానో లేదో యిప్పటికి నాకర్థంకాలేదు. కాని నీ సంపదాన్ని— నీ ధనాన్ని మాత్రం వాంఛించాను. ఇంతకు ముందు చాలా మందిని వల్లో వేసుకొన్నట్లుగానే నిన్ను కూడా మోసగించి నిన్ను—నీ సంపదనూ—అనుభవించాలనుకొన్నాను. ప్రభ పోలికలు నాలో చూచి నీవు నా వంకకు ఆకర్షింపబడటం నా కెంతో గర్వకారణంగా వుండేది. అప్పట్లో ప్రభయెవరో నాకు తెలియదు.

ఇప్పుడు ప్రభ యెవరో తెలిసింది కాబట్టే యీ చివరి ఘట్టం యిలా ముగిసింది. ప్రభ పవిత్రమూర్తి. చిన్నతనాన్నుంచి శీలమంటే ప్రాణంకన్నా యెక్కువగా నమ్మేది. నేను మాత్రం చిన్నప్పటినుంచీ యీ విధంగానే వుండేదాన్ని. మా అక్క నాకెన్నో విధాలబోధించేది. నా వ్రాత యిలావుంటే ఆమె మాటలు యెలా వింటాను రాజన్. విననందుకు ఫలితం యిప్పుడనుభవిస్తున్నాను. నీవంటి ఉత్తముడు నాకు లభించటమంటే సామాన్యంకాదు. కాని ప్రభ మా అక్కని తెలిశాక కూడా అన్యాయం చేయటం నా కిష్టంలేదు. తన దేవుడు కళంకపడితే మా అక్క పవిత్ర హృదయం యెంతబాధపడుతుందో నాకు తెలుసు రాజన్. అందుకే నామనసు మార్చుకొని—పవిత్రుడవైన నిన్ను పవిత్రంగా నేవదలి—మా అక్కకే వదలి—యెంతవింతగా నీ జీవితంలో ప్రవేశించానో అంత చింతగా నీ జీవితమునుండి దూరమవుతున్నాను. నేను మహాపాపిని. నాకు తెలుసు. అయినా నన్ను నీవు క్షమించగలవు."

సెలవు —ఇట్లు—"చంద్ర"

ఆ వుత్తరం చదివిన అతని మనసు — వెళ్లకూడదను కొంటూనే సినేటుకు వెళ్ళి మర్దరైపోయిన జూలియస్ సీజరు—లాగ—అయిపోయింది

ఒకనాడు రాజన్ యదాలాపంగా న్యూస్ పేపర్ తిరగేస్తూ తనకళ్ళనుతానే నమ్మలేకపోయాడు. తాను వ్రాసిన ప్రభ చిత్రం అందులో అచ్చయివుంది. దానిక్రింద "అఖిలభారత చిత్రకళా ప్రదర్శనములో ప్రథమ బహుమతి పొందిన చిత్రం—చిత్రకారిణి—మిస్. కృష్ణవేణి—నర్సు" అని వ్రాయబడివుంది. రాజన్ కెందుకో గట్టిగా నవ్వాలని బుద్ధిపుట్టింది. నవ్వేడు. కాని ఆ నవ్వులో సంతోషంగాని — మార్దవంగానీ లేవు. అనార్కలి సమాధిచుట్టూ వ్యర్థంగా తిరిగే సలీంలాగ అతనా బొమ్మను చూస్తూ మాటిమాటికి పిచ్చిగా నవ్వుతూనే వున్నాడు. అచ్చులో సరిగా అంటని వంపులుతిరిగిన కనుబొమ్మల సొంపులుగల ప్రభకట్టిన ఆ 'నల్లంచుల తెల్లచీర' అంచులను పెన్నుతో దిద్దుతున్నాడు. ఆ కలంలో సిరాలేని సంగతి అతను చూడనేలేదు. అందుకే ఆ వెలితి వెలితిలాగే వుండిపోయింది.

# కలగూరగంప

## ఘటికాచల మాహాత్మ్యము

### శ్రీ రావూరి దొరసామిశర్మ

పై శీర్షికతో వ్యాస మొకటి శ్రీ కేతవపుర వేంకట రామకోటిశాస్త్రిగారు భారతి 1955 మే నెల సంచికలో వ్రాసిరి. అయ్యది తెనాలి రామకృష్ణ కవి విరచిత ఘటికాచలమాహాత్మ్య పద్యకృతిం గూర్చినది.

ఘటికాచల క్షేత్రము నాజన్మభూమి. మొన్నటి వఱకు నందే నివసించుచుండినవాఁడను. తన్మాహాత్మ్యమును దెనుఁగున నేనును రచించితిని. ఆ క్షేత్ర మాహాత్మ్యములఁ గూర్చి చక్కగా నెఱుఁగుదుఁ గానఁ బైరచనను బురస్కరించుకొని కతిపయ విషయములఁ దెలుప నుద్దేశించి దీనిని వ్రాయుచున్నాను. వెనుకటి వ్యాసములో గ్రంథకవితాశైలీసమీక్ష కొంత గావింపఁబడినది. నే నాయంశమును దడవఁదలఁప లేదు.

తెనాలి రామకృష్ణకవి తొలుత శైవుఁడై యుండు నప్పుడు లింగకవి పేరితో నుద్భటారాధ్య చరిత్రను, దర్వాత వైష్ణవుఁడై కృష్ణకవి పేరితోఁ బాండురంగమాహాత్మ్యమును దరువరి ఘటికాచల మాహాత్మ్యమును రచించెను. ఈ యంతిమగ్రంథము నకుఁ దగిన కృతిపతి లభింపక కొంతకాలము నియ్యది నిరంకితముగాఁ గృత్యాద్యాశ్వాసాంత రహితముగా నిలిచిపోయినది. రామకృష్ణకవి ఇంతలోఁ గాలధర్మ మందెను. అతని పౌత్రుఁడు (పేరు దెలియరాదు) మహారాష్ట్రప్రభు వగు ఖండోజీరాయని కీ కృతి దెచ్చి యిచ్చె. ఈ కృతిని దన కంకితముగాఁ గృతిముఖాదుల రచింపు మని ఖండోజీ తన యాస్థాన కవీంద్రుఁ డగు వేంకటగిరీంద్రుని గోరెను. నేఁ డీ మాహాత్మ్య కృత్యాదిరచన వేంకటగిరీంద్రునిది; రామకృష్ణ కృతము గాదు. అందీవిషయ మీ క్రింది పంక్తులచే స్పష్టపరుపఁబడినది!

> 'భువిని విచిత్రవాక్సరణిఁ బొల్చిన
> తెన్నలి రామకృష్ణ స
> త్కవికులవజ్రపాణి ఘటికా గిరి నాథు
> మహాచరిత్రముం
> సవరణగా రచించి కృతిసంతతి
> కన్యక కెన్న యోగ్యుఁడై
> ధవుఁ డొకరుండు లేమిఁ గని తా
> మదిలోన వితర్కుఁ జెందుచుం,
>
> పొలు పేది......ఎంచి కృతికన్య నింట నే
> యుంచె నాతఁడు. (1 ఆ-14, 15.)

> కావున రామకృష్ణ కవి కల్పిత
> కావ్య మొకండు దెచ్చి స
> ద్భావముతోడ నా కతని
> పౌత్రుఁ డొసంగె మదంకితంబుగా
> నీ విఁక హారనాయకము
> ణి ప్రతిమానముగా మదీయ వం
> శావళి చెప్పి కూర్పుము య
> శంబు భృశంబుగ సంఘటిల్లఁగన్ (1-20)

ఇవి ఖండోజీరాయని పల్కులు

రామకృష్ణకవి ఘటికాచలమాహాత్మ్యము నారద భృగుసంవాదము లోనిది. ఇది యే పురాణము లోనిదో గ్రంథమునఁ జెప్పఁబడలేదు. ఇందలి యాశ్వాసములు మూఁడు... అందలి విషయము లివి-

(1) విష్ణుక్షేత్రములగు 108 తిరుపతుల ప్రశంస. అందు ఘటికాచల ప్రస్తావము. తర్వాత ధవళాంగుని కథ —ధవళాంగుఁడు సాధుసంగమప్రభావమున శాప విముక్తిఁ జెందును.

(2) నారద జన్మకథ - నారదుఁడు ఘటికాద్రి కరిగి విష్ణుసాక్షాత్కారముకొఱకుఁ దపము చేయు విషయమిందుఁ గలదు.

సప్తమహర్షుల కథ- వీరు హరి దర్శనార్థము ఘటికాద్రి కరిగిరి; హరి నరహరిస్వరూపముతోఁ బ్రత్యక్షమయ్యె.

(8) వైఖానసుల వృత్తాంతము; నరహరి శాంత స్వరూపముఁ దాల్చుట. వైఖాన ఘటికాద్రి కరుదెంచిరి. వారి కోర్కెచే నరసింహస్వామి యా యద్రిచుట్టు సమతలము చేయ నాంజనేయుని నియోగించె. అందు నిర్మితమైన గ్రామము హనుమద్గ్రామము మనఁబరఁగె. తర్వాత లక్ష్మీ నరసింహుల కల్యాణ మహోత్సవము జరిగె—ఇంతటితో గ్రంథసమాప్తి.

మాహాత్మ్యములం దాయా క్షేత్ర తీర్థ దైవతముల ప్రభావ విశిష్టత ప్రపంచింపఁబడును. ఇందుఁ గేవలము క్షేత్ర మాహాత్మ్యప్రశంస ప్రధానముగా నున్నది.

వెనుకటి వ్యాసకర్త లిట్లు వ్రాసిరి—"ఈ స్థల మాహాత్మ్యమును బట్టియే నారదునకు, సప్త మహర్షులకు, వైఖానసులకు హరి ప్రత్యక్షమైనట్లు వర్ణింపబడినది. నరసింహాకృతిని హరి ప్రత్యక్షమగుటవలన అది నరసింహక్షేత్ర మనవచ్చును. సప్తర్షుల ప్రయాణమును బట్టి చూడఁగా నీ ఘటికాచల క్షేత్రము కాంచీ నగరమునకు మూడు యోజనములు దక్షిణముగా నున్నట్లు తెలియుచున్నది. ఈ ఘటికాచల మాహాత్మ్యమునకు గీర్వాణ మాతృక యున్నట్లు గానరాదు. ఈ ఘటికాచల ప్రసక్తి పురాణము లందును గానరాదు. కావున నీ గ్రంథము రామకృష్ణ కవి స్వకపోల కల్పిత మనవచ్చును. ద్వితీయాశ్వాసమందలి నారదజననకథ మాత్రము బ్రహ్మవైవర్త పురాణము నుండి గ్రహించి రామకృష్ణ కవి కొన్ని మార్పులతోను కూర్పులతోను రచించినాఁడు."

(భారతి 1955 మే 61 పుట.)

ఇఁక నిందుపై నా చెప్పఁదలఁచిన విషయముల నుటంకించెద. ఘటికాచల క్షేత్రము నేఁటి యుత్తర ఆర్కాడుజిల్లా, వాలాజాతాలూకాలోని చోళలింగపురము. (షోళింగపురము, షోళింగర్-*Sholinghur*) అను స్థలము. చోళసింహపుర మని ఇటీవల యచ్చటి వైష్ణవు లందురు గాని యది యప్రసిద్ధ, మనాకరము. ఈ షోళింగరు ఎస్. ఐ. రైల్వే, అరకోణం స్టేషనుకుఁ బడమర 18 మైళ్ళ దూరమున నున్నది. ఇది చిత్తూరికిఁ దూర్పున 25 మైళ్ళ దూరమున నున్నది. ఈ షోళింగరుకు వేలూరు, చిత్తూరు, అరకోణము, తిరుత్తణి, కంచి మున్నగు చోట్లనుండి బస్సుల రాకపోకలు గలవు. పై మాహాత్మ్యమునఁ జెప్పఁబడినట్లీ క్షేత్రము కాంచికి సుమారు 36 మైళ్ళ దూరమున దక్షిణమున నున్నది. (మూఁడు యోజనములు). ఈ షోళింగరునకు దక్షిణమున $1\frac{1}{2}$ మైలు దూరమున నున్న కొండకు ఘటికాచల మని పేరు. అందు 'పెద్దకొండ, చిన్నకొండ' అను రెండు కొండలు పడమర తూర్పుదిక్కులం దొకదాని కొకటి యభిముఖముగా నున్నవి. పెద్దకొండయందు యోగలక్ష్మీనరసింహస్వామియు, చిన్నకొండయందుఁ జతుర్భుజ శంఖచక్రములతో యోగాంజనేయ స్వామియు వెలయుచున్నారు. ఈ రెండు దైవములును యోగారూఢులై శాంతవిగ్రహులై భక్తజన సమస్తవాంఛాప్రదులై భాసిల్లుచున్నారు. ఈ కొండలకు మెట్లున్నవి. కొండక్రిందఁ గొండపాళె మను చిన్నగ్రామము గలదు. ఇయ్యది గొప్ప సేవాస్థలము. సప్తర్షి ప్రముఖు లీ క్షేత్రమున వసించిరని, సప్తర్షి, సనకసనందనాదుల ననుగ్రహించుటకు నరసింహస్వామి యందుఁ బ్రత్యక్షమయ్యెనని దీని మాహాత్మ్యము దెలుపుచున్నది. ఇందనేక తీర్థరాజములు గలవు. అవి వ్యాధిహరములు; స్వాదుజల పూర్ణములు. ఈ స్థలమున భక్తులెల్లప్పుడు కొండలలో సేవసేయుచుందురు. సేవచేయువారికి అనివార్యములన దగిన సమస్తవ్యాధులు, శాకినీఢాకిన్యాది పిశాచగ్రహ బాధలు, అభిచార క్షుద్రప్రయోగములచేఁ గల్గు చిత్తభ్రమాది సంకటములు పూర్తిగా నశించునని, సంతానాది సమస్తకామితము లచిరమున సిద్ధించుననీ కీర్తి. పూర్వ మీ ఘటికాచలమునకు షోళింగరునకు సంబంధము లేదు. చోళరాజుచే లింగస్థాపన చేయఁబడి కట్టఁబడిన యూరగుటచే చోళలింగపుర మను పేరు గలిగె. రెండవ మైసూరుయుద్ధము (1781 సం॥) షోళింగరులో జరిగిన కాలమునఁ బైకొండలలోని యుత్సవ విగ్రహములఁ దాఁచియుంచిరఁట. తర్వాత నరసింహస్వామి యుత్సవమూర్తిని షోళింగరు దేవాలయమున స్థాపించిరఁట. నాఁటినుండి షోళింగరు ఘటికాచలము లొక్కటైనవి. నేఁడు ఘటికాచల దేవస్థాన కార్యాలయాదులు షోళింగరు దేవాలయముననే యున్నవి.

ఇది క్షేత్రవిషయము.

ఈ ఘటికాచల మాహాత్మ్యమునకు సంస్కృత మాతృక గలదు. అయ్యది బ్రహ్మవై(కై)వర్త పురాణమునం దుత్తరఖండమున భృగుపరాశర సంవాద

ములో 22 సర్గల గ్రంథము. కడచిన విక్రమ సం. కాక, తత్పూర్వ విక్రమాబ్దమునఁ జెన్నపురి హిందూ విద్యా నిలయ ముద్రాక్షరశాలలో ముద్రితము. (అనఁగా 76 ఏండ్ల క్రింద.)

ఈ సంస్కృత గ్రంథమునకుఁ దెనాలి కవి గ్రంథమునకు నించుకయు సంబంధము గానరాదు. బాదరాయణసంబంధ మున్నట్లు ఘటికాచలమూ, నరసింహస్వామి యను స్థలదైవతములు రెండువినా తక్కిన యందలి కథలకు సమన్వయము లేదు. తెనాలి వారి మాహాత్మ్యములోని కథాంశములఁ బైని నేను సూచించితి. శాస్త్రిగారు తమ పూర్వవ్యాసములో నాకథలను సవిస్తరముగా వ్రాసియున్నారు. మావద్ద నున్న సంస్కృత ఘటికాచలమాహాత్మ్యము లోని కథాంశముల సంగ్రహముగాఁ దెల్పెద—

ఉత్తరదేశములోని మధురాపురము నింద్రద్యుమ్నుఁ డను రాజు పరిపాలించుచుండె. హరిభక్తుఁ డగు నాతఁడు కొంతకాలము తర్వాత ముముక్షువై రాజ్యము తనయున కప్పగించి తీర్థయాత్ర కరిగె. ఘటికాద్రి కరిగి నరసింహస్వామిని సేవించిన బ్రాహ్మణ్య మోక్షములు చేకూరు నని మునులవలన విని యటకు బయల్వెడలె. తిరుపతి చేరి వేంకటేశుని దర్శించి తర్వాత స్వర్ణముఖిలో స్నానముచేసి తత్తీరమున మఱ్ఱిచెట్టున రాక్షసు లిర్వురు వ్రేలాడుచుండుటఁ జూచెను. అందొక్కఁడు ఘటికాద్రి యందలి హనుమత్తీర్థమునఁ గ్రుంకి యేఁగుచున్న యూర్వశి తలవెండ్రుకలనుండి జలబిందువు పడుటచే రాక్షసత్వముఁ బాసి దేవత్వ మొందెను.

అచ్చటినుండి యింద్రద్యుమ్నుఁడు ఘటికాద్రి సమీపమార్గమున నేఁగుచుండ దేవేంద్రుఁ డెదురుపడి, ఘటికాద్రియందలి నరసింహపురమును గుంభోదరుఁ డను రక్కసుం డాక్రమించి ప్రజలఁ బీడించుట దెలిపి యా దానవుఁ బరిమార్ప నరహరి యా రాజున కనుజ్ఞ దనమూలమునఁ బంపెనని యెఱింగించె. రాజు రాక్షసులతో యుద్ధము సేయఁ గడఁగెను. నరహరి సురనాథుని ప్రార్థనచే హనుమంతుని రాజునకు సాయముగాఁ బంపె. అసురుఁ బాఱఁదోలి రాజు నరసింహపట్టాధిపుఁ డయ్యె. కయ్యమున సాయ మొనర్చిన హనుమంతునికిఁ బ్రీతికరముగ నాపట్టణమున కానాటినుండి హనుమత్పుర మను పేరు గలిగె.

ఒకనాఁడు రాజున కండు వసిష్ఠుఁడు కానఁబడెను. అమ్ముని ఘటికాచలములోని తీర్థవిశేషముల వానికి సంబంధించిన కథామాహాత్మ్యముల సవిస్తరముగాఁ దెల్పె. మఱియు హనుమన్నృసింహ దర్శన ప్రభావమున సఫలీకృతమనోరథులైన విశ్వామిత్ర వామదేవాది మహర్షిచరిత్రలు వినిపించె. వసిష్ఠునుపదేశమున రాజేంద్రుఁడు శైలమెక్కి నరసింహదేవుని సేవించె. అతఁడు సాక్షాత్కరించి రాజునకు బ్రాహ్మణ్య మోక్షముల నొసఁగె. ఇది యందలి కథాసారము. నడుమ నడుమ నెన్నో యుపకథ లేతత్ క్షేత్ర తీర్థ దైవత ప్రభావ ప్రకాశకములు గలవు.

ఘటికామాత్ర నిశ్చల తపస్సుచే సర్వమనోరథ సిద్ధు లిందు ఘటిల్లుటచే నియ్యది ఘటికాచలము నాఁ బరఁగె.

'ప్రకృత్యా ఘటికా మేకాం
కుర్వతాం తప ఉత్తమం,
వామదేవ మహర్షీణాం
ముక్తయే చ నృకేసరీ,
యతో హేమశిలాపృష్ఠే
హరి రావిర్బభూవ హ
ఘటికాతోషిత స్తస్మాత్
ఘటికాచల నామభాక్.'

(సం ఘటికా...22 అధ్యాయ 9-10 శ్లో.)

ఈ రెండు (సంస్కృ తాంధ్ర) మాహాత్మ్యములలోని కథలకుఁ బోలిక రవంతయు లేదు. రెండును భిన్నములు. ఈ రెండు గ్రంథములందు ఘటికాచలము, నరసింహావిర్భావము, హనుమదాగమనము, హనుమద్గ్రామము, సప్తర్షుల సాక్షాత్కృతి, నృసింహ కాంతిరూపము, వైఖానసుల ప్రాజమున్నగు నంశములు సమానములు.

తెనాలి కవి మాహాత్మ్యమున నిట్లుగలదు—

'ఎక్కుడు తపమునఁ దనువుల్,
చక్కఁగ ఘటికాచలాఖ్య శిఖరిస్థలిపై
నెక్కొను సప్తర్షులకున్,
దక్కిన 'యక్కారు కణ్ణి' నరహరిమూర్తిన్
(1 62)

ఇందలి 'అక్కారు కణ్ణి' తమిళ శబ్దము. దీని కమృత ఫల మని యర్థము. ఘటికాద్రి నరసింహస్వామి

యమృతఫల మను నర్థమున 'అక్కారు కణ్ణి' శబ్దమును దమిళభాషలోఁ బాసురము లను దేవతాస్తుతిలోఁ దిరుమంగై నమ్మాళ్వార్లు ప్రయోగించియున్నారు. ఆ శబ్దమును మనకవి వాడినాఁడు. ఈ క్షేత్రాన నరసింహస్వామివారి దేవి 'అమృతఫలవల్లీశ్వరి' నాఁబరఁగును. ఈ యమృతఫలాఖ్యా విషయము తెనాలి కృతిలోను గలదు.

'ఉర్వి నమృతఫలాఖ్య భక్తోచితాఖ్య, గలిగె...'
(3 2.0.)

షోళింగరులో నున్న యుత్సవమూర్తికి భక్తోచితాఖ్య ప్రసిద్ధము. సంస్కృత గ్రంథమున నున్న ట్లే ఘటికాచల నామసార్థక్యవిషయము తెనాలి కృతి యందును గలదు.

'ఘటికా మాత్రోపసేవాకలన
జనులకుం గాంక్షితార్థంబు లిందే
ఘటియించుం బ్రాగ్భవీయోత్కట
కుటిల మహాకల్మషంబు ల్దొలంగున్
స్ఫుటరీతిన్ దీనిభాతిన్ బొలుచునె
మఱి యీ భూమి నెందేని నంచు
త్కట కీర్తిం దెల్పు జాడం దగు
శిఖరవముల్ గల్గి రాజిల్లు దానిన్ (2 228.)
స్ఫటికాక్ష సరము చేకొని,
ఘటికామాత్రము జపింప ఘన మగు సిద్ధుల్
ఘటియింపఁజేయు దానిన్,
ఘటికాచల మచలభక్తిఁ గనుగొని యచటన్'
(3-233.)

రామకృష్ణుని ఘటికాచలమాహాత్మ్యమున కేదేని గీర్వాణ మాతృక యుండును. నేఁడు మన కది గోచరము గాలేదు. ఏమాతృక లేకయే యాధారము లేక కవి యీ మాహాత్మ్యమును స్వకపోలకల్పితము గావించె ననుట పొసఁగరానిమాట. రామకృష్ణ కవి తన చరమదశలోఁ జంద్రగిరిలో వసించె నని ప్రతీతి. అది విజయనగరరాజ్యము పెనుగొండనుండి చంద్రగిరికి మార్పఁబడిన కాలము. చంద్రగిరికిఁ దిరుపతికి ననతి దూరమునఁగల యీ ఘటికాద్రికి మనకవి విజయంచేసి యుండును. అత్తఱి నీ మాహాత్మ్యరచన కుపక్రమించి యుండు నని నాయూహ. కీ॥ శే॥ వేటూరి ప్రభాకర శాస్త్రిలవా రుద్భటారాధ్యచరిత్ర పీఠికలో నీ మాహాత్మ్యము పాండురంగమాహాత్మ్య రచనానంతర రచిత మని తమ యభిప్రాయమును వ్రాసిరి.

ఘటికాచలప్రస్తావము కాంచీమాహాత్మ్య విశ్వగుణాదర్శ ప్రభృతి గ్రంథములందుఁ గలదు. వెంకటాచల విలాస మను పద్యకృతి తంజావూరి గ్రంథాలయమునఁ గలదు. (సంఖ్య-258.)

'సప్తర్షులు తపంబు గావించుటయు నటుకు దేవేంద్రుఁడు రంభను బంపుటయు నాపెకుఁ దపోభంగము శక్యంబుగాక నెడలుటయు నంత నాకాశవాణి మునీశ్వరులతో మీరు ఘటికాచలంబున కరుగుఁడద్దాన భగవంతుండు మీకుఁ బ్రత్యక్షుఁడు గాఁగలఁడనియెను. అప్పుడు మునీశ్వరు లటనుండి కదలి ఘటికాచలంబునకు వచ్చి తపంబుచేయుట వర్ణితము.' కవినామము తెలియదు.'

ఈ విషయ మా గ్రంథముఁగూర్చిన వివరణమునఁ గలదు. గ్రంథ మసమగ్ర మని తెలియుటచే నీ సప్తర్షుల కథ యొకటేకాక తెనాలికవి కృతిలోని తక్కిన కథలు నయిత ముండియుండు నని యూహింపనగును. ఈ వేంకటాచలవిలాసము ఘటికాచల మాహాత్మ్య కథను జెప్పెడిది గానోపు. మావద్దనున్న గీర్వాణ మాతృకలో వేంకటాచల మాహాత్మ్యము దెల్పుచు నం దింద్రద్యుమ్న వృత్తాంతము సూచించి, తర్వాత యీ రాజునకు ముక్తిలభించుటకుఁ గారణమైన ఘటికాచల మాహాత్మ్యము చెప్పినట్లు వ్రాయఁబడియున్నది. అదేవిధముగ వేంకటాచల విలాసమున ఘటికాచల విలాసము దెల్పఁబడి యుండవచ్చు. వేంకటేశ్వర స్వామి తమ్ముఁడని యీ నరసింహదేవుఁ డన్నయని ఘటికాచలములోని జనవ్యవహారము నేఁడుగలదు.

నాతెల్పిన సంస్కృత మాహాత్మ్యమున కనువాదము తెనుఁగున వచనరూపమునఁ దొల్త వేలమూరి వేంకటసుబ్బ కవి వెలయించెను. ఆ గ్రంథము చదలువాడ సుందరరామశాస్త్రిలచేఁ బరిష్కరింపఁబడి చెన్నపురి శారదాంబా విలాస ముద్రాక్షరశాలయందు 1914 సం. లో ముద్రింపబడినది. గద్యరచన ప్రాచీన కావ్యధోరణి నడచినది. ఆ గ్రంథ మిప్పుడు లభ్యము గాదు. దానికిఁ బ్రేరకులు మా తండ్రిగారగు శ్రీ రాపూరి ఆదినారాయణ శాస్త్రిలని గ్రంథావతారికలోఁ గవిగారు వ్రాసియున్నారు. తర్వాత నేత న్మాహాత్మ్యమును సంస్కృతమాతృక ననుసరించి విపుల మగు పద్యకావ్యముగను, క్షేత్రవాసుల కోరికపై సంగ్రహ మగు వచన గ్రంథముగను తెనుఁగున నేను వ్రాసితి. వచన గ్రంథము ముద్రితము (1940 సం.)

శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులవారు ఘటికాచలమునఁ గొంతకాలము సేవార్థ మున్నవారై తమ బిల్వేశ్వరీయ కావ్యరత్నము నీ నరసింహస్వామికే యంకిత మొనర్చిరి. బిల్వేశ్వరీయము షోళింగరునకు సుమారు 25 మైళ్ళదూరాన నున్న తిరువలమను స్థల మాహాత్మ్యము. మీఁదుమిక్కిలి పంతులుగారు ఘటికాచల మాహాత్మ్యమును దెనుఁగు పద్యకావ్యముగా రచించి యున్నారని, యా వ్రాఁతప్రతి భారతీ సంపాదకుల వద్ద నున్న దని శ్రీ నిడదవోలు వేంకటరావుగా రొకపరి భారతిలోనే పంతులవారి చరిత్రఁ దెల్పు తమవ్యాసములో వ్రాసిరి.

ఘటికాచలమాహాత్మ్య కవితావిషయముల గూర్చి ప్రస్తావింపఁ దలఁపలే దని పైని వ్రాసితి. కాని శాస్త్రిగా రుటంకించిన యొకటిరెం డనౌచిత్యములకు యెఱిఁగిన సమాధానముఁ దెల్పుచున్నాను.

ధవలాంగుని కథకు సందర్భశుద్ధి తక్కువ. ఈ కథకు ఘటికాచలమునకు సంబంధము చెప్పఁబడలేదు. మాహాత్మ్యమునఁ జెప్పఁబడు కథల కన్నింటికిఁ బర్యవసానమున నేని యా క్షేత్ర తీర్థ దైవములతో సంబంధముండి తన్మూలమున వాని ప్రభావము ప్రపంచింపఁబడుట లక్షణము. సాధారణముగా మాహాత్మ్యములందు నానాపురాణములలో నెచ్చటెచ్చటనో కలకథల కన్నింటికిఁ దత్ క్షేత్రములకు సంబంధము గల్పించి క్షేత్రాది ప్రభావమును దెలుపుట సంప్రదాయముగాఁ గానవచ్చెడు. ధవలాంగుని శాపవిముక్తికి సాధుసంగమ కారణమే కాక ఘటికాచల దర్శనముఁ గారణముగాఁ జెప్పియున్న సముచితముగా నుండును. అట్లే చెప్పబడి యుండి తద్భాగమున గ్రంథపాతము గలిగెనేమో యని నా సంశయము.

మఱియొకటి- సప్తర్షులకు నరసింహస్వామి ప్రత్యక్షమయ్యె. వారు దేవుని శాంతరూప మొందఁ గోరిరి. అంత విమానం బొక్కటి గానఁబడియె.

'వారంతఁ దద్విమాన,
ద్వారము సొత్తెంచి నిలువ దక్షిణదిశగాఁ
జేరి వెసం బ్రసవాయుధ,
వైరి నిరీక్షించి ప్రమథవైభవ మెసఁగన్.'

కరముల శంఖచక్రములఁ దాల్చిన వాని
  మురువైన తెలినోటి యొరపువాని
లోవంక మూఁపుల రీవిఁ బొల్చిన వానిఁ
  బద్మాసనంబునఁ బరగువాని
యోగపట్టిక నొప్పు నూరుద్వయంబుపై
  దొరయ నిల్పిన కేలుదోయివాని
మేరుకూటంబుపై మిహిరబింబము లీల
  శిరముపై మకుటంబు చెలఁగువాని
బాలచంద్రుని పై నున్న బాలచంద్రుఁ
  బోలు నలకోర్ధ్వ పుండ్రంబు పొలుపువాని
గవకన వెలుంగు నంగారకవిధమునను
  గాన నయ్యెడి మిక్కిలి కంటి వాని.

మరియు...సౌమ్యాకారంబుదాల్చి నిల్చినవాని శ్రీ నరసింహదేవు నాలోకించి...యిట్లని నుతిసేయం దొడంగిరి ? అని యున్నది. (3 6, 7, 8.)

ఇందుఁ బ్రసవాయుధ వైరి (శివుఁడు) హరిని దర్శింప వచ్చె ననుకొనవలె సీసపద్య విషయము బాధకముగా నున్నదని శాస్త్రిగారి సందేహము.

ఇయ్యది శివ కేశవులలో నెవరికి సంబంధించిన దని యాశంక. 'కరముల శంఖచక్రముల దాల్చినవాని' అనుటచే విష్ణువు, 'మిక్కిలి కంటి వాని' అనుటచే శివుఁ డర్థమగుట బాధకము. ఈసీసము తర్వాతివచనము నరసింహస్వామి జెప్పుచున్నది గాన నిందలివి తద్విశేషణములే యగుట స్పష్టము. అప్పుడు పైఁజూపఁబడిన పరస్పర వ్యతిరేక విశేషణములకు సమన్వయ మెట్లు ? అందులకు నుత్తరమిది- శంఖచక్రములు విష్ణుసంబంధకములు. నరసింహదేవుఁడు త్రినేత్రుఁడు (మిక్కిలి కంటి వాఁడు). త్రినేత్రుఁడను విషయ మీ గ్రంథ

మందే కలదు. చూ|| సప్తర్షులకుఁ బ్రత్యక్షమైన నరసింహుని వర్ణించు వచనము- 'కోటీరమ్మదమదవిదారక పిశంగలోచనత్రితయాంచల ప్రోచ్ఛ్రి ద్విస్ఫులింగ సముదయుండును' (2 245).

మఱియు సందిగ్ధార్థమున కాస్పదముగాఁ దోఁచిన పై సీసము తరా వచనము నొకటి పద్యముఁ బరికింపుఁడు

శా|| మునులు...కృతాంజలులై యిట్లనినుతి సేయం దొడంగిరి.

'కం|| జయజయ సితపద్మాక్షా,
జయజయ నిటలాక్ష సర్వ జగదభిరక్షా.
జయజయ దుర్జన శిక్షా,
జయజయ దితిసుత విపక్ష సజ్జనపక్షా.'

(3 9.)

ఇది నృసింహ స్తుతిపద్యము - నృసింహుఁడు నిటలాక్షుఁడు. నరసింహుఁడు త్రినేత్రుఁడనుటకీ క్రింది ధ్యానశ్లోకము ప్రబలప్రమాణము—

'సత్యజ్ఞాన సుఖస్వరూప మమలం
క్షీరాబ్ధి మధ్యస్థితం,
యోగారూఢ మతిప్రసన్న వదనం
భూషా సహస్రోజ్జ్వలం,
త్ర్యక్షం చక్ర పినాక సా
భయకరాన్ బిభ్రాణ మర్కచ్ఛవిం,
ఛత్రీభూతఫణీంద్ర మిందు
ధవళం లక్ష్మీనృసింహం భజే.'

పై శ్లోకానువాదము కొక్కొండవారి రీయమున నిట్లుగలదు.

శా|| సత్యజ్ఞాన సుఖస్వరూపుఁ
గొలఁతున్ సద్దుగ్ధ వార్ధిస్థితున్
బ్రీత్యంచన్ముఖు యోగివంద్యు
నమలున్ శ్రీమద్విభూషోజ్జ్వలున్
నిత్యుం జక్రపినాక సా
భయవరున్ నీరేజబంధుద్యుతిన్
శ్రుత్యక్షిప్రవరాతపత్రునిని
త్ర్యక్షున్ శ్రీ నృసింహప్రభున్.

(ప్రథమ బింబము 121 పద్య.)

రామకృష్ణుని ఘటికాచలమాహాత్మ్యము 1902 లో రాజమహేంద్రవర కళావతీ ముద్రాక్షరశాలయందు ముద్రితము. ఇంతవఱకుఁ బునర్ముద్రితము గాలేదు. నేఁడా ప్రతు లలభ్యములు. ముద్రితప్రతిఁ జూచి వ్రాఁతప్రతి నామిత్రు లొకరు వ్రాసిపంపిరి. అందుఁ జాలతప్పులు, గ్రంథపాతములు గలవని సూచింపఁబడియె. దీని తాళ్పత్రప్రతులు తంజావూరి గ్రంథాలయమునఁ గలవఁట (సం. 158, 159). ఆ ప్రతులలోను మఱియెందేని లభింపగలప్రతులతోను సంప్రతించి శోధించి సరిగాఁ బునర్ముద్రింపవలసిన భారము భాషోద్ధారకులపై నున్నది. మఱి కొక్కొండ పంతులవారి ఘటికాచలమాహాత్మ్యమును భారతీ సంపాదకమహాశయు లచిరకాలమునఁ బ్రకటింపఁ జేయుదురు గాక.

# 'రెండభ్యుదయ గేయాలు'

## శ్రీ బైరాగి

ఆగస్టు నెల 'భారతి' లో శ్రీ కురుగంటి సీతారామయ్యగారు వ్రాసిన 'రెండు అభ్యుదయ గేయాలు' అనే విమర్శ చదివాను. అందులో 'నా కొండంచెం నమ్మక మివ్వు!' అనే నా గేయాన్ని గురించిన విమర్శ కొంత ఉంది. ఈ సందర్భంలో కొంత స్పష్టీకరణం అవసరమని తోచి ఇది వ్రాస్తున్నాను.

సీతారామయ్యగారు నా గేయాన్ని 'అభ్యుదయ గేయం' గా పేర్కొన్నారు. ఇది వీరు వేళాకోళంగా అనలేదనే గ్రహిస్తాను. 'అభ్యుదయ' మనేది అభ్యుదయరచయితల సంఘం చెప్పేదే ఐనట్లయితే నేనభ్యుదయ కవి కానేమో నని నా సందేహం. సీతారామయ్యగారికి విషయంలో ఏమన్నా అనుమాన ముంటే 'అభ్యుదయ రచయితల ఐదవమహాసభా సంచిక' తీసి చూడవచ్చును. రమణారెడ్డిగారు ఎంతో దయతో ఆంధ్రలోకానికి ప్రసాదించిన 'అభ్యుదయ' కవుల పట్టికలో నా పేరు లేదు. కనీసం నార్ల చిరంజీవిగారు తయారు చేసిన 'అభ్యుదయ బాలరచయితల' (బాలరచయితలంటే ఇక్కడ పిల్లలకోరకు వ్రాసే వాళ్ళని, పిల్లవ్రాతగాళ్ళు కాదని ఊహిస్తాను.) పట్టికలో కూడా నా పేరు లేదు. కాబట్టి నేను అభ్యుదయ రచయితను కానని తేటతెల్లమౌతున్నది. సీతారామయ్యగారు 'అభ్యుదయ' శబ్దాన్ని వేరే అర్థంలో వాడివుంటే నేను చెప్పలేను. 'ఆధునిక' గేయమంటే సమంజసంగా ఉండేదనుకుంటాను.

'నా కొండంచెం నమ్మక మివ్వు' అనటంలో కవి ఎవరిని నమ్మక మివ్వమంటున్నాడో తెలియడం లేదని సీతారామయ్యగారు వ్రాస్తున్నారు. కవి నమ్మక మిచ్చేవాని ఊరూ, పేరూ, చిరునామా మొదలైనవి

ఇవ్వక అశ్రద్ధచేయటం నిజంగా శోచనీయమే. కాని అలా చేయలేదు కాబట్టి, కవి నమ్మకమివ్వమని, తనని తానే అడుక్కుంటున్నా డనుకోవటంలో దోషమేముంది? 'పరమశివుడు' అనే పదానికి బ్రాకెట్లలో ('ఉత్తి శివుడు కాదు') అని వ్యాఖ్యానించారు సీతారామయ్యగారు. 'పరమశివుడు' అనేది అంత క్లిష్టమైన పదమా? లేక పాఠకులకి ఇంకా సులభంగా బోధపడాలనే సదుద్దేశ్యంతో అలా చేశారా సీతారామయ్యగారు?

ఇక రచయిత 'అసమర్థత' ను గురించి కొంత చెప్పవలసివుంది. విమర్శనీయ గేయంలో కవి తనకే దృఢవిశ్వాసముంటే తానేయే పనులు చేయగలిగిందీ చెప్పాడు. ఆ చెప్పిన పనులు అసంభవ కార్యాలే. అందులో సందేహంలేదు. పైగా యీ విషయం సామాన్యబుద్ధి వున్న ప్రతిఒక్కనికీ తెలుస్తుంది. మరి కవి అలా ఎందుకన్నాడు? సీతారామయ్యగారి వంటి విమర్శకులు ఆమాత్రం నిదానించి ఆలోచించలేకపోవటం అన్యాయం.

ఈ కవితయొక్క ఉద్దేశ్యం నమ్మకంలోని గొప్పదనాన్ని సూచించటం. దృఢవిశ్వాస మున్నట్లయితే అసంభవకార్యాలు కూడా సంభవమౌతాయని సూచించడానికే కవి ఏరికోరి అసంభవ కార్యాలన్ని ఉదహరించాడు. కవియొక్క శక్తతాశక్తతలు కావు ఇక్కడ విచారణీయాంశాలు. ఇక్కడ ఉద్దేశింపబడినది నమ్మకపు గొప్పదనం. 'ఊహాకందని విషయం గీతంలో నిండివున్నదని' సీతారామయ్యగారు అంటున్నారు కాని ఇందులో ఊహాకందని విషయమేమీ లేదు. నమ్మకముంటే కవి చేస్తానన్న పనులు మామూలుగా చేతల కందనివి మాత్రమేను. 'చితికిన టొమాటో' 'ఆరిన అప్పడం' 'ఎంగిలి పళ్లెం' మొదలైనవాటితో సూర్య చంద్రాకాశాదులను పోల్చడం వైచిత్రికోరకు కాదు. సూర్యచంద్రాదులను హీనపరచటానికీ కాదు నమ్మకమున్నవానికి అటువంటి మహనీయ వస్తువులు కూడా ఎంత తుచ్ఛంగా కనిపిస్తాయో సూచించడానికే. పోతే కవితలో 'అహంభావభావం' ఎక్కడుందో నాకు కనపడటంలేదు. 'సుజన విధేయుణ్ణి' అని క్రింద వ్రాయక పోవటమే దోషమైతే నేను చెప్పలేను. 'ఈ భీభత్సమునకు నమము' అన్నారు సీతారామయ్యగారు. కవిత భీభత్స రసం కలదికాదు. అది 'ఏ భీభత్సమో' వివరించలేదు సీతారామయ్యగారు. వారు గీతంలో 'కవియొక్క అతిక్రమత' ను దర్శించారు. సిగరెట్టు ఉపమాన పరంపరలో కూడా వారికి కవి 'స్వీయ చరిత్ర' గోచరించింది. ఇక్కడ ఒకవిషయం చెప్పవలసివుంది.

కథకుడుగానీ, కవిగానీ 'నేను' అని రాసిన ప్రతి రచనలోనూ స్వీయచరిత్ర వ్రాసుకోడు. ఇతరులతో తాను ఏకమై 'నేను' అని వ్రాస్తాడు. కథానాయకుని కవితానాయకుని గుణదోషాలన్నీ కవికి, కథకునికీ అంటగట్టే పొరబాటు విజ్ఞులు చేయరు. కవి అసమర్థతను పలుమారు పేర్కొన్నారు సీతారామయ్యగారు. అది ఏ 'అసమర్థతో' బోధపడటంలేదు. కవితావిషయకమైన అసమర్థతా? లేక కవి పేర్కొన్న అసంభవ కార్యాలు చేయలేకపోవటంలోని అసమర్థతా? సీతారామయ్యగారికి అరుచి కలిగించినది గీతవస్తువా? ఎందువల్లనంటే 'అశిథిలపదబంధముతో గేయము మాత్రము చక్కనిరీతి' లో ఉందని వారే ఒప్పుకొంటున్నారు. కవితావస్తువు నుంచి ఫక్కిని, రీతిని విడదీయటం సాధ్యమా? సిగరెట్టు ఉపమాన పరంపరలో ఉదాత్తత లేదనటానికి సందేహంలేదు. కాని అక్కడ ఉదాత్తత అసందర్భం. నమ్మకంలేని బ్రతుకు ఎంతతుచ్ఛమో చూపించటానికే కవి అటువంటి హేయోపమానాలు బుద్ధిపూర్వకంగా వాడుకున్నాడు. రేణుకణంతో పోల్చవలసిన చోట మేరునగాన్నరుకొనే మూఢుడు కవి ఎలాఔతాడు? మరోవిషయం; ఆధునిక మానవుడు దృఢవిశ్వాసాల్లేక అల్లాడుతున్నాడు. మనకు ప్రాతనమ్మకాలు పోయాయి. కాని క్రొత్తవి కలుగలేదు. సందిగ్ధం ఆధునిక మానవుని ప్రథమ సంకేతంగా కనుపిస్తున్నది. సుదృఢ విశ్వాసంకోసం, నిశ్చింతాత్మ జీవనంకోసం అతడు తపిస్తున్నాడు. కాని ఇదే అతనికి దుర్లభమౌతున్నది. ఈ మానసికాధ్యాత్మిక క్లిష్టస్థితిని చిత్రించటమే విమర్శనీయకవితాలక్ష్యం. సీతారామయ్యగారు 'అంతయు వాచ్యమే గాని ఎచ్చటా వ్యంగ్యవాసన లేద'ని నుడివారు. కాని గేయమంతా వ్యంగ్యమే. అసంభవ కార్యాలు ఏకరవటంలో వెటకారంగా 'సత్రాల, చలివేంద్రాల' సంగతి ప్రస్తావించి తాను 'కొయ్యతుపాకి దొరన'ని చెప్పుకోవటంలో ముఖ్యమైన ఉద్దేశ్యం ఇదే. అంతేగాని 'కొయ్యతుపాకి మీద' రాసిన గేయం సీతారామయ్యగారిని విమర్శకు పురికొల్పలేదు.

మరో ముక్కఛందస్సునుసరించి. సీతారామయ్యగారి కవితను భావగద్య మన్నారు. కాని

ఒకవిలక్షణమైన లయమాత్రం ఉందని ఒప్పుకోక తప్పకన్నారు. గద్యమే అయితే 'వాటికి కావ్యత్వాన్ని కల్పించిన' ఈలయ ఎక్కడినుంచి వచ్చింది? గద్యంలో లయ ఉంటుందని నే నింతవరకూ వినటమే గాని, అలాంటి గద్యం చదివి ఉండలేదు. ఛందస్సులకు సంబంధించిన ఏవో కొన్ని నియమాలు పాటించక పోతే గద్యానికి లయ రాదు. ఉదాహరణకు సీతారామయ్యగారు భావగద్యమని పిలిచిన ఈ కవితలోని కొన్ని చరణాలు తీసుకొందాం 'నాకొకించెం (6 మాత్రలు) నమ్మక మివ్వు!' (7 మాత్రలు.) ఇలా ఈ కవితలో సర్వత్రా ఆరు, ఏడుమాత్రల వాక్యాంశాలలో పనిగడుపుకొనబడింది. ఆరుమాత్రలు వాడినప్పుడు తీవ్రగతి స్ఫురిస్తుంది. ఏడుమాత్రలు వాడినప్పుడు గతి మందంగా ఉంటుంది. ఒక్కొకచోట గతి విరుగగొట్టవలసి వచ్చినప్పుడు ఐదారు మాత్రలు వాక్యాంశాలు కూడా వాడబడ్డాయి ఇలా మాత్రా భిన్నతి కల్పించడంవల్ల కవికి స్వేచ్ఛయేగాక చదువరులకు విసుగుదలకూడా ఉండదు. కవితా ధారావేగం భావావేగాని కనుకూలంగా క్షిప్రమందగతులతో ప్రవహిస్తుంది.

ఈ స్పష్టీకరణం అవసర మనుకొన్నందువల్ల ఈ కొంచెం వ్రాయవలసి వచ్చింది. సీతారామయ్యగారు పాఠకులు కూడా, అన్యథా భావించరని ఆశిస్తున్నాను.

# బొమ్మలాట, యక్షగానము

### యస్వీ జోగారావు

నేను క్రిందటి నెల భారతిలో పైశీర్షికతో ఒక వ్యాసము వ్రాయుచు అందులో సూత్రధార ప్రసక్తి గల శాసనాలు కొన్ని బొమ్మలాటవారికి సంబంధించిన వని ఊహించవచ్చు నంటిని. కొన్ని అట్లు సంబంధించినవి కావచ్చును గాని ఆ సూత్రధార ప్రసక్తిగలిగిన వన్నియు బొమ్మలాటవారికి సంబంధించినవి కాజాలవనియు, సూత్రధారశబ్దము శిల్పులకు కూడ పర్యాయవాచక మనియు ఆచార్య శ్రీ గంటి జోగిసోమయాజి గారివలన ఇటీవల తెలిసికొంటిని.

స్పష్టముగా బొమ్మలాటవారికి సంబంధించిన యింకొక శాసనము తెలియవచ్చినది. అది నెల్లూరు శాసనము లను గ్రంథము 3 వ భాగములోని ఉదయగిరి తాలూకా నెం. 47-వ శిలాశాసనము. అది—
"ప్రమాది సంవత్సర ఫాల్గుణ శుద్ధ 3 లు వీరురిధ్ధొరకై జీతపువారు బొమ్మలాట వీరప్పకు ఇచ్చిన భూదాన ధర్మశాసనం. అశివేముల, చిశాతిలంగం, అర్లపల్లె, వాడకొమార వెంకటాద్రి నాయని వారికి పుణ్యంగా సర్వాగ్రహారంగా దారదత్తం చేసి మాకిస్తింగన ముమూరుచేసుక పుత్రపవుత్ర పారంపర్యంఅనుభవించి బ్రతికేది." శాసనకాలము దీనినిబట్టి తెలియదు కాని యిందు పేర్కొనబడిన యాతడు వాడ కాక వాడ కుమార వెంకటాద్రి నాయ డనుకొన్నచో— వాడ పెదవెంకటాద్రినాయ డను నాతనికి సంబంధించిన రెండు తామ్రశాసనములు గన్పట్టుచున్నవి. (చూ. నె॥ శా॥ 1 వ భా. తా. శా. నెం. 8 & 9.) అవియు ఉదయగిరి తాలూకావే. ఆ శాసనకాలములు వరుసగా శా. శ. 1573 ; 1608 క్రీ. శ 1651 ; 1686. ఈ కుమార వెంకటాద్రి అతనికి తమ్ముడో కొడుకో అయియుండు ననుకొన్నచో పై బొమ్మలాటవారి శాసనము క్రీ. శ. 17 శతాబ్ది ఉత్తరార్ధమున వేయ బడినదై యుండవచ్చు నని యూహ.

బొమ్మలాట నుండియే యక్షగానము పరిణామ మందిన దని కొందరు పండితుల తలంపు. (చూ. డాక్టరు శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారి 'యక్షగానము తంజావూరు', ఆంధ్రపత్రిక ఖర సంవత్సరసంచిక) ఇందుల కింకొక యూహ ఉపబలకముగా నున్నది. ప్రదర్శనల కుద్దిష్టములైన యక్షగానము లందును సంధి వచనము లున్నవి. దృశ్య ప్రబంధమున సంధివచనము లనవసరము. పాత్రల ముఖవికృతి చేష్టాదిక మంతయు నందు ప్రత్యక్షముగా చూపవచ్చును. తోలుబొమ్మలాటలో ఆ యవకాశము లేదు. కాని కథాక్రమ పరిణతిని నిరూపించుటకు వాని సూచనమైన చేయుట అవసరము. అందులకు సంధివచనముల నాశ్రయింప వలెను. అవి యక్షగానము లందును నిలచియుండుట చూడ యక్షగానములు తోలుత నుండియు తోలు బొమ్మలాటల కుపయోగింపబడుచుండెనని తోచును.

నేను నా వ్యాసమున నేదోకొంత సామ్యమును బట్టి బొమ్మలాట విరూపాధిపుడును, లేపాక్షి దేవాలయ నిర్మాతయగు విరూపన్న యగునా యని అనుమానించితిని. కాని వారు వేర్వేరు వ్యక్తులని శ్రీ టి. దోణప్ప గారు నా కెరిగించిరి. రెండవ విరూపన్న గురించి దక్షిణహిందూ దేశ శాసనములు *Vol IX Part II* లో కొన్ని శాసనముల నెత్తిచూపిరి. (నెం॥ 585, 536, 537, 538 *etc*,).

# గ్రంథ విమర్శనము



## ఆంధ్ర ధ్వన్యాలోకము

### ద్వితీయ భాగము

అనువాదకులు: శ్రీ పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రి; ప్రాప్తిస్థానము: రచయిత; మహారాజా సంస్కృత కళాశాల — విజయనగరం. వెల రు. 4-0-0.

ఇది ఆనందవర్ధనాచార్యులవారి ధ్వన్యాలోకానికి అనువాదం. ప్రథమ ద్వితీయోద్యోతములుగల ప్రథమ భాగం, 1944 లోనే వెలువడ్డది. తృతీయోద్యోతంలోని మూడు వంతులుగల ఈ ద్వితీయభాగం వెలువడటానికి యింతకాలం పట్టింది. ఇంకా తృతీయోద్యోత శేషమూ, చతుర్థోద్యోతమూ, వెలువడవలసివుంది. గ్రంథరచన యావత్తూ 1933 లోనే పూర్తి అయినా, దీని ప్రకటన ఇలా అంచలు అంచలుగా ఇంతింతవ్యవధితో ఆలస్యంగా జరుగుతూ వున్నదంటే, శ్రీ శాస్త్రిగారికి ఆంధ్ర ప్రజలనుండి తగిన ఆర్థిక సహాయం లభించకపోవటమే ఇందుకు కారణమని మనం ఊహించవలసివుంది. అయినా నిరుత్సాహపడక ఈ గ్రంథాన్ని ఆంధ్ర ప్రజలకు అందజేయటానికి ప్రయత్నించుతున్న శాస్త్రిగారి పట్టుదల శ్లాఘనీయమైనది.

ధ్వన్యాలోకానికి, మహామహుడైన అభినవగుప్తపాదుడు రచించిన 'లోచన' వ్యాఖ్యను ప్రధానంగానూ, యితర ప్రముఖవ్యాఖ్యాతల అభిప్రాయాలనూ, సేకరించి, చర్చించి, ప్రభామతి అనే పేర తెలుగున తమ స్వంత వ్యాఖ్యను విరచించి, ఈ అనువాదానికి చేర్చారు.

మూలంలో లక్ష్యాలుగా ఇచ్చిన శ్లోకాలను తెలుగు పద్యాలుగా అనువదించి పంతిన చేశారు. ఈ విషయాలనన్నిటినీ పరిశీలించితే ఈ మహా గ్రంథాన్ని సంఘటించటానికి శ్రీ శాస్త్రిగారు తీసుకున్న శ్రద్ధ ఎలాంటిదో మనకు అర్థమవుతుంది.

కాని ఒక విషయంమాత్రం చెప్పవలసివుంది. ధ్వన్యాలోకాన్ని గాని ఇతర అలంకారశాస్త్ర గ్రంథాలను గాని తెలుగులోకి అనువదించటంలోగల ప్రయోజనం ఏమిటి?

(1) విశేషసంస్కృత పాండిత్యం లేని తెలుగు కవుల ఉపయోగార్థం.

(2) సంస్కృతపాండిత్యం లేనివారూ, సాత్వశప్రియులూ అయిన సామాన్యులకు కావ్యాలను చదివి సంపూర్ణానందాన్ని పొందగలిగే శక్తిని కలుగజేయటం. అంటే పైపైని కథ మాత్రమే చదువుకుపోవటం కాకుండా పదపదంలోనూగల మాధుర్యాన్ని విమర్శకదృష్టితో అవగతం చేసుకుని ఆనందించే శక్తిని ప్రసాదించటం.

(3) సంస్కృతభాష రాకుండా ఆంధ్రాంగ్ల భాషలు మాత్రం చదువుకుని, ఆంగ్లేయ విమర్శన సంప్రదాయం ప్రకారం, మన మహా కావ్యాలను విమర్శించి వ్రాయబడుతున్నవారికి, మన విమర్శనసంప్రదాయ మెలాటిదో, వారి దృష్టిపథానికి తెచ్చి సరియైన విమర్శన సంప్రదాయాన్ని ప్రతిష్ఠించటానికి ప్రయత్నించటం.

పై మూడు ప్రయోజనాలను సాధించటమే పరమధర్మమనే విషయాన్ని శ్రీ లక్ష్మీనారాయణ శాస్త్రిగారే కాక ఇతర ఆంధ్ర ఆలంకారికు లెవ్వరూ కూడా కాదనరనుకుంటాం. అనువాదాలు సంస్కృత భాషాపాండిత్యం లేని వారికొరకే ననేది విస్పష విషయం. ఈ రచన చేసేటప్పుడు శ్రీ శాస్త్రిగారి దృష్టిలో అలాంటి ప్రజలు ఉన్నారా అనేది అనుమానాస్పదమైన విషయం. ఈ క్రింద వాక్యాలను చిత్తగించితే ఈ విషయం అవగతమౌతుంది:

'వివక్షితాన్యపరవాచ్యధ్వనియందు ద్విప్రకారముగనే యనుస్వానోపమ వ్యంగ్య, (సంలక్ష్యక్రమ వ్యంగ్య) రూపప్రభేద ముదహరింపబడినదో, అదికూడ కొన్ని ప్రబంధములయందు భాసించుచున్నది...'

'తృష్ణాక్షయరూపమగు సుఖము పరిపుష్టమగునప్పుడు తృష్ణాక్షయ సుఖపరిపోష స్వరూపమగు శాంత

రసము ప్రతీయమాన మగుచునేయున్నది. దీనికి నిర్వే దము—స్థాయిభావము.'

'ఇంతేగాక, శరీరులయందువలెనే కావ్యముల యందును సౌందర్యప్రతీతి కూడ సంస్థాన విశేషా వచ్ఛిన్నమగు (అవయవ విశేషవిశిష్టమగు) సముదా యము (అవయవి) చేత సాధింపవలసిన దయినను అన్వయ వ్యతిరేకములచేత భాగముల (అవయవముల) యందు కల్పింపబడుచున్నది. కావున వ్యంజకత్వ ముఖమున పదములయందుగూడ వ్యవస్థితమగు ధ్వని వ్యవహారము నిరోధించునది కాదు.'

ఈ విషయంలో ఈ గ్రంథం ఇంకా కొంత నయం. 'నవరసగంగాధరా'ది ఇతర గ్రంథాలు ఇంకా మరింత భయంకరంగా వున్నయ్.

అలంకారశాస్త్ర విషయికమైన ఒక వ్యాసా నికి తొలివాక్యంగా, ఒక పెద్దలు — 'సంవిత్ సంవేద్య మగు వస్తువు సంవిదాశ్రితమై యుండును' అని రచించారు.

శాస్త్రీయవిజ్ఞానానికి సంబంధించి అనేక సంస్కృత గ్రంథాలు తెలుగులోకి రావలసివున్నయ్. వీటిని అనువాదం చేస్తున్నది సంస్కృత పండితుల ఉపయోగార్థం కాదనే విషయాన్ని దృష్టిలో వుంచు కోకపోతే అట్టి అనువాదాలవల్ల ప్రయోజన మేమీ వుండదు.

## నూతిలో గొంతుకలు

ఖండకావ్యసంపుటి; రచన : శ్రీ బైరాగి; ప్రచురణ: గ్లోబ్ ట్రేడర్స్, గుంటూరు 2. వెల రు 1-0-0.

ఈ సంపుటిలో, 'నూతిలో గొంతుకలు' 'హామ్లెట్ స్వగతం', 'అర్జున విషాదయోగం', 'రాస్కల్ నికొవ్', 'సంఘర్షం', 'ఒక సమష్టి ప్రార్థన' 'కవి సమస్య' అనే ఏడు ఖండకృతు లున్నయ్.

'ఈ కావ్యంలో నేను అంటే కవి కాదు. నేటి మానవుని అనుభూతి, అది కవి తాదాత్మ్యం'— అన్నారు రచయిత తొలిపలుకులో. ఈ మాటమాత్రం అబద్ధం. కవికి ప్రజాదృష్టి లేదు. ప్రజల మనఃస్థితి ఎలా వుంటుందో అవగతం చేసుకోవటానికి కవి ప్రయత్నిం చుతున్నట్టు ఈ రచనలలో ఎక్కడా తార్కాణం కనుపించదు. కవికి జీవితంలో ఒక ధ్యేయం లేదు. నిరాశాపూరితమైన తనమనస్సుకు ప్రతిబింబంగా యీజగత్తును ఊహించారు. నిరాశను వ్యక్తం చెయ్య టానికి లభించగల యావత్తు భావజాలాన్ని శబ్దజాలాన్ని పనిగట్టుకుని పోగుజేసుకొచ్చి ఈ యేడు సీసాలలోకి నింపారు. ఏదైనా ఒక కావ్యాన్ని చదివితే ఆ చది వినవాడికి ఒక క్రొత్త చైతన్యం కలగాలి. అలాటి అవ కాశం లేకపోతే కావ్యపఠనం నిష్ప్రయోజనకరం. ఈ రచనలు అలాంటిచైతన్యాన్ని కలుగజేయులేక పోగా ఉన్న ఆత్మవిశ్వాసాన్ని హత్యచేసి ఎందుకూ కొరగాని నిరాశావాదిగా తయారు చేస్తయ్. ఈ గ్రంథాన్ని ఆమూలాగ్రం చదవగలగటానికి నిజానికి మనిషికి ఎంతో మొండి ఓర్పు ఉండాలి. ఈ రకం కావ్యాలను అలా కొంతకాలం మొండికేసి చదివితే మెదడు చెడుతుంది. మచ్చుకు, నూతిలోని గొంతులు అన్న కావ్యంలోని తొలిపంక్తులు కొద్దిగా ఉటం కించుతాం.

రాత్రి
కాలరాత్రి
కరాల కాలరాత్రి
ఆదిమ తమస్సులు ఆవరించాయి ఆకాశాన్ని
అవనిని, అనాథ హృదయాన్ని
కప్పేశాయి కాటుక చీకటిమంచులు
ప్రళయోన్ముఖ పురాతన ప్రపంచాన్ని
శబ్దం లేదు గాలిలేదు
చీకటికి జాలిలేదు
చూపులేని రూపులేని
రేపులేని, మాపులేని
ఈ పెనుచీకటి నిముసం
బ్రతుకుల నల్లని కుబుసం
మన్ను తిన్న దానిలాగ
కలి కల్మషకలుష రాసి
నిండిన దిగంతరాలం' —ఇత్యాదయః

## బాల సుమతిశతకము

ఇది ఒక విచిత్రమైన ప్రయత్నం; ప్రచురణ కర్త శ్రీ కె. నారాయణరావుగారు, ఈ తమ ప్రయ త్నాన్నిగురించి ఇలా వివరించుతున్నారు.

'ఒకనాడు మా యింట మా యన్న కుమారుడు 'వాణీప్రసాదు' అను నెనిమిదేండ్ల పిల్లవాడు సుమతి శతకములోని

'ఆఁకలి యుడుగని కుడుపును
వేఁకటియగు లంజ పడుపు విడవని బ్రతుకున్'—

అను పద్యమును జదువుచుండెను. ఆ పద్యము చివరి పాదములో, శతకకర్త చెప్పిన ట్లీభావము 'మేకల పాడికన్న రోతగా' నుండినది. పైఁగా నా బాలుడు 'లంజ పడుపు', 'లంజ పడుపు' అని పలు మాఱు వల్లెవేయుచుఁ బద్య పాఠమును గంఠస్థము చేసి కొనుచుండెను. నే నచ్చెరువంది వాని యొజ్జను విచా రింపుడు, బాలశాలలో గ్రముదప్పక సుమతి శతకము

లోని పద్యముల బాలురకు జెప్పుట యాచారమని నాకు దెలిసినది. శతకకర్త యాదిలోనే

"ఆరూఢిగ సకలజనులు నౌరా యనగా
ధారాళమైన నీతులు
నోరూరగ చవులు పుట్ట నుడివెద సుమతీ."

అని తన యాశయమును వెల్లడించినాడు. శతకమున జెప్పబడిన నీతులు కేవలము బాలురకే గాదు; 'సకల జనులకు' నుద్దిష్టములు. ఇందు వేశ్యాగర్హణము, స్త్రీ దూషణము, అశ్లీల స్ఫోరకములగు నీతులు ఎన్నెని గలవు. వీని నన్నింటినీ గ్రోడీకరించి సోదాహరణముగా నిరూపించినచో నేతద్గ్రంథప్రచురణోద్దేశమునకే అవి ప్రతికూలములగును గావున, నా యత్నము నుజ్జగించితిని, మరియు నిక్కాడికి నధికారు లన్న ప్రబల ద్వేషము; కావుననే వారిని బీనుంగులకు బోల్చి గర్హించినాడు. కరణములపై నాతనికున్న కార్పణ్యము విస్పష్టము; 'కరణము సాదై యున్నచో' లెక్కగొన రని యతని యభిప్రాయము. 'మిడిమేలపు దొరను', 'కొండెము చెప్పెడు ప్రగ్గడ పలుకుల నాలకించెడు' రాజులను, 'మంత్రివిహీనులగు' మండలపతులను, 'కోపస్వభావులగు' నృపులను దీక్ష్ణముగా విమర్శించినాడు. పెండియు—సుంకరిని, జూదరిని, అగసాలివాని, అంగడివాని, మాలను, మంగలిని, వేసరపు జాతిని, దాసికొడుకును నగుపఱచినాడు. ఈ శతకమును నిశితదృష్టితో బరిశీలించిన దత్కర్త రాజకీయ వేత్త యనియు, అధికారగర్వ దుర్వ్యాపకు డనియు, కులతత్త్వ తారతమ్య విచక్షణుడనియు, వేశ్యావరణ నిరసనశీలు డనియు దేటగలదు. ఇట్టి ఘట్టములనుగూర్చి పచ్చిగా వర్ణింపబడిన పద్యములను దొలగించి బాలుర కోమల హృదయముల నాటుకొనిపోవువానినిమాత్రము సంగ్రహించి బాలసుమతి శతక మను పేర, మద్విరచిత టీకా తాత్పర్యములతో బ్రకటించుచున్నాను. ఉన్నత తరగతులలో బఠించు విద్యార్థుల కుపయోగపడు నను ప్రత్యాశతో శతకములోని తెలుగు మాటలకు నాంగ్లేయ పదములను సందర్భానుకూలముగా నెలకొల్పితిని. పెద్దలీ సాహసమునకు నన్ను మన్నింతురు గాక'.

ఇలాంటి సంస్కరణతో సుమతి శతకాన్ని ప్రకటించటానికి పూనుకోవటం, మార్పును అంగీకరింప నిచ్చగింపని పండితుల దృష్ట్యా సాహసకార్యమనే చెప్పాలి. కాని, పై తరగతులలో చదువుకుంటున్న విద్యార్థులకు తెలుగు టీక అర్థంకాదని ఊహించి ఇంగ్లీషులో టీక వ్రాయటానికి ఉపక్రమించటం అబ్బురపాటు కలిగించుతున్న హాస్యాస్పదమైన ప్రయత్నం.

ఈ సంస్కరణతో ఈ గ్రంథం ఇప్పుడు 64 పద్యాలలోకి కుదించబడివుంది. నిశ్శంకగా బాలబాలికలకు బోధించటానికి కూడా అనువుగా వుంది. ప్రశంసనీయమైన కృషి. ప్రచురణ: జయలక్ష్మి అండ్ కో., నెల్లూరు. వెల రు 0-4-0.

## దివ్యస్మృతులు

ఖండకావ్యసంపుటి: రచన: శ్రీ కొండవీటి వేంకటకవి. వేమన, వీరబ్రహ్మం, సిద్దప్ప, వెంకమాంబ, మస్తానయ్య, అలరాజు, కృష్ణదేవరాయలు, మూర్తికవి, నాగార్జునుడు, చిన్నయసూరి, వీరేశలింగము, అప్పారావు, రామస్వామి చౌదరి, రామలింగారెడ్డి, వేంకట నరసయ్య (ఏటుకూరి), తిరుపతి వేంకటేశ్వరులు, పొట్టి శ్రీరాములు—ఈ ఆంధ్ర మహాపురుషుల ప్రశస్తిని, రచయిత ఖండకృతులుగా వెలయించినారు. వీరికి మంచి పాండిత్యం గలదు. ప్రౌఢమైన రచన. కాని మత తాత్త్వికవిషయములకు సంబంధించినంతవరకు వీరి అనవధానత శోచనీయంగా వున్నది. ఈ పద్యాన్ని చిత్తగించండి:

'ముక్కును జెక్కునుం జెవులు
మూతియు మీసలు నల్లరాతిపై
జెక్కి సమంత్రకంబుగ స
జీవితుజేసి వసింప గొంప నీ
కక్కటికిన్ సదెల్ప కుల
కాంతను గూడను సద్దిగూర్చి రిం
దొక్కటియైన నీ తగుల
మూనునె మానక తెల్పు దైవమా!'

ప్రాప్తిస్థానము : కవిరాజ గ్రంథమాల పొన్నూరు. వెల రు 1-8-0.

## ఈశావాస్యోపనిషత్తు

అనువాదకులు : శ్రీ ఓలేటి పంచముఖేశ్వర రావు. ఈ ఉపనిషత్తును అనువాదం చెయ్యటానికి పూనుకోవటం సాహసకార్యమనే చెప్పాలి. అనువాదకులు కృతకృత్యులైనా రని చెప్పటానికి ఎట్టి అవకాశము కనుపించదు. 'ఈశావాస్య మిదగ్ం సర్వం'—అనే మాతృకకు 'ఈశ్వరుడు సర్వాంతర్యామి' అన్నది అనువాద మనిపించుకోగలదా?—

'భజగోవింద తారావళి' అనే పేర వారు ఆంధ్రీకరించి ప్రకటించిన భజగోవింద శ్లోకముల అనువాదం కూడా ఇలానే వుంది.

'ఓలేటి రామాయణ'మనే పేర రామాయణ గాథను సంక్షేపించి చిన్న గ్రంథాన్ని మరొకదాన్ని కూడా ప్రకటించారు.

ఈశావాస్యోపనిషత్తు: వెల 0-1-0; భజగోవింద తారావళి వెల 0-2-0; ఓలేటి రామాయణము

వెల 0-2-0. ప్రాప్తిస్థానం: చంద్రకళా జ్యోతిషాలయము, పురిటిపెంట, గజపతినగరం పోష్టు, విశాఖ జిల్లా.

## శ్రీ వెంకటేశస్తోత్రము

తిరుపతి దేవస్థానమువారు ప్రకటించిన, వేంకటేశస్తోత్రము, వేంకటేశప్రపత్తి, వేంకటేశ మంగళాశాసనము, అను సంస్కృత శ్లోకములకు ఆంధ్రీకరణము: అనువాదకులు శ్రీ కె. నారాయణరావు. శ్రీ నారాయణరావుగారు ఈ శ్లోకాలను ద్విపదలలోకి అనువదించారు. మధురగంభీరమైన శైలి. మచ్చుకు 'ప్రపత్తి'లో లక్ష్మీస్తోత్రం:

'జగముల కెల్ల నీశానవు, నీవు,
వేంకటపతియైన విష్ణు ప్రేయసివి,
తగురస్థలస్థిరధామతత్పరవు
సాక్షాత్ హరికి నీవు క్షాంతివర్తినివి
వనజభూషితపాణిపల్లవయుగవు,
పద్మాసనస్థవు, భవ్యాత్మవీవు,
వాత్సల్యముఖగుణవ్రాతమండితవు
భక్తకల్పకమవు, భగవతి నీవు,
లోకమాతవు సర్వలోకపూజితవు,
శ్రీలక్ష్మి! వేవేలు జేజేలు నీకు'—

గ్రంథాంతంలో వీరు ఈ ద్విపదలకు టీకను కూడా సమకూర్చారు. స్త్రీలు, సంస్కృత పరిజ్ఞానం లేని పురుషులు దైవధ్యానం చేసుకోవటానికి పనికివచ్చే హృద్యమైన రచన. వీరు లోగడ వేంకటేశ సుప్రభాత శ్లోకములను గూడా ఇదే మాదిరి ద్విపద కృతులుగా రచించి ఆంధ్ర సాహిత్యకారుల మన్నన లందుకున్నారు. ప్రకాశకులు: జయలక్ష్మి అండ్ కంపెనీ, ట్రంక్ రోడ్, నెల్లూరు. వెల తెలియదు.

## చంద్రిక

కథల సంపుటి: రచన: శ్రీ బుద్ధవరపు వేంకటరత్నం. ఇందులో చంద్రిక, పుత్రకామేష్టి అనే రెండు కథలున్నాయి. వీటిలో 'చంద్రిక' అనే కథ ఆంధ్రపత్రిక సారస్వతానుబంధంలో సీరియల్‌గా ప్రచురింపబడి ఆంధ్రప్రజల మన్నన లందుకున్నది. మంచి శిల్పచాతురిగల కథ. ఈ కథలో శ్రీ వెంకటరత్నంగారు గ్రామీణప్రజల మనఃస్తత్వాన్ని విపులంగా ద్యోతమానం చేశారు. ప్రాప్తిస్థానం: 'జాగృతి' విజయవాడ 2 వెల రు 1 0 0.

## అనుభవ సారము

మహాకవి పాలకుర్కి సోమనాథకవి ప్రణీతము: పద్యరచన; శ్రీయుతులు బండారు తమ్మయ్య, తిమ్మావజ్ఝల కోదండరామయ్యగార్లచే పరిష్కృతము. ప్రచురణ: వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్—మద్రాసు; వెల 1-0 0.

అద్వైతానికి శంకరుల అపరోక్షానుభూతి ఎలాంటిదో, ఇది వీరశైవ మతానికి అలాటి గ్రంథం. దీనిని వీరశైవమత సార మనవచ్చు. మతవిషయకంగానే గాక సాహిత్య విషయకంగా కూడా చాలా ప్రధానమైన గ్రంథం. ద్విపద రచనా పరమేష్ఠిగా సోమనాథుని కీర్తి అలా వుండగా, ఈ గ్రంథం, వృత్తరచనలో కూడా ఇతను శ్రీనాథాదులకు మార్గదర్శకుడా అనే అభిప్రాయాన్ని కలుగజేస్తుంది.

## గండిపడ్డ జీవితాలు

కథల సంపుటి: రచన: శ్రీ పి యస్. ఆర్. ఆంజనేయశాస్త్రి; ఇందులో లోగుట్టు, వయోజనుడు, బెనిఫిట్ నాటకం, చచ్చిపోతున్న చరిత్ర, గండిపడ్డ జీవితాలు, తత్వమసి; సమ్మె, త్రాసుబోతు, బురదమరక అనే కథలున్నాయి.

ప్రాప్తిస్థానం: ఆంధ్ర బుక్ హౌస్, సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 1; వెల రు 0 10 0.

## పెండ్లి ప్రయత్నాలు

సాంఘికనవల; రచన: శ్రీ కొడాలి గోపాలరావు; ప్రచురణ: ఆంధ్ర రత్న బుక్ డిపో; వెల 0-8-0.

## మిత్ర

పక్షపత్రిక: సంపాదకులు: శ్రీ వి. డి. ప్రసాదరావు. మా కార్యాలయానికి అందిన ఈ తొలి సంచికలో శ్రీయుతులు పింగళి నాగేంద్రరావు, భార్గవ, దాసు వామనరావు, మల్లాది రామకృష్ణశాస్త్రి, కె. వెంకటరావు మొదలైన ప్రముఖుల రచనలున్నాయ్. ఈ పత్రిక త్వరలో అభివృద్ధికి రాగలదని ఆశించుతున్నాం.

## అభ్యుదయ

అభ్యుదయ రచయితల ఐదవ మహాసభాసంచిక. ప్రచురణ: అభ్యుదయ రచయితల సంఘం, విజయవాడ. వెల 1-8-0.

Printed & Published For Nageswara Rao Estates Ltd., by S. Radhakrishna,
at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1.
Editor: S. Sambhu Prasad.

ద్విశక్తిగల



# మోబిల్‌గ్యాస్ వాడి

## ప్రతి గాలనుకు అత్యధిక మైలేజీ పొందండి

నేడు దొరకుచున్న పెట్రోలులలో ఏది అత్యధిక మైలేజీని యిస్తుంది? గమనీయముగ, మీ కారు ఇంజనును అత్యంత సామర్థ్యములో పనిచేసేలా ఉంచేదే. ఆ పెట్రోలే ద్విశక్తిగల మోబిల్‌గ్యాస్ —ఎందుకంటె అది మీరు కొనగలిగే ఏ యితర పెట్రోలుకన్న ఎక్కువ ఇంజను బాధలను సరిచేయును.

కనుక మీ కారు ఇంజను అధిక శక్తిని యిస్తుంది, ఎక్కువ పొదుపుగా పనిచేస్తుంది. మీ కారు లేక లారీ అది యివ్వాలన్నంత సున్నితము, శక్తివంతమైన పనిని మీరు పొందుదురు.

ద్విశక్తిగల మోబిల్‌గ్యాస్ వాడుట నేడే ప్రారంభించండి. ఈ పెట్రోలులో మాత్రమే మోబిల్ పవర్ కాంపౌండ్ కలదు. ఈ కాంపౌండ్ ఏ పెట్రోలు లోనూ యిప్పటివరకు చేరని అడిటివ్‌ల అత్యధిక శక్తిగల మిశ్రమము. మోబిల్‌గ్యాస్ వాడుట లాభము, యిది మీ డబ్బుకి అధిక విలువ నిచ్చును.



ఎగురుచున్న
ఎఱ్ఱని గుఱ్ఱపు
చిహ్నముగల చోటే
—ఇంకెక్కడా
దొరకదు!



ఎక్కడెక్కడ ఉన్న లారీ డ్రైవర్లు ద్విశక్తిగల మోబిల్‌గ్యాస్‌నే మెచ్చుకుంటారు—దీనిని వాడితే పూర్తిగా శక్తి, అధిక పొదుపు లభించుట వారు గమనిస్తారు!

స్టాండర్డ్-వాక్యూమ్ ఆయిల్ కంపెనీ (కంపెనీ సభ్యుల బాధ్యత పరిమితము)

V. 1777